

నవల :

బాడీగార్డులు

రచన :

వడ్లమన్నాటి లక్ష్మీప్రసన్న

ముఖచిత్రం :

గోపి

సంచిక :

ఆగష్టు 1979



సచిత్రమాసపత్రిక

# బాడీగార్డులు

మహాపట్టణంలో ఓ కాలేజీ వదిలిపెట్టారు। బిలబిలలాడుతూ బయటికొచ్చేశారు కాలేజీస్టూడెంట్లు. కొన్నిక్షణాలలో.... కాలేజీ ఆవరణంతా సందడిగా తయారయ్యింది. సైకిళ్ళు, రిక్షాలు, స్కూటర్లు, చిన్నకార్లు హడావుడి పడుతున్నయ్.

నడుస్తున్న చీరలు, లంగాలు రెపరెపలాడుతున్నయ్. వాటివి ఫాలో అవుతున్న బెల్ బాటమ్ పాంట్లు తహతహలాడుతున్నయ్.

ఓ త్తిడిలో వాటి స్పర్శాసుఖాన్ని అయాచితంగా పొందుతున్నయ్.।

ఆ రెపరెపల్లో....ఓ మూడింటిపేర్లు అనూరాధ, సుధారాణి, ఆశాలతలు।అనూరాధ తప్ప, మిగతాఇద్దరూ కలవారి అమ్మాయిలే। చదువు ఫాషన్‌గా, కబుర్లు ఫాన్సీగా కాలక్షేపం చేస్తుంటారు.

అనూరాధ పరిస్థితి అలాకాదు. తండ్రివున్నా లేనట్టే కుటుంబబాధ్యతల్ని గాలికి ప్రేమగావదిలేసి, ఊళ్ళుపట్టుకు తిరుగుతుంటాడు. తల్లి ఒక్కతే ఆమెకిఆధారం. భర్త ప్రయోజకత్వం కళ్ళారా చూశాక, అతనిమీద ఏమీ ఆధారపడలేదామె. పుట్టింటివారు పసుపూ కుంకుమగా యిచ్చిన కొద్దిపాటి పొలాన్ని కాష్‌రూపంలో మార్చి బాంకిలోవేసింది. మిషన్‌కుడుతుంది. ప్లాస్టిక్‌వైరుతో బుట్టల్లి మార్కెట్టుకేస్తుంది. జాగ్రత్తగా సంసారాన్ని నెట్టుకొస్తూ, అనూరాధని బి. ఏ. ఫైనల్ ఇయర్ చదివిస్తోంది.

అందువల్ల సుధారాణి, ఆశాలతల మాదిరిగా, ఖరీదైన 'షో' కనిపించదు అనూరాధలో. కానీ, సహజసౌందర్యం ఎక్కడికి పోతుంది? చక్కని గుండ్రని మొహం! మిలమిలలాడే కళ్ళు. తీరైన నాసిక, చిలిపిగా నవ్వించే గుండ్రని పెదవులు, తుమ్మెద రెక్కలలాంటి నొక్కులజుట్టు, పచ్చని పసిమిఛాయ. అనూరాధని ఒక్కసారి చూసిన మగవాడెవడూ అంతతేలిగ్గా ఆమెమీంచి దృష్టి మరల్చుకోలేడు.

ఆ అందాల సుందరిముందు సుధారాణి, ఆశాలతల చక్కదనంఅంతగా రాణించదు. వాళ్ళిద్దరూ అనూరాధలాంటి పేదపిల్లతో స్నేహం చేయటానికి ఆమె అందమే కారణం.

అనూరాధ, సుధారాణి, ఆశాలతలు సరదగా కబుర్లుచెప్పుకుంటూ, వయ్యారంగా నడుస్తున్నారు. మధ్యమధ్య కిలకిలానవ్వుకుంటున్నారు. ఇద్దరిమధ్యలోఉంది అనూరాధ.

ఉన్నట్టుండి, వారివెనక పెద్దపెట్టున పకపకలువినిపించాయ్. ఆ నవ్వులు, వాళ్ళని అపహాస్యం చేస్తున్నట్టనిపించి, ఉలిక్కిపడి వెనక్కి తిరిగారు. వెనకగా నాలుగు బెల్‌టాటమ్ పాంట్లు తమని ఫాలో అవటం గమనించారు. అంతే! అసహ్యంతో తలలు తిప్పుకుని, మరబొమ్మల్లా నడవటం మొదలుపెట్టారు.

బెల్స్ తమ ప్రతాపం చూపించసాగాయి.

"ఒరేయ్! ప్రసాద్, నువ్వు కిలకిలానవ్వితే యెంతో బాంటుందిరా!" గోపీ కిచకిచమన్నాడు.

"మా ముగ్గురిలో, ఎవరికిరా నీ కాంప్లిమెంటు? ఇడియట్!" ప్రసాద్ ఠావ గర్వితంగా అడిగాడు.

వాళ్ళ కామెంట్ చేసేది తమనే అవి తెలిసిపోతూనేవుంది. ముగ్గురు ముద్దుగొమ్మలకి. కానీ, ఏం చెయ్యగలరు? ఇష్టంలేక పోయినా వినక తప్పదు.

"సెంటర్ ప్లీజ్!" శేషు - ప్రసాద్ భుజంమీద ఒక్క చరుపు చరిచాడు.

అనూరాధకి ఎంతో బాధ కలిగింది - స్నేహితురాళ్ళని వాళ్ళలా అవమానిస్తున్నందుకు.

"ఒరేయ్! మా ఇద్దర్నీ వదిలేశారేరా? ఏంపాపం చేశాం మేము?" శేఖర్ జాలిగా అడిగాడు.

"వదిలేసే ప్రసక్తే లేదురా ఫూల్! మూడూ మనసొంతమే!" గోపీ గిరజాల జుట్టు సవరించుకున్నాడు.

"మరి మనం నలుగురం ఉన్నాంకదరా!" ప్రసాద్ అనుమానంగా అడిగాడు.

"దాందేముందిరా? ఎలాగోలా తిప్పలు పడదాంలే! మనలో మనకేమిటి!" శేషు తన కొత్తబట్టల్ని.... గర్వంగా చూసుకున్నాడు.

సెంటర్లో చిలకా? నీ పేరేమిటే!" శేఖర్ నాటకీయంగా అన్నాడు.

"హేమమాలిని" గోపీ చిలకపలుకులు పలికాడు.

"ఎడంపక్క గువ్వా! నీపేరేమిటే!" ప్రసాద్ పలకరించాడు.

"జయసుధ" శేషు మాటల్లో వయ్యారం చిలికించాడు.

"కుడిపక్కమైనా! నీ పేరుకూడా చెప్పవే?"

"జయప్రద"

"అరేయ్! నాకు హేమమాలిని కావాల్రోయ్!"

"నాకు జయసుధ కావాల్రోయ్!"

"నాకు జయప్రదే కావాలిరా!"

పాపం మనశేషుగాడు మిగిలిపోయాడ్రా! వాడు ఏడుస్తుంటే మనం ఊరుకుంటే.... "మిత్రద్రోహంరా!"

"అందుకని ఏంచేద్దాం చెప్పా!"

"ఒరేయ్ గోపీ ఓపనిచేద్దామా!"

"ఏమిట్రా ప్రసాద్ అది?"

"మూడు పిట్టల్ని.... మనం రంజుగా నంజుకుతిన్నాక....

శేషుగాడికి పంచిపెడదాంరా!" బండరాళ్ళు దొర్లించినట్టుగా నవ్వారు నలుగురూ.

కుతకుత ఉడికిపోయారు ముగ్గురు కాలేజీ అమ్మాయిలూ!

రోజూ ఉండే భాగవతమే ఇది! అయినా వాళ్ళ సూటీపోటీ మాటలకి రోషం రాక మానదు. లెక్చరర్లకి చెప్పినా, ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్‌చేసినా, అంతగా ప్రయోజనం కనిపించదు. అందరికీ భయమే బాడీగార్డులంటే.

తాముగా స్లిప్పరుతీసి ఎడాపెడా దులిపేస్తే .... జరిగేదేమిటో తెలుసు ఆ ముగ్గురుకీ.

ఈ మధ్యనే జరిగిన ఓ దారుణమైన సంఘటన ఇంకా వాళ్ళ కళ్ళకి కట్టినట్టుగానే ఉంది.

సురేఖ ఫస్టియర్ బి. ఎస్.సి. స్టూడెంటు. మనిషి ఛాయ రంగులో ఉంటుంది. అయినా ముఖంలో ఏదో ఆకర్షణ!!

ఓరోజు సాయంత్రం క్లాస్‌మేట్స్‌తో కలిసి ఇంటికి వెడుతోంది. వెనకాల ఇద్దరు బాడీగార్డులు వెంబడించారు. వాళ్ళ యిష్టం వచ్చినట్టు వాగటం మొదలుపెట్టారు.

"ఓ.... బ్లాక్ క్వీన్!" అన్నాడు అందులో ఒకడు.

సురేఖ మనసు గాయపడింది.

కోపంగా వెనక్కి చూసింది.

నీరంగు నలుపు. నారంగు తెలుపు. అయినా ఐ లవ్ యూ! ఎ. సి. రూం బుక్‌చేస్తాను. లాడ్జిలో నీనలుపు- నాతెలుపు శరీరాలు కలుపుకుందాం. వలపులోతులు తెలుసుకుందాం." అన్నాడు- పైత్యధోరణిలో.

సురేఖ చాలా సున్నితహృదయంకల అమ్మాయి. ఆ మాటల్లోని అవమానం భరించలేకపోయింది. కాలి స్లిప్పరు ఊడదీసింది. స్నేహితురాళ్ళు వారిస్తున్నా వినలేదు. ఆవేశంలో ఆదిశక్తిరూపం ధరించింది. విసవిసా నడుస్తూవెళ్ళి అతని చెంపలు ఎడా పెడా వాయించింది.

"రాస్కెల్! ఎలా ఉందిరా? నా స్లిప్పరూ... నీ చెంపలూ కలుపుకుంటే?" అంది, ఉద్రేకంలో ఊగిపోతూ, కిలకిలానవ్వారు మిగతా అమ్మాయిలు. ఎన్నిమాటలన్నా, ఎంత ఏడిపించినా, కాలేజీ

అమ్మాయిలు గొర్రెల్లా తలవంచుకుని వెళ్ళటమే చూశాడింత వరకూ– ఆ రోమియో.

ఊహించని ప్రతిఘటనకీ.... జరిగిన అవమానానికీ.... విభ్రాంతపోయాడు. ఈలోపుగా పైనుంచివస్తున్న లెక్చరర్ల గురించి మిత్రుడు హెచ్చరించాడు. చకచకా నడిచి ఎటో తప్పుకుపోయారు వాళ్ళిద్దరూ.

విజయగర్వంతో పొంగిపోయింది సురేఖ.

"చూశారా? నా తడాఖా! ఆడపిల్ల ఈ మాత్రం కరుకుగా లేకపోతే.... ఈ రోడ్ సైడ్ రోమియోస్ మనల్ని బతకనివ్వరే!!" అంది స్లిప్పరు తొడుక్కుని.

"ఏమోనే బాబూ? ఆ మంకీస్‌తో మనకెందుకు? నువ్వు చాలా తొందరపడ్డావేమో ననిపిస్తోంది. వాళ్ళేం పగబడతారో నీ మీద?!" స్నేహితురాళ్ళు భయం వెలిబుచ్చారు.

"ఏడిశాడు? మళ్ళీ నా జోలికి రావటానికి ఎన్ని గుండెలు వాడికి? ఇందాక పలాయనమంత్రం చిత్తగించినప్పుడే తెలిసింది వాడి ధైర్యమేమిటో." తేలిగ్గా తీసేసింది సురేఖ — వాళ్ళమాటల్ని.

ఓ వారంరోజులు ప్రశాంతంగానే గడిచాయి. ఎనిమిదో రోజు సాయంత్రం మునిమాపు వేళలో, కాలేజీ వెనకగా ఉన్న ఓ పాడుపడిన ఇంట్లో... దారుణంగా రేప్ చేయబడింది సురేఖ.

మంచి విద్యార్థుల పేరుకుకూడా మచ్చతెచ్చే.... ఆరుగురు రౌడీల లాంటి కాలేజీ అబ్బాయిలు, సురేఖని దారుణంగా చెరిచారు. వాళ్ళకి నాయకుడు— ఆ రోజు సురేఖచేత చెప్పుదెబ్బ తిన్నవాడు.

హాస్పిటల్లో చేర్చిన రెండవరోజుకే సురేఖ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి. ఆమె చేసిన నేరమల్లా.... అసభ్యంగా మాట్లాడిన ఓ బాడీగార్డుని... ఓ రోడ్ సైడ్ రోమియోని అవమానించటమే!"

మాటలు లేకుండా అలా నడవటం చాలా బాధగా ఉంది ముగ్గురుకి.

"రండే! హోటల్లో కాస్త కాఫీతాగిపోదాం"అంది సుధారాణి.

తను స్నేహితురాళ్ళకోసం డబ్బు బాగా ఖర్చు పెడుతుందని పించుకోవాలని ఆమె తాపత్రయం

"పదవే అనూ! సుధ కాఫీ ఇప్పిస్తానంటే మనం వెళ్ళక పోతే బాగుండదు. ఈసారి పిక్చర్‌కి నేను తీసుకెళతాను మీ ఇద్దర్నీ" అంది ఆశాలత- తనూ తక్కువ తినలేదన్నట్టుగా,

"వద్దే! నా దగ్గర డబ్బులు పెద్దగా లేవు" అంది అనూరాధ బాధగా.

"నీ మొహంలే! నోరు మూసుకువిరా!" సుధారాణి బలవంతం చేసింది.

సభ్యతగా ఉండదని సరేనంది అనూరాధ.

నవ్వి గలగల నవ్వాయి బెల్స్! "ఒరేయ్ గోపీ! ఇది అన్యాయంరా!"

"ఏంట్రా శేషూ ఇది!"

"ఎంతచెడ్డా మేమంతా వీ ఫ్రండ్స్ కదరా!"

"కాదని ఎవరన్నార్రా?"

"మరి కాఫీకి మమ్మల్ని పిలవకుండా మీరు ముగ్గురే వెడతార్రా? మేంకూడా వస్తాంరా! మేం కాలేజీకి వచ్చేది చదువుకోటానికి కాదురా! మిమ్మల్ని ఫాలో అయి తరించటానికేరా!" శేషు వ్యంగ్యంగా బతిమాలుతున్నాడు.

"ఛీ! పాడుపీడ" అనుకుని అప్రయత్నంగా వెనక్కి తిరిగి చూసింది సుధారాణి. ఏమిటో అని అనూరాధ, ఆశాలతలు కూడా వెనక్కి తిప్పారు తలలు.

"మనకి గ్రీన్ సిగ్నల్ ఇచ్చార్రోయ్! పదండ్రా కాఫీ హోటలుకి." నలుగురూ ఒకేసారి అరిచారు సంతోషంగా.

సిగ్గుపడి తలలు తిప్పుకున్నారు ముగ్గురమ్మాయిలూ.

అనూరాధకి అసహ్యమేసింది.

"ఈ కోతులుకూడా వస్తున్నయ్యే. పోనీ.... హోటలుకి మానేద్దామా!" మెల్లగా అడిగింది స్నేహితురాళ్ళని.

"వద్దే వెళదాంలే" అంది సుధారాణి.

ఆమెనే సపోర్టు చేసింది ఆశాలత. "ఇప్పుడు మానేస్తే.... మరీ లోకువయిపోతామే వాళ్ళకి." సుధారాణి ప్రిస్టేజ్ ఫీలయింది.

"వస్తే వచ్చారులే. మనం ఏమీ మాట్లాడకుండా కూర్చుంటే సరి....!"

"వాక్కావి పాక్కావి, నోరు నొప్పెట్టి, వాళ్ళే ఊరుకుంటారు." శాంత వాక్యాన్ని సుధారాణి పూర్తిచేసింది.

ఇద్దరు స్నేహితురాళ్ళు బలవంతం చేస్తుంటే తను కాదంటం బావుండదని వాళ్ళిద్దరినీ అనుసరించింది అనూరాధ

ముగ్గురూ అందంగా, వయ్యారంగా నడుస్తూ, హోటల్లో అడుగుపెట్టారు

# 2

తమవెనకే వచ్చారు మిత్రబృందం నలుగురూ కాదు-రోమియోలు నలుగురూ! నందట్లో సడామియా అన్నట్టు, ఆ రద్దీలో, అలవోకగా.... ఆముగ్గురు ఆడపిల్లల్నీ సుతారంగా రాసుకుంటూ లోపలికివెళ్ళారు.

"ఛీ! కల్చర్ లేని మనుషులు" మనసులో తిట్టుకున్నారు ముగ్గురమ్మాయిలు.

హోటల్లో కూర్చున్న అందరికళ్ళూ అనూరాధమీదే వున్నాయి. అది గమనించిన సుధారాణికి అనూరాధమీద కించిత్తు ఈర్ష్య కలగక పోలేదు.

ఫామిలీరూంలో ఖాళీలేదు. మేల్స్ సెక్షనులోమాత్రం ఒక టేబిలు చుట్టూ ఖాళీలున్నాయి. గత్యంతరంలేక అక్కడికెళ్ళి కూర్చున్నారు ముగ్గురూ. సరిగ్గా ఆటేబులుపక్కకుర్చీలోనే నాలుగు బెల్స్ కూర్చున్నాయి.

మళ్ళీ పాట మొదలుపెట్టారు.

"ఒరేయ్! శేషూ!" మీరుముగ్గురూ నన్నువెతుక్కుంటూ వస్తారని నాకు ముందే తెలుసురా!" వెకిలిగా నవ్వాడు ప్రసాద్.

అమ్మాయిలు ముగ్గురూ మాతి మడుచుకున్నారు. లేచిపోదామనుకున్నారుకానీ, అలాచేస్తే వాళ్ళకి మరింత అలుసుగా ఉంటూందని... అందరూ తమని వింతగా చూస్తారని.... ఊరుకున్నారు. ఈలోపుగా సర్వారావుకూడా రావడంతో మనలటానికి వీలులేకపోయింది. టిఫిన్ కూడా ఆర్డరిద్దామన్న సుధారాణిని వారించి

మూడు కాఫీలు పట్రమ్మంది అనూరాధ.

"ఏరా హేమా? (హేమమాలినికి కోడ్‌వర్డుకాబోలు!) పాపం! టిఫిన్ తీసుకోవా?" శేఖర్ ఎగతాళి చేశాడు.

"లావెక్కిపోతావని భయమేమిట్రా!" గోపీ వేళాకోళం చేశాడు.

"అదికాదురా! లావెక్కిపోతే... ఎవరూ నా వెంట పడ రేమోనని..." శేషు వెకిలిగా నవ్వాడు.

"ఒరేయ్ హేమా! నీ కా భయం అక్కర్లేదురా! నిన్ను చూడకుండా.... ఒక్కరోజుకూడా ఉండలేమురా! కాస్త మా మీద కరుణించరా!" ప్రసాద్ బతిమాలుతున్నట్టుగా గాలిలోకి అభినయం చేశాడు.

"జ.సు. (జయసుధ) జ.ప్ర. (జయప్రద)ల కన్నా నీకే ఎక్కువ మార్కులిస్తాంలేరా నాయనా, గోపీ కిలకిల మన్నాడు.

సుధారాణి, ఆశాలతలు కోపంతో ఉడికిపోయారు. అనూ రాధ... అసహాయంగా చూసింది స్నేహితురాళ్ళకేసి

హోటల్లో టిఫిన్ తీసుకుంటున్న వారందరికీ బెల్‌బాటమ్, గాళ్ళు నలుగురూ కలిసి... విరిసిన పువ్వుల్లాఉన్న ఆ అమ్మాయిల్ని ఏడిపిస్తున్నారని అర్థమయింది.

వారిలో ఒకతను ఊరుకోలేకపోయాడు.

"ఎందుకయ్యా ఆ ఆడపిల్లల్నలా ఏడిపిస్తారు? మీరు కాలేజీకి వెళ్ళేది దేనికి? చదువు నేర్చుకోటానికా, లేక ఇలా ఆడపిల్లల్ని అల్లరి పెట్టటానికా, అన్నాడు మందలింపుగా.

అంతే!!

మరుక్షణంలో నాలుగు బెల్‌బాటమ్ పాంట్లూ కోపంతో లేచాయి. ఆవేశంతో ఊగిపోయాయి ఒక్క ఉదుటున ఆ అభా గ్యుడిమీద విరుచుకుపడ్డాయి. అతనివీపు సాపుచేశాయి. ముక్కు చట్నీ చేశాయి. లెంపలు పగలకొట్టాయి. క్షణంలో వాతావరణం అల్లకల్లోల మయిపోయింది. సుధారాణి, అనూరాధ, ఆశాలతలు భయంతో కెవ్వున కేక వేశారు. మిగతావారంతా తింటం, తాగటం మానేసి, చోద్యం చూట్టానికి అక్కడ గుమిగూడారు.

ఇదంతాచూసి, కౌంటరుదగ్గరున్న ప్రొప్రయిటర్ హడలి

పోయాడు. ఇదిలాగే కాసేపు కొనసాగితే ... కప్పులు, సాసర్లు, బల్లలు, కుర్చీలు, ముక్కలు ముక్కలవటం ఖాయం! అనుకుని, గజగజ వణికిపోయాడు.

బాడీగార్డుల దగ్గరికి వచ్చి రెండుచేతులూ జోడించాడు. "కాలేజీ బాబులూ! మీకు నా నమస్కారాలు! అతనిబదులు నన్ను క్షమించి శాంతించండి" అన్నాడు దీనంగా.

"ఈయనవల్ల బతికిపోయావ్ పో! లేకపోతే నీ రక్తం కళ్ళ చూసేవాళ్ళం ఇవ్వాళ. మాలో మేం సరదాగా మాట్లాడు కుంటుంటే, ఆ అమ్మాయిల్ని ఏడిపిస్తున్నాం అని అన్యాయంగా మామీద అభాండం వేస్తావా!" అన్నాడు ప్రసాద్ అతన్ని ఆఖరి గుద్దు గుద్దుతూ,

మిగతా ముగ్గురు రోమియోలు అతన్ని తలోమాటా అన్నారు. తలోతిట్టూ తిట్టారు.

అతనేదో జవాబు చెప్పబోయాడు. ముఖంమీదే చేత్తో సవరించుకుంటూ.

ప్రొప్రయిటర్ అతన్ని బలవంతంగా బయటికి నెట్టేశాడు "నువ్వెళ్ళవయ్యా బాబూ! నాకు చిప్పా - కర్రా చేతికి ఇస్తావా ఏమిటి? నీ బిల్లూవద్దు. పాడూవద్దు బయటికిపో ముందు. ఆబాబులు మంచివాళ్ళు కాబట్టి నిన్నక్కడితో వదిలిపెట్టారు" అన్నాడు— చివాట్లు పెడుతూ.

కాలేజీ కుర్రాళ్ళ జులుం ఇలా ఉంది అని గొణుక్కుంటూ వెళ్ళిపోయా డతను.

"యాయ్!" అంటూ గర్జించారు నలుగురూ.

తరవాత ప్రొప్రయిటరుకేసి తిరిగి "ఏమయ్యా! మేము కాలేజీ స్టూడెంట్లమయి ఉండి, ఆ అమాయకమైన ఆడపిల్లల్ని ఏడిపిస్తామా?" అన్నారు దర్పంగా.

"ఇబ్బే! లేదుబాబూ! మీరు నలుగురూ రత్నాలలాంటి వాళ్ళు" కాకాపట్టాడు ప్రొప్రయిటర్.

"ఇలాగే కీపప్ చెయ్యి, వ్యాపారంలో వృద్ధిలోకి వస్తావు" అంటూ పదిరూపాయల కాగితం అతనిమీదకి విసిరేశారు. బిల్లు మూడు రూపాయలే అయినా ప్రొప్రయిటరు చిల్లర ఇచ్చినా

పుచ్చుకోలేదు ఠీవిగా వెళ్ళిపోయారు ఒకరి కొకరు టాటా చెప్పు కుంటూ. అది అమ్మాయిల్నుద్దేశించి అని తెలుస్తూనే ఉంది. హోటల్లో కలకలం సద్దుమణిగింది. బిల్లు చెల్లించి బయటపడి. గుండెలమీద చెయ్యివేసుకున్నారు ముగ్గురు లలనలూ!

వాతావరణం చల్లబడటానికి ప్రయత్నిస్తోంది. అప్పుడప్పుడు వీచేగాలి వంటికి హాయిగా వుంది. వెనకాల బాడీగార్డుల గోల లేక పోవటంతో ఫ్రీగా వుంది.

"పాపం! మనవల్ల నిష్కారణంగా దెబ్బలు తిన్నాడే.... అతనెవరోగానీ! నొచ్చుకొంది అనూరాధ.

"అవునే! చాలా అన్యాయం కదూ?" సుధారాణి బాధపడింది.

"నిజమే! కానీ.... ఒక్కళ్ళయినా ఆమాట పైకి అనగలి గారా? మనకెందుకులే ఈ రౌడీగాళ్ళతోనన్నట్టుగా కిక్కురుమనలేదు" ఆశాలత జాలిపడింది.

"ఆఖరికి, ఆ ప్రొప్రయిటరుగాడుకూడా స్టూడెంట్లపక్షమే పలికాడు."

"వాడు బిజినెస్ మాన్. తనకు నష్టంరాబోతోంది అంటే స్టూడెంట్లవేపు పలకక ఏంచేస్తాడు?"

"ఈ రోడ్ సైడ్ రోమియోలకి, అదే ఈ బాడీగార్డులకి.... గుణపాఠం చెప్పే అవకాశమేలేదా? ఎవరూ ఏమీచెయ్యలేరా!" సమాజానికో సవాల్ విసిరింది సుధారాణి.

"లేదు! లేదు! లేదు! ఎవరూ ఏమీ చెయ్యలేరు. వాళ్ళు ఆడింది ఆట. పాడింది పాట వాళ్ళ ఈవ్ టీజింగ్‌ని ఎవరూ చెక్ చెయ్యలేరు." సురేఖ సంగతి.... ఇప్పుడు జరిగిన కొట్లాట, మన సులో పెట్టుకుని అంది ఆశాలత.

"ఏమే అనూ! నీ అభిప్రాయం ఏమిటి?"

తలవంచుకుని పరధ్యానంగా నడుస్తోంది అనూరాధ.

"మాట్లాడవేమే? ఎవరే నీ కలలలోని రాకుమారుడు?" ఆశా లత మేలమాడింది.

ఉలిక్కిపడింది అనూరాధ.

"జవాబు చెప్పవేమే మరి?" రెట్టించింది సుధారాణి.

"ఏమో? నాకేం తెలుసు?" మాట తడబడింది అనూరాధకి.

"నేను చెప్పలేదటే! దాని కళ్ళల్లో దాని 'లవర్' మెదుల తున్నాడు." కిసుక్కున నవ్వింది ఆశాలత.

"ఎవరే ఆ భాగ్యశాలి?" రహస్యం అడుగుతున్నట్టు అడిగి. తనూ కిలకిలమంది సుధారాణి.

"ఛీ! పొండే! మరీ ఆటపట్టించేస్తున్నారు నన్ను." అంది అనూరాధ ఏదో ఆలోచిస్తూనే.

సుధారాణి, ఆశాలతలు ఎంత ప్రయత్నించినా అనూరాధ నుంచి ఏమీ రాబట్టలేకపోయారు. ఈలోపుగా సుధారాణి ఇల్లు వచ్చేసింది. 'బై' చెప్పింది సుధారాణి. అనూరాధ, ఆశాలత చేతులూపారు. సుధారాణి ఇంటికి అరకిలోమీటరు దూరంలో ఉంది ఆశాలత ఇల్లు. అక్కడికొచ్చేవరకూ ఏదో గలగల మాట్లాడుతూనే ఉంది ఆశాలత. మనసెక్కడో పెట్టుకుని "ఊ" కొడుతోంది అనూరాధ.

"బాడీగార్డులు నలుగురూ బాగానే ఉంటారు. అందులో ఎవర్నన్నా 'లవ్' చెయ్యలేదుగదా అనూరాధ! లేకపోతే హఠాత్తుగా ఈ పరధ్యాన్న మేమిటి దీనికి?!" అనుకుంది ఆశాలత టాటా చెపుతూ.

"వస్తానే!" అంటూ తనయింటికి బయలుదేరింది అనూరాధ. ఆమె మనసులో ఏవో ఆలోచనా తరంగాలు!

# 3

అనూరాధ ఉంటున్న ఇంటి ఆవరణ చాలా విశాలంగా ఉంటుంది. మధ్యలో ఓ పెద్ద డాబా ఠీవిగా నిలబడి ఉంది. దానిలో ఇంటాయన ఈశ్వరయ్య ఉంటాడు. ఆయనకి వలభై ఏళ్ళుంటాయి. మహిషి నిండుగా, గుండులా ఉంటాడు! గోవిందనామాలూ, హరేరామ పంచె. కండువాతో అసలైన సిసలైన భక్తుడిలా ఉంటాడు. కొడుకులు మంచి ఉద్యోగాల్లో ఉన్నారు. వేరుగా కాపరాలు చేసుకుంటున్నారు. దగ్గరున్న పల్లెలో కౌలుకిచ్చిన వ్యవసాయం ఉంది. ఇళ్ళమీద అద్దెలు వస్తాయి. కృష్ణా, రామా అంటుంటాడు

బాడీగార్డులు

ఎప్పుడూ! భార్య పార్వతమ్మ పట్టి అయోమయం మేళం! ఇంట్లో ఓ పాతికేళ్ళ వంటావిడని పెట్టుకున్నాడు. పేరు కామాక్షి. పాతికేళ్ళకే పసుపు కుంకుమకి దూరమయింది. నా అనేవాళ్ళెవరూ లేరు. "బాబాయిగారూ!" అంటూ పిలుస్తుంది ఈశ్వరయ్యని. ఇక్కడే ఉంటుంది రాత్రింబవళ్ళు.

తన డాబాయింట్లో, అనూరాధకీ, ఆమెతల్లి శారదమ్మకి ఓ చిన్న పోర్షన్ అతితక్కువ అద్దెకి ఇచ్చాడు ఈశ్వరయ్య-జాలిపడి! పోర్షన్ చిన్నదే అయినా, వసతులన్నీ ఉన్నాయి. అనూరాధ తండ్రి అప్రయోజకత్వానికి జాలిపడుతుంటాడు ఈశ్వరయ్య. "అంతా వాడి లీల!" అంటుంటాడు హరేరామ! కండువా సవరించుకుంటూ.

ఆ డాబాకి, ఎడమపక్కన ఒకటి, కుడిపక్కన ఒకటి.... పెంకుటిల్లు కట్టించాడు ఈశ్వరయ్య.

అయినా ఇంకా విశాలంగానేవుంది ఆవరణ.

ఎడమచేతివేపు పెంకుటిల్లు.... కొంచెం చిన్నది. అందులో సుందరయ్యనే షావుకారు ఫామిలీతో ఉంటున్నాడు. అతనికో ముప్ఫయ్అయిదుఏళ్ళుంటాయ్. పాండురంగడి విగ్రహంలా ఉంటాడు. బానపొట్ట.... తామరలాంటి లక్షణాలేమీలేవు. నల్లటి ముఖంలో తెల్లటి పలువరస. తరచుగా తళుక్కమంటూ ఉంటుంది. అందరితో చాలా చనువుగా మాట్లాడుతాడు. అది అతని బిజినెస్ టాక్టిక్స్‌లో ఒకభాగం." అందుకే, సెంటర్లోవున్న అతని 'వాసవీ జనరల్‌స్టోర్స్' ఎప్పుడూ బిజీగా ఉంటుంది. సరుకు మంచిది ఇవ్వటంవల్ల, అతను వేసుకునే లాభాలగురించి కష్టమర్సు ఎక్కువగా పట్టించుకోరు. సుందరయ్యభార్య ఏమాత్రం సుందరంగా ఉండదు. చింపిరి చింపిరిగా ఉంటుంది. ఆమె ధ్యాసంతా డబ్బు.... నగలమీదే! సుందరయ్యకి, చీమిడిముక్కు సంతానం ముగ్గురూ!!

కుడిపక్క ఇంట్లో రెండుకుటుంబాలు అద్దెకుంటున్నాయి. అందులో రామలింగానిది ఒకటి! రామలింగం గవర్నమెంటువారి ఆఫీసులో దేన్లోనో పనిచేస్తుంటాడు. జీతంకన్నా గీతం ఎక్కువ ఉద్యోగమే! అయినా నలభైఏళ్ళవాడు.... ముగ్గుబుట్టలాంటి తల. ముడతలుపడ్డ ముఖంతో ఏభయ్ఏళ్ళ వాడిలా కనిపిస్తాడు. ఆయనకి

'వ్రీస్' ఎక్కువ. భార్యకి గుండెజబ్బు. నరాల బలహీనత. ఎప్పుడూ మంచాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఉడకేసి పెడుతున్న తల్లికూడా రోగిష్టిది. ఎప్పుడూ ఉస్సు రస్సు రంటుంది.

రామలింగానికి ఇద్దరుకూతుళ్లు పెద్దకూతురి మొగుడు సర్వ లక్షణ సంపన్నుడు! మందు, మగువ, పేకాట! లాంటివి అతని హాబీలు! వారానికోసారి లెక్కప్రకారం పెళ్ళాన్ని చితకతన్ని. "ఓ అయిదువందలు పంపమని మీ నాన్నకి ఉత్తరం రాయి!" అంటాడు. రామలింగం దగ్గర్నుంచి డబ్బు వచ్చిందా?! ఆ రాత్రి ఆమెకి పక్కమీద స్వర్గం చూపిస్తాడు. లేదా. నరకం అంటే ఎలా ఉంటుందో? చేస్తు చూపిస్తాడు. ఆ సంగతి రామలింగానికి తెలుసు! అడిగినంత కాకపోయినా. కొంతయినా పంపుతుంటాడు కూతురు పడే బాధని చూడలేక.

రెండోకూతురు. తండ్రి వర్ణాంతర వివాహానికి ఒప్పుకో లేదని ఆత్మహత్య చేసుకుంది. జీవితంలో ఇన్ని ఎదురుదెబ్బలు తినేసరికి దాదాపు పిచ్చివాడయిపోయాడు రామలింగం. అకాల వృద్ధాప్యం వచ్చిం దాయనకి. సినిక్‌గా తయారయ్యాడు. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. రాత్రిళ్ళు అతని గదిలో బాటిల్సు ఖాళీ అయిపోతూ ఉంటాయి.

కామేశానికి ముప్పయ్ ఏళ్ళుంటాయి. చీకూ చింతా లేదు. వాళ్ళనాన్న తనకున్న పలుకుబడితో పేరున్న ప్రైవేట్ కంపెనీలో చక్కటి ఉద్యోగం వేయించాడు.

కామేశం భార్య అందాలసుందరి కాకపోయినా, బొద్దుగా, ముద్దుగా బాగానే ఉంటుంది. ఖరీదైన చీరలతో కళకళ లాడుతుం టుంది.

కామేశం సాయంత్రం అయిదున్నరకల్లా ఇంటికి చేరుకుం టాడు. టాయిలెట్ అయి, అప్పటికే ముస్తాబై రడీగాఉన్న భార్యని స్కూటరుమీద ఎక్కించుకుని! సినిమాలకి, షికార్లకీ తీసుకెడు తుంటాడు. తరచు షాపింగు చేస్తుంటాడు.

ప్రపంచంలోని సంతోషమంతా తమదేనన్నట్టుగా, ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ ఉంటారిద్దరూ!

నలుగురిలో చిలిపిగా భార్యని మొట్టడం, ఆమె వీపుమీద

మృదువుగా తట్టటం, చెవి పిండటం లాంటివి కామేశం సరదాలు!
'అబ్బ! ఊరుకోండీ! మీకు పనీపాటా లేదు." అనటం ఆమెకి
ఇష్టం! తమది చక్కటి అనుకూల దాంపత్యం అనుకోవాలవి
కామేశం తాపత్రయం!

ఇదీ- ఆ కాంపౌండులోని వ్యక్తుల కథా కమామిషూ!

# 4

మిషన్ కుట్టటం పూర్తిచేసి కూతురు దగ్గరికి వచ్చింది శారదమ్మ.

మనసులో ఎన్ని బాధలున్నా, పైకి మాత్రం ఎంతో నిబ్బరంగా ఉంటుందామె. "కర్తవ్యం ఆలోచించి ధైర్యంగా ముందడుగు వేయాలిగానీ, దిగాలుపడిపోయి చెయ్యగలిగిం దేముంది!" అని ఆమె అభిప్రాయం. ఆ ఆత్మవిశ్వాసంతోనే బండి జాగ్రత్తగా లాక్కొస్తోంది. మిషన్‌మీద రోజుకి అయిదో పదో వస్తుంటాయి. బట్టలు బాగా కుట్టటం. డబ్బుకి వత్తిడిచెయ్యక పోవటం అందర్నీ చిరునవ్వుతో, పలకరించటం యోగక్షేమాలు కనుక్కోవటం లాంటివి, సాటి ఆడవాళ్ళని బాగా ఆకర్షించాయి. చుట్టుపక్కల ఆడవాళ్ళంతా శారదమ్మచేతే బట్టలు కుట్టిస్తుంటారు.

ప్లాస్టిక్‌వైరు బుట్టలపల్ల కూడా ఆదాయం ఫరవాలేదు. వారానికోసారి ఫాన్సీషాపులవాళ్ళు తమ ఏజంట్లుని పంపిస్తుంటారు. డబ్బు ముట్టజెప్పి శారదమ్మ అల్లినబుట్టలు తీసుకెడుతుంటారు.

శారదమ్మ భర్త దేశసంచారి. ఇదివరకు మూడు నాలుగు రోజుల కొకసారయినా ఇంటికివచ్చి ప్రజంటు వేయించుకుని వెడు తుండేవాడు. ఈమధ్య రెండునెలలనుంచీ అతనిజాడ తెలియటం లేదు. అయితే బతకటానికిమాత్రం దోకాలేదతనికి. వచ్చీరాని హస్తసాముద్రికవిద్య ఉంది చేతిలో. దాన్ని మాటలగారడీతో 'కాష్' చేసుకోగలడు. రోజుకి తనఖర్చులకి సంపాయించుకోగలడు. మొదట్లో భర్తప్రవర్తనకి బాధపడింది శారదమ్మ రానురానూ అల వాటయిపోయి, పట్టించుకోవటం మానేసింది. వస్తే, అన్నంపెడు

తుంది, కట్టుకున్న నేరానికి. గట్టిగా అడిగితే ఓ అయిదో, ఆరో ఇస్తుంది. రాకపోతే - అతన్నిగురించి ఆలోచించి మనసుపాడు చేసుకోదు. ఆమె ఆశలన్నీ కూతురిమీదే! అనూరాధకోసమే బతుకుతోంది శారదమ్మ.

"పదిగంటలయిందమ్మా! చదువుచాల్లే! పడుకో!" ఆప్యాయంగా కూతురితల నిమిరింది శారదమ్మ.

అనూరాధ కూర్చున్న కుర్చీ.... దానిముందున్న టేబులు, వార్నీషులేక వెలవెల బోతున్నాయి-"తమ జీవితాల లాగేవున్నాయి. అవికూడా!" అనుకుంది శారదమ్మ.

"పరీక్షలు ఇంకా రెండునెలలే ఉన్నాయమ్మా! బాగా చదవక పోతే ఎలా?" తల్లివేపు ప్రేమగా చూస్తూ అంది అనూరాధ. తండ్రి అప్రయోజకుడయినా, తన బంగారు భవిష్యత్తుకోసం.... ఎంతో శ్రమిస్తున్న తల్లినిచూస్తే ఆమెకెంతో గౌరవం.

"నీకు ఫస్టు మార్కులే వస్తుంటాయి గదమ్మా! అంతగా కావాలంటే- తెల్లవారుఝామున నాలిగింటికి లేపుతాను. లేచి చదువుకో! రాత్రిళ్ళు ఎక్కువగా చదివితే ఆరోగ్యం పాడవుతుంది. అసలే నీ అందంచూసి నలుగురూ కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారు. రా! పడుకుందాం!" ఆప్యాయంగా అంది.

తల్లి అంతగా చెపుతుంటే బాగుండదని పుస్తకం మూసి, లేచింది అనూరాధ.

కూతురి భుజంమీద చెయ్యివేసి ప్రేమగా నడిపించుకెళ్ళింది శారదమ్మ. రెండు నులక మంచాలమీద దుప్పట్లు పరిచి ఉన్నాయి. అవే వారిద్దరికీ హంస తూలికా తల్పాలు! శారదమ్మ తలుపులన్నీ సరిగా వేసి ఉన్నాయో లేదో మరోసారి చూసివచ్చి, లైటార్పేసింది. ఆమెకి ఠంచనుగా తెల్లవారు ఝామున నాలుగ్గంటలకి మెలుకువ వచ్చేస్తుంది.

మంచాలమీద పడుకున్నారు తల్లీకూతుళ్ళిద్దరూ.

"నీ బి. ఏ. అయిపోగానే మనకష్టాలు ఒడ్డెక్కుతాయిలే తల్లీ!" అంది శారదమ్మ. ఆమె ఆశావాది!

అనురాధ ఏమీ మాట్లాడలేదు. ఆమె మనసు ఏదో ఆలోచిస్తోంది. తల్లి చెప్పిన కష్టాలు తీరేలోగా, తనకి అదే, తమకి

బాడీగార్డులు

కొత్త కష్టాలు రాకూడదు. దాని కామె భగవంతుణ్ణి ఎన్నో విధాల ప్రార్థిస్తోంది.

కూతురు జవాబు చెప్పకపోయేసరికి కాసేపు మౌనంగా ఉండి పోయింది శారదమ్మ. మిషను కట్టి, ప్లాస్టిక్ బుట్టలు అల్లి ఆమెకి చాలా బడలికగా ఉంది నిద్రాదేవి ఒళ్లో సోలిపోవటానికి సిద్ధంగా ఉందామె.

"అమ్మా! మనం ఈ ఇల్లు మార్చేద్దామమ్మా! నా కిక్కడేం బాగుండలేదు" అంది అనూరాధ.

"ఇంతసౌకర్యంగల ఇల్లు, ఇంతతక్కువ అద్దెకు - పట్టణం మొత్తంమీద ఎక్కడా దొరకదమ్మా! ఇల్లుమారితే యిబ్బంది పడిపోతాం. ఈశ్వరయ్యగారు మంచివారు గనక ఇచ్చారు." అంటూనే నిద్రలోకి జారిపోయింది - శారదమ్మ.

"అమ్మా! అమ్మా" అంటూ రెండుసార్లు నెమ్మదిగా పిలిచింది. దానికి సమాధానంగా శారదమ్మ గురక సన్నగా వినిపించింది. ఆమె చిన్నారిబుర్రలో ఎన్నో సంఘటనలు రీలులా తిరుగుతున్నాయి. 'నాన్నరాని ఈ రెండునెలలకాలంలో ఎలాంటి సంఘటనలు, జరిగాయి. ఎన్ని సంగతులు తెలుసుకుంది తను? ఆమెకి నిద్రపట్టటంలేదు. మంచంమీద అసహనంగా దొర్లుతోంది అటూ యిటూ. తెరలు తెరలుగా జ్ఞాపకాలు దాడిచేస్తున్నాయి.

# 5

ఒకరోజు - సాయంత్రం ఆరుగంటలయింది.

అమ్మ మిషనుకుడుతోంది. తను దీక్షగా చదువుకుంటోంది.

"శారదమ్మగారూ!" అంటూ వచ్చింది, కామాక్షి.

"రా! కామాక్షీ! రా! వంటయిందా?" ఆప్యాయంగా పలకరించింది అమ్మ- మిషనాపి.

"ఒక్క చారుపెడితే వంటయిపోయినట్టే! ఈశ్వరయ్య బాబాయిగారికి చారు చాలా ఇష్టం! సమయానికి కరివేపాకు అయిపోయింది. అందుకని...." అంది కామాక్షి.

శారదమ్మ ఉంటున్న పోర్షనువేపు పెరటిలో కరివేపాకు చెట్టుంది.

"వెళు, నీకెక్కవలసినంత కోసి తెచ్చుకో." అంది అమ్మ.

అలాగే చేసింది కామాక్షి. గుప్పెడు కరివేపాకు రెబ్బలతో తిరిగివస్తూ, "రేపు శనివారంకదూ ఈశ్వరయ్యగారు గొప్ప భజన కార్యక్రమం ఏర్పాటుచేశారు. సాయంత్రం ఆరింటినుంచి, రాత్రి పదిగంటలవరకూ ఉంటుంది భజన. బద్దాంనుంచి "రామశరణ్" అని ఓ స్వాములవారు వచ్చారట ఊళ్ళోకి. వారుగూడా పాల్గొంటారు భజనలో. ఈ పేటలోని చాలామంది స్త్రీ, పురుషులు వస్తున్నారు కూడాను. మీ యిద్దరినీ తప్పక రమ్మనమని చెప్పమన్నారు ఈశ్వరయ్య బాబాయిగారు."

"చూస్తున్నావుగా కామాక్షీ! నాకు ఈ మిషనుతో తీరదు. అమ్మాయికి చదువు! ఎలా చెప్పు?" అంది అమ్మ మొహమాట పడుతూ.

"జీవితంలో భుక్తి ఒక్కటేకాదు ముఖ్యం శారదమ్మగారూ! భక్తికూడా. ఏమంటావ్ అనూరాధా?"

తను నవ్వి ఊరుకుంది. సమాధానంగా.

"ఈ మిషను కుట్టులు, ఈ చదువులు ఎప్పుడూ ఉండేవే! 'భక్తి' మనం కావాలనుకుంటే రాదు. స్వార్థం. కుళ్ళు. విచ్చలవిడిగా నాట్యంచేస్తున్న ఈ రోజుల్లో. భక్తికోసం, ముక్తికోసం. జీవితాన్ని అంకితంచేసి, పాటుపడి. తోటివారికికూడా దారిచూపించే ఈశ్వరయ్య బాబాయిగారి లాంటి మహనీయు లెంతమంది ఉన్నారు? ఆయన ముఖం! దానిమీద పెట్టిన గోవిందనామాలు! సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరస్వామిని గుర్తుచేస్తాయి. ఆయన కట్టుకున్న హరేరామ హరేకృష్ణ పంచె! మీదవేసుకున్న అదేరకం కండువా. మూర్ఖత్వంతో కొట్టుమిట్టాడుతున్న ప్రజానీకానికి - భక్తిమార్గాన్ని ప్రబోధిస్తాయి. పైగా ఆయనిది ఎంత విశాల హృదయం, ఎంత ఉదార హృదయం! ఉదాహరణకి నన్నూ, మిమ్మల్ని తీసుకోండి. నా పాలన, పోషణ పూర్తిగా చూస్తున్నారుకదా; మీకు ఇల్లు అతి చవకగా ఇచ్చారుకదా! అలాగే ఇంకా ఎంతోమందికి ఎన్నో సహాయాలు చేశారు. అయితే వేటినీ బయటకు చెప్పుకోరు. ఆయనకు

పేరుప్రఖ్యాతులమీద మోజులేదు. ఏంచేసినా, ఏంజరిగినా, 'గుంభనగా జరగాలంటారు. ఆయన దృష్టిలో ఊరిలోని ఆడవాళ్ళందరూ తల్లులు, చెల్లెళ్ళు, కూతుళ్ళ లాంటివాళ్ళు! ప్రత్యేకించి మీరంటే ఆయనకి చాలా అభిమానం, ప్రేమాను. నాతో చాలాసార్లు అన్నారు. "భర్త ఎందుకూ పనికిరానివాడయినా, ఆ శారదమ్మ చూడు....! నిరంతరం శ్రమిస్తూ, ఆ పిల్లనెలా చదివిస్తోందో? కడిగిన ముత్యం లాంటి ఆ అమ్మాయిని చూడు! ఎంత పొందికగా ఉంటుందో, ఎంత చక్కగా చదువుకుంటోందో? వారికేమన్నా చక్కటి సాయం చేయాలి!" అని...."

ఠక్కున ఆపింది కామాక్షి. తమ ఇద్దరి ముఖాలవేపు చూసింది.

"వారి ఆశీస్సులే మాకు సాయం కామాక్షి! అంతకన్నా ఏంకావాలి!" అంది అమ్మ. కామాక్షి చెప్పినతరువాత ఈశ్వరయ్యగారిమీద గౌరవం మరికాస్త పెరిగింది అమ్మకి. తనకీ అంతే!

"అలాంటప్పుడు ఒకపని చేయండి రేపు మీరిద్దరూ భజనకి తప్పకరండి - ఎలాగోలా వీలుచూసుకుని, బాబాయిగారు తప్పక సంతోషిస్తారు. మీకు మరీ మరీ చెప్పమని వారు చెప్పారకూడాను."

"నవీనం అమ్మాయినయినా పంపుతాలే" అంది అమ్మ.

తనకి భజనలు - కీర్తనలంటే పెద్దగా ఇష్టంలేదు. అమ్మ మాట కాదనలేక ఊరుకుంది తను - అప్పటికి.

"సరే! మీయిష్టం. వస్తా మరి, చారుపెట్టటానికి ఆలస్యమయిపోతుంది" పరుగులాంటి నడకలో వెళ్ళిపోయింది కామాక్షి.

"ఆయనంటే ఈ కామాక్షికి ఎంతప్రేమ! అవును ఎందుకుండదూ, కన్నకూతురిలా చూసుకుంటుంటే సర్లే. రేపు పిలుపుని బట్టి నువ్వో నేనో వెడదాంలే!" అంది అమ్మ.

సరేనంది తను—

మరుసటిరోజు సాయంత్రం-అమ్మ కూరగాయలు తేవటానికి మార్కెట్టుకెడుతూ. "అంతగా భజన మొదలుపెడితే - తలుపు తాళంపెట్టి నువ్వెళ్ళు. నేనువచ్చి చూసుకుంటాలే!" అంది.

తలూపింది తను.

మర్నాడు సాయంత్రం - ఆరున్నరయినా భజన మొదలు

పెట్టే సూచనలు కనిపించలేదు. భజన లేకుండా ఉంటే బాగుండును. బోలెడంత 'వర్కు' ఉంది అనుకుంది తను. అసలు విషయం కామాక్షి నడిగితే తెలుస్తుందనుకుని— తలుపు తాళంవేసి ఈశ్వరయ్యగారి పోర్షనులోకి అడుగుపెట్టింది తను. విశాలమైన ఇల్లు! కొన్నిగదులు ఖాళీగానే ఉన్నాయి. ఓ హాలులో ఓమూల మంచంవేసుకుని పడుకుంది ఈశ్వరయ్యగారి భార్య. తలనొప్పి కాబోలు తలకిగుడ్డ కట్టుకుని మూలుగుతోంది.

"కామాక్షి ఎక్కడ పిన్నిగారూ?" అంది తను.

ఆమె - తనకి తెలియదన్నట్టుగా చెయ్యి తిప్పింది.

ముందుకు వెళ్ళింది తను. కామాక్షి కనిపించలేదు. 'ఇంట్లో లేదా ఏమిటి?' అనుకుంటూ ఇంకా పైకి వెళ్ళింది. అది చివరిగది. ఎవరిదో గొంతు వినిపించి ఠక్కున ఆగిపోయింది తను.

అది ఈశ్వరయ్యగారి గొంతు. గది తలుపులు ఓరగా వేసి వున్నాయి. రెండు తలుపులమధ్య విలువుగా చీలిక కనిపిస్తోంది.

కిలకిల నవ్వులు వినిపించాయి. అది ఒక స్త్రీ గొంతు.

"అబ్బ! ఊరుకోండి! మీరింతకీ రామ భక్తులా, ప్రేమ భక్తులా?"

ఆగొంతు కామాక్షిది. నిర్ఘాంతపోయింది తను.

"ఈశ్వరయ్య బాబాయిగారికి.... కామాక్షి ఏమవుతుంది? మరి ఏమిటి ఘోరం!

ఛ! తను అనవసరంగా అపోహ పడుతుందేమో? వాళ్ళిద్దరూ ఊరికే మాట్లాడుకుంటున్నారేమో? అనుమానం తీర్చుకుందామని అడుగులో అడుగు వేసుకుంటూ తలుపుల దగ్గరగా వెళ్ళి, చీలికలోంచి లోపలికి చూసింది తను.

అంతే!!

ఒక్కసారిగా విభ్రాంతపోయింది. తన కాళ్ళకింద భూమి కంపించినట్టు ఫీలయింది.

కామాక్షి.... ఈశ్వరయ్య కౌగిలిలో నలిగిపోతోంది. ఇద్దరూ ఈలోకాన్నీ మరిచిపోయి వినువీధుల్లో విహరిస్తున్నట్టుగా వున్నారు.

అచేతనంగా అలాగే ఉండిపోయింది తను.

తననుగురించే మాటలు సాగుతున్నాయి లోపల. ఎంత

నద్దనుకుంటున్నా అవి తన చెవిలో పడుతూనే ఉన్నాయి.

"ఏం! కామాక్షీ! ఎంతవరకూ వచ్చింది నీప్రయత్నం? ఆ అనూరాధని నావళ్ళో పడుకోబెట్టే శుభఘడియ ఎప్పుడు? నీ బహుమతి నీకుంటుంది తెలుసుగా!"

"ఓ ఈశ్వరయ్యా! కొంచం ఆగవయ్యా నాయనా! ఇప్పుడే అన్నప్రాశన మొదలుపెట్టాను. ఆవకాయ తినిపిస్తానంటే, వ్యవహారం బెడిసికొడుతుంది. అయినా.... యీ 'భక్తి' ముసుగులో ఆ పాడుపనులేమిటి?"

కామాక్షి బుగ్గలనిండా ముద్దులు కురిపించాడు ఈశ్వరయ్య.

"ఓసి పిచ్చిమొద్దూ! ఇలాంటి ముసుగులు లేకపోతే ఈ సంఘం మనల్ని బతకనిస్తుందటే? పిచ్చికుక్కని కొట్టినట్టు కొడుతుంది." బాబాయిగారూ! అనబట్టేగా.... నువ్వు నాపక్కలో జేరినా, ఎవరికీ అనుమానంరాకుండా ఉంటోంది. అలాగే 'రక్తి' తీరాలంటే 'భక్తి' ముసుగు వేసుకోక తప్పదు. ఈ హరేరామ వస్త్రాలున్నాయ్ చూడు! నా బోటివాడి కామలీలలకి కవచంలాంటి వనుకో!"

"అంటే.... ఇలా హరేరామ కాషాయవస్త్రాలు ధరించిన వారందరూ దొంగ భక్తులేనా అయ్యగారూ?" ఈశ్వరయ్యని ఇంకా_స్త దగ్గరగా హత్తుకుంది కామాక్షి.

ఈ సమాజంలోని భక్తులందరూ నాలాంటి వాళ్ళెలా అవుతారు? ఎందరో మహానుభావులున్నారు. వాళ్ళని తలుచుకునే అర్హతగూడా మనకిలేదు. ఈ చక్కటి సమయంలో అదెందుకుగానీ! అన్నప్రాశన చేశానన్నావ్! ఏం చేశావేమిటి?"

"ఏముంది? మీ గురించి. అతి మంచిగాచెప్పి. అరగంట తెగ పొగిడాను!

మీరు భక్తాగ్రేసరులని ధార్మికులని, నూరిపోశాను. ఇవ్వాళ మనింట్లో బ్రహ్మాండమైన భజన ఉందని కోసేశాను. రమ్మని ఆహ్వానించాను మీ తరఫున."

"ఏమన్నారు తల్లీ కూతుళ్ళు?"

"శారదమ్మకి వీలుకాదంది."

"నువ్వేమన్నావ్?"

"కనీసం అనూరాధనయినా పంపమన్నాను."

"వాళ్ళమ్మేమంది?" ఆతృతగా అడిగాడు ఈశ్వరయ్య.

"పంపకపోతే ఊరుకుంటానా? ఒప్పించాను"— కిలకిల నవ్వింది కామాక్షి.

"నీ తెలివితేటలు బ్రహ్మాండం కామాక్షీ!"

"అబ్బబ్బ! ఆగండి! ఎముకలు విరిగిపోతున్నాయ్! వయసు పెద్దదవుతున్నకొద్దీ.... మీలో కుర్రతనం పెరిగి పోతున్నట్లుంది."

"నువ్వుమాత్రం కలకత్తా జాంపండులా లేవూ? ఆ! ఆ పిల్ల వస్తుందంటావా."

"తప్పక వస్తుంది."

"రాగానే కార్యక్రమం ఏమిటో శలవియ్యి దేవీ!"

"అలాగే స్వామీ!" గల్లున నవ్వు.

"చెప్పు మరి"

"ఆ అమ్మాయి రాగానే.... మీగురించి మళ్లీ బ్రహ్మాండంగా చెప్పి, మీ దగ్గరికి పంపిస్తాను ముందుగా – అనివార్యకారణాలవల్ల భజనకార్యక్రమం ఓ వారానికి వాయిదాపడిందని చెప్పండి. తరువాత మాటల్లో దింపండి. మచ్చిక చేసుకోండి. వరస కుదిరిందా? డబ్బాశ పెట్టండి. పేదవాళ్ళుకదా! లోబడటానికి అవకాశముంది. అంతా గప్‌చిప్‌గా ఉంటుంది. ఎవరికీ అనుమానం కలగదు. అవి చెప్పి.... వళ్ళోకి లాక్కోండి"

"నీ తెలివితేటలు అమోఘం కామూ! నువ్వు రాజకీయాల్లో ఉండవలసినదానివి."

రాజకీయాలేమోగాని.... ప్రస్తుతం నన్ను మీ కామానికీ.... వాటితాలూకూ రాయబారాలకి బాగానే ఉపయోగించుకుంటున్నారుగా" బెట్టు చూపించింది.

"అలా అంటే ఎలా కామూ! నీ పోషణ, పోషణ.... వగైరాలు నేను చూట్టంలా! నా మంచిచెడ్డలు, నా కష్టసుఖాలు నువ్వుకాకపోతే ఎవరు చూస్తారు?" బ్రతిమాలాడు.

"మాటలతో కట్టెయ్యటం బాగా వచ్చు అయ్యగారికి."

"ఒక్క మాటల్తోనేకాదు కామూ! ఇలా ఇంకా స్త దగ్గరకి జరుగు చెప్తాను."

"ఛీ!" అసహ్యంతో ఒళ్ళువెల్లా కంపరం పుట్టింది తనకి. కామాక్షిని, ఈశ్వరయ్యని అలాగే తాళ్ళతో కట్టేసి, కిరసనాయిలు పోసి ముట్టించి, మంటలో మాడ్చి మసి చెయ్యాలనిపించింది. అక్కడి నుండి ఎలా బయటపడి తన పోర్షనులోకి వచ్చిందో తనకే తెలియదు!

అమ్మ ఇంకా రాలేదు మార్కెట్టునుంచి. తాళం తీసుకుని లోపలికి వెళ్ళి, కుర్చీలో కూలబడి ఈశ్వరయ్య నిజస్వరూపం గురించి ఆలోచించింది చాలాసేపు.

ఏడింటికల్లా అమ్మ వచ్చేసింది.

"కాల్‌గాస్ ప్రొప్రయిటరు సాంబయ్యగారి భార్యకనిపించిందమ్మా! మార్కెట్‌దగ్గర నన్ను కార్లో కూచోపెట్టి, వాళ్ళడ్రైవరు కూరగాయలు తెచ్చేదాకా ఒహాటే కబుర్లతో చంపేసింది. చెల్లెలుగారింటికి ఆమె అటు వెళ్ళింది. నేనిలా నడిచివచ్చాను" అంది అమ్మ ఆ నడకక్కపోయినా, ఆలస్యానికి సంజాయిషీ చెబుతూ.

"అమ్మా!" తన నోటివరకూ వచ్చింది ఈశ్వరయ్య, కామాక్షి భాగోతం చెప్పేద్దామని.

కాని అమ్మ ఏమనుకుంటుందో? నమ్ముతుందో? నమ్మదో? మహాత్ముడులాంటి ఈశ్వరయ్యమీద.... అతని కూతురులాంటి, కామాక్షిమీద ఇంత ఘోరమైన నిందవేస్తావా? అపచారం! అపచారం! లెంపలేసుకో. లేకపోతే కళ్ళుపోతాయి. అంటే, తనకు జవాబేముంది?

"ఎవరో గొంతు నొక్కినట్టుగా ఊరుకుంది తను. "అమ్మా!" అని ఆపేశా వేమిటే!" రెట్టించింది అమ్మ.

"ఏంలేదమ్మా! ఆకలిగావుంది." అని కప్పదాటువేసింది తను.

## 6

ఈశ్వరయ్యగారింట్లో గోడగడియారం అరగంట కొట్టింది.

"పదిన్నరయినా నిద్ర రావటంలేదేమిటబ్బా!" అనుకుంది అనూరాధ అటునుంచి ఇటు దొర్లుతూ పక్క మెత్తగావున్నా.... అక్క

చక్రాంతి కాంతారావుల గురించి జ్ఞాపకం చేస్తూనేవుంది. "విధవ సులకనుంచం." అనుకుంది అనూరాధ. "తన క్లాస్‌మేట్స్ సుధారాణి, ఆశాలతలు.... స్ప్రింగ్‌కాట్ల పైన డన్‌లప్ బెడ్ల మీద దొర్లుతుంటారు. దానికి కారణం వాళ్ళ నాన్నలు ప్రయోజకులు। మరి తనకలా కాదు. తన తండ్రి ప్రయోజకుడయ్యి ఇంటిపట్టున ఉంటే.... ఎంత అందగా వుండి వుండేది తనకి? ప్చ! ప్చ!" జ్ఞాపకాల్ని నెమరువేసుకుంటోంది అనూరాధ.

ఆరోజు....

అదే.... ఈశ్వరయ్య సంఘటన జరిగిన ఏడోరోజున.

అప్పుడే కామాక్షి.... మామూలుగా రోజూ వాగే పాఠం అప్పగించి పోయింది.

"ఈశ్వరయ్యగారి కరుణాదృష్టి నీమీద పడిందనీ, ఆ మహనీయుడు తలచుకుంటే నీ జన్మ చరితార్థమవుతుందనీ, ఒక్కసారి ఆయనతో అన్నివిషయాలు ఇతరులు లేకుండా చర్చించమనీ...."

"చూద్దాంలే!" అంది తను లౌక్యంగా.

విసుగెత్తి వెళ్ళిపోయింది కామాక్షి. ఈశ్వరయ్యగారిని సేవించుకోటానికి.

ఆరోజు ఆదివారం అమ్మ ఓ పావుగంట క్రితమే డాక్టరు మూర్తిగారి భార్య కబురు పంపిస్తే వెళ్ళింది- కొలతలు తీసుకుని కొత్తగుడ్డలు తెచ్చుకుంటానికి. మిట్ట మధ్యాహ్నం. బయట ఎండ తీవ్రంగానే ఉంది. అందరూ విశ్రాంతి తీసుకునే సమయం। తను మాత్రం చదువుకుంటోంది.

"చెల్లాయ్!" అంటూ వచ్చాడు సుందరయ్య.

ఆదివారం కనుక కొట్టుకు శలవు. నోరారా పలకరించే అతనంటే ఎంతో గౌరవం తనకి. పరాయివాళ్ళని అన్నయ్యా! తమ్ముడయ్యా! అని పిలవటం ఇష్టంలేదు- తనకి.

"రండి" అంది మామూలుగా.

"అమ్మ ఉందని వచ్చాను" అన్నాడు. సుందరయ్య- పలువరస మెరిపిస్తూ, మంచంమీద కూర్చున్నాడు.

"లేదు" అంది తను. ఇతని నవ్వ్వతప్ప.... పాపం ఆకారం మొత్తం 'అగ్లీ'గా ఉంటుంది అనుకుంది తను- అతన్ని చూసి.

"బి. ఏ. అవ్వగానే ఏంచేస్తావ్?" ఆప్యాయత కనిపిస్తోంది అతని మాటల్లో.

"ఇంకా ఆలోచించలేదు."

"ఇంకా పైకి చదువుతావా?"

"అది అప్పటిసంగతి."

"పైకి చదవితే ఏం బాగుంటుంది? పెళ్ళిచేసుకో చెల్లెమ్మా!"

సిగ్గుపడింది తను. తలవంచు కూర్చుంది.

"నువ్వంటే నాకెంతో ఇష్టం అనూరాధా! నువ్వు ఎవ్వరికీ చెప్పనంటే నీతో నా కష్టసుఖాలు చెప్పుకుంటాను. అయితే రహస్యంగా ఉంచాలి! ఎవరికీ చెప్పకూడదు." గొంతు తగ్గించి అన్నాడు.

"నా కెందుకు మీ కష్టసుఖాలు చెప్పటం? మీ అవిడుందిగా? ఆమెకి చెప్పండి!" అప్రయత్నంగా అనేసింది తను.

"నాకు తెలుసు అనూరాధా! మీ కాలేజీ అమ్మాయిలు భలే గడుసుపిండాలు! ఈ విషయం ఆ అనాకారిదానికి తెలియకూడదు. అంతేకాదు. మీ అమ్మకికూడా చెప్పకూడదు నువ్వు." గొంతు తగ్గించి అన్నాడు.

"నేను చదువుకోవాలి" అందామనుకుంది తను. ఈ లోపుగానే మొదలుపెట్టాడతను.

"నేను చదువుకునే రోజుల్లో. మా యింటి కెదురుగుండా ఓ కాలేజీ అమ్మాయి ఉండేది. ఇంటర్ చదువుతుండేది. అన్నీ ఫస్టు మార్కులే! ఆ అమ్మాయికి. ఆ అమ్మాయి చదువు, చనువు చూసి ముగ్ధురాలైంది మా అమ్మ.

'ఒరే సన్నాసీ! చూడరా! ఆ అమ్మాయిదీ నీదీ ఒకటే ఈడు. ఆ అమ్మాయి కాలేజీలో చదువుతుంటే, నువ్వు హైస్కూల్లో చదువుతున్నావు సిగ్గులేకుండా. ఇప్పుడెలాగు శెలవులేగా ఇద్దరికీ! ప్రతిరోజూ మధ్యాన్నం మనింటి కొచ్చినప్పుడు తెలియనివి అడిగి తెలుసుకుంటూ ఉండు, నేను చెపుతా! ఆ అమ్మాయితో" అంది ప్రేమగా.

"తాత....తండ్రిలాగ....చింతపండూ మిరపకాయా అమ్ముకోకుండా నేను బాగా చదివి పెద్ద అఫీసరునవ్వాలని ఆమెకోరిక!

"సరేనమ్మా" అన్నాను.

"నాబాబే." అంటూ పొంగిపోయింది.

ఆ అమ్మాయిపేరు సరోజ. వికసించిన పద్మంలా ఉండేది. ఆ కళ్ళలోని మెరుపు, ఆ పెదవి విరుపు ఇప్పటికీ గుర్తు నాకు.

మర్నాడు రాగానే ఆ అమ్మాయికి నాగురించి చెప్పింది మాఅమ్మ.

గలగలా నవ్వింది ఆ గడుసుపిల్ల.

"అయితే, ఈ నల్లమొద్దబ్బాయిని బండకేసి అరగదీసి.... బంగారుబాబును చెయ్యాలన్నమాట."

సరోజ అంగీకారానికి మాఅమ్మ తెగ సంబరపడిపోయింది

"అవునేపిల్లా! నీరుణం ఉంచుకోనులేవే! మా అబ్బాయిని ఆఫీసరుని చెయ్యాలవే!" అంది ఆప్యాయత కురిపిస్తూ.

"ఓయబ్బో ఎంతాశ?" నావేపుచూసి కిసుక్కున నవ్వింది. ఆ నవ్వు నాకు సమ్మోహనాస్త్ర మనిపించింది.

మరుసటిరోజునుంచీ పాఠాలు ప్రారంభించింది పంతులమ్మ!

కాఫీ, టిఫిన్ ఇచ్చిన తరువాత పెసర పొడుం విసరటం లోనో, అప్పడాలు వత్తటంలోనో మునిగిపోయేది అమ్మ.

పంతులమ్మగారి పాఠాలమీదకన్నా, ఆమె అందమైన జుట్టు మీద, మిలమిలలాడే కళ్ళమీద, గుండ్రని పెదవులమీద, మెడకింద ఎత్తుపల్లాలమీద ఉండేది నా దృష్టి!

"ఏయ్! ఏమిటలా తినేసేలా చూస్తావ్?" అని నన్ను బెదిరిస్తుండేది అప్పుడప్పుడూ. జారిన ఆమె పయ్యెదకేసి చూస్తూ, చిలిపిగా నవ్వేవాణ్ణి నేను!

"ధ్యాస పాఠంమీద పెట్టుకో! ఎక్కడో కాదు." అని మందలించేది- పైట సర్దుకుంటూ.

"సుందరయ్యగారూ" అంది తను గట్టిగా. పైకి అంత మంచిగా కనుపించే ఈ సుందరయ్య అంతరంగం ఇంత చెదలు పట్టిందా? అని ఆశ్చర్యపోయింది.

సుందరయ్య తనని లక్ష్యపెట్టలేదు. చెప్పుకుపోతూనే ఉన్నాడు- ప్రవాహంలా!

"ఓ పదిరోజులు గడిచాయి. అనూరాధా! నేనూ చొరవ తీసుకోవటం మొదలుపెట్టాను. పొరపాటున తగిలినట్టుగా భుజాన్ని

తాకానోసారి ఆమె గమనించలేదు. గమ్మత్తుగా వీపుని నిమిరాను మరోసారి. యాంత్రికంగా విదిలించుకుంది.

చల్ల కొచ్చి ముంతదాచటం మెందుకన్నట్టుగా తొడమీదచెయ్యి వేశాను ఇంకోసారి.

ఆమె మత్తుగా నవ్వింది. ఆ నవ్వులో ఆహ్వానం కనుపించింది నాకు.

నేనూ అదోలా నవ్వాను.

"ఇంకా బాగా నవ్వు!" అంది చిలిపిగా.

అలాగే చేశాను.

"ఇంకా దగ్గరికిరా!" అంది.

నా వళ్ళు పులకించిపోయింది. ప్రేయసి పిలుపు పురస్కరించుకుని, ఆమె దగ్గరగా వెళ్ళి, బలంగా కౌగలించుకున్నాను.

మరుక్షణంలో ఏం జరిగిందో నువ్వూహించగలవా అనూరాధా!"

"సుందరయ్యగారూ! ఇక ఆపండి! మీ రిలాటివారని తెలిస్తే అసలు లోపలికే రానిచ్చేదాన్ని కాదు. పెళ్ళికాని ఓ ఆడపిల్లతో ఇలాంటి మాటలు చెప్పటానికి మీకు సిగ్గులేదూ!" కోపంగా అంది తను.

సుందరయ్య అదోలా నవ్వాడు.

"ఎవరూ లేరుగా అనూరాధా! ఆ కాస్తకూడా చెప్పనీ! బలే మజాగా ఉంటుంది అంటూ కొనసాగించాడు.

"అంతే! నా చెంప ఛెళ్ళుమంది. నా గూబ గుయ్యిమంది. ఇదేమిటి సరోజా! ఇదా నువ్విచ్చే బహుమతి!" అన్నాను చెంప తడుముకుంటూ.

"ఇంకేమిస్తా ననుకున్నావ్! నీ పాత చింతపండు ముఖం చూసి." అని కస్సుమని ఆమె యింట్లోకి పారిపోయింది.

మరుసటిరోజు మధ్యాహ్నం నా యింటికి వచ్చిందిగానీ, నాతో మాట్లాడలేదు. నేనూ బింకంగానే ఉన్నాను. అలా మూడు రోజులు గడిచాయ్! నాలుగోరోజున నిలేశాను సరోజని

"ఇదేమన్నా నీకు న్యాయంగా ఉందా! నువ్వు నాతో మాట్లాడకపోతే నేను చచ్చిపోనూ?!" అన్నాను.

"ఈ వట్టికబుర్ల కేంలె!" అంటూ నా జేబు చూసింది. టెరీన్ షర్టులోంచి పదిరూపాయల నోట్లు కనిపిస్తున్నాయి ఆమె ముఖంలో వెలుగు!

నాకేమీ అర్థంకాలా. క్వశ్చన్‌మార్క్ ముఖం పెట్టాను.

"వట్టి మట్టిబుర్ర! నాతో రా!" అంది చొరవగా.

మంత్ర ముగ్ధుడిలా ఆమెవెంట నడిచాను.

క్రితం రాత్రి.... వత్తులు చేసుకుంటానికి చాలాసేపు మేలు కుంది అమ్మ. దాని ఫలితంగా గుర్రుకొట్టి నిద్రపోతోం దప్పుడు.

అమ్మని దాటి మరో గదిలోకి తీసుకుపోయింది సరోజ నన్ను.

"నువ్వు వట్టి బేవార్సుగాడివా!" అంది కింది పెదవిని పంటితో నొక్కుతూ

"కాదు" అన్నాను నివ్వెరపోయి.

"దగుల్బాజీవా?"

"కాదు"

"అయితే.... ఆ తలుపు గడియపెట్టిరా! మీ అమ్మ లేచినా ఫరవాలేదు" అంది.

తలుపు గడియపెట్టగానే భయంపట్టుకొంది నాకు. మొన్నటిలా చెంప పగలకొట్టదు కదా?!

"నీ జేబులో ఎంతుంది డబ్బు?" లెక్కపెట్టాను వంద రూపాయలుంది. అమ్మ నా విషయంలో చాలా లిబరల్!

"ఇలా ఇవ్వు."

ఇచ్చాను.

ఆమె ఆ పదిరూపాయలనోట్లని జాకెట్లో దోపుకుంది.

నేను పెదాలు తడుపుకుంటున్నాను.

"ఇక వెళ్ళిరా" అంది కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ.

కుంగిపోయాను నేను.

పకాలున నవ్వింది సరోజ.

ఆ సమయంలో.... ఆమె మూర్తీభవించిన ప్రేమదేవతలా ఉంది. కానీ ఏం లాభం?

మరి ఆ నవ్వేమిటి' న్న వాజమ్మగా నిరూపించటాని కాకపోతే....

కోపంగా నాలుగూ కడిగేద్దామనుకున్నాను.

"వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోవటమేనా?" కొంటెగా అడిగింది.

నా తల తిరిగిపోయింది.

మరుక్షణంలో ఆమె నన్ను అమరసుఖాలలో ముంచెత్తింది.

"ఆడదాన్ని ఊరికే ముట్టుకోకూడదు. అది నీకు తెలియ జెప్పటానికే.... ఆరోజున నిన్ను విరసించాను. ఇప్పుడు నీ ముచ్చట తనివితీరా తీర్చుకో." అంది నన్ను మరింతగా హత్తుకొంటూ.

భరించలేకపోయింది తను. సుందరయ్యమీద విపరీతమైన జుగుప్స కలిగింది.

"సుందరయ్యగారూ! ఛీ! ఏంమాటలివి? దయచేసివెళ్ళిపొండి! మీరిక్కడినుంచి!" అంది కళ్ళనిండా అసహ్యం కురిపిస్తూ.

తనధోరణి మానలేదు సుందరయ్య.

"ఎందుకు చెబుతున్నానంటే అనూరాధా! మీ కాలేజీ అమ్మాయిల ఫోజు నాకు బాగాతెలుసు!

ముందే బెట్టు. ఆ తరవాత ఆ మగవాణ్ణి వదిలిపెడితే ఒట్టు" వికటంగా నవ్వాడు.

"సుందరయ్యగారూ! ఎవరో ఓ దౌర్భాగ్యురాలు చెడి పోయిందని కాలేజీ అమ్మాయిలంతా అలాగే ఎందుకుంటారు? మీ మాటలు భరించలేనంత అసహ్యంగా ఉన్నాయ్! మీరు వెడతారా? నన్ను తలుపులేసుకోమన్నారా?" తీక్షణంగా అడిగింది తను.

"ఇదిగో! ఇవి తీసుకుని, నన్నుకూడా లోపలుంచి తలుపు వెయ్యి. మజాగా ఉంటుంది. హి....హి....హి" అన్నాడు సుంద రయ్య.

అతని చేతిలో రెండు వందరూపాయల నోట్లు రెపరెప లాడుతోన్నాయ్.

"యూ బ్రూట్!" అని తిట్టింది తను. అయినా సుందరయ్య కదలలేదు. రాతిబొమ్మలా అలాగే నిల్చున్నాడు. పరిస్థితి ఇరకా టంగా ఉంది తనికి. కొన్ని సెకండ్లలో అపద్బాంధవిలా వచ్చింది అమ్మ. "ఏమిటది?" అంది తీక్షణంగా. తను వణికిపోయింది. ఏం రభస జరుగుతుందోనని.

ముఖ కవళికలు మార్చేశాడు సుందరయ్య. "ఏంలేదు

శారదమ్మ పిన్ని. అర్జంటుగా చిల్లర కావలసి వచ్చి, నువ్వున్నా వేమోనని వచ్చాను. లేవు అంటోంది చెల్లాయ్! చిల్లరుందా నీ దగ్గర?" అన్నాడు ఏమీ ఎరగనివాడిలా చిల్లర లేదని చెప్పింది అమ్మ. వెంటనే వెళ్ళిపోయాడు సుందరయ్య.

ఆపద తప్పిపోయినందుకు తేలిగ్గా నిట్టూర్చింది తను. సుందరయ్య విషయం అమ్మకి చెపితే బాగుండదేమో ననిపించి ఊరుకుంది తను.

# 7

కిటికీలోంచి బయటికి చూసింది అనూరాధ. చీకటి నల్లగా కనిపిస్తోంది. కీచురాళ్ళ రొద తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. కానీ అనూరాధ మనసులో మాత్రం అంతా గజిబిజిగా ఉంది. ఇవ్వాళ నిద్ర తన కెందుకు దూరమయినట్టు? అసలు తప్పు తనదే! మనసు ప్రశాంతంగా ఉంచుకుంటే.... ఇలాంటి ఆలోచనలు ఎందుకు వస్తాయి? చిత్రంగా నవ్వుకుంది అనురాధ. ఎవరో యోగులు ... మునులకి తప్ప మనసుని ఆలోచనా రహితంగా ఉంచుకోవటం అందరికి సాధ్యమా? కాని.

ఠంగ్.... ఠంగ్.... ఠంగ్.... గోడ గడియారం గంటలు కొడుతూనే ఉంది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ.

లెక్కపెట్టింది అనూరాధ. అమ్మో! పన్నెండు గంటలే!

పదిన్నరదాటి మేలుకోవటం సాధారణంగా అలవాటులేదు తనకి.

అంతగా చదువు పూర్తి కాకపోతే తెల్లవారుఝామున నాలుగున్నరకో.... అయిదింటికో లేస్తుంది.... లేదా అమ్మ లేపుతుంది.

అలాంటిది.... ఇవ్వాళ నిద్ర తనమీద కక్షగట్టినట్టుగా పారిపోయిందేమిటి? ఎడతెగని ఆలోచనలే నిద్రలేమికి కారణ మేమో!!

కాదు ఆ బాడీగార్డులే! అలా అనుకుంటే.... ఆ బాడీగార్డులు

చాలా రోజుల్నుంచీ తమ వెంటబడుతున్నారుగా! నిజమే! అయితే వాళ్ళమీద ఇప్పుడేగా తన మనసు లగ్నమయింది.

వాళ్ళమీద తనకు మనసయిందా? తనలో తనే చిత్రంగా నవ్వుకుంది— అనూరాధ.

ఆడపిల్లల వెంటబడి.... అల్లరిచేసి....ఏడిపించి కన్నీళ్ళు తెప్పించే బాడీగార్డులమీద తన ఊహ లల్లుకుంటున్నాయా?! ఎంత వింత!!

ఏమో....? ఇదంతా చివరికెటు దారితీస్తుందో...! పైగా నలుగురు బాడీగార్డులమీద తనకు ఇష్టంగానే ఉంది-

ప్రసాద్ కండలుతిరిగిన శరీరంతో వస్తాదులా ఉంటాడు.

గోపీ... వినోద్‌ఖన్నాలా ఉంటాడు! శేషు.... ధర్మేంద్రలా ఉంటాడు.

శేఖర్- అచ్చం అమితాబ్‌బచ్చనే!!

తనకి వీళ్ళు.... వీళ్ళు నలుగురూ కావాలి!

తప్పకుండా కావాలి!!

ఛీ! తన మనసిలా పరుగిడుతుందేమిటి ఇవ్వాళ?

తనేమన్నా ద్రౌపదా!! ఒకరికన్నా ఎక్కువకావాలని కోరుకుంటానికి ?

ఏమో........??

ఛీ! యాక్! అయినా కాలమే నిర్ణయించాలి.

అనూరాధ ఆలోచనలు అల్లిబిల్లిగా గజిబిజిగా అలా సాగుతూనే ఉన్నాయి. వాటిని దిద్దర్చుచేసినవాడు రామలింగం! అతన్ని గురించిన గత సంఘటన గుర్తు తెచ్చుకుంటోంది అనూరాధ. సుందరయ్య సంఘటన జరిగిన ఇరవై రోజులికి జరిగిందిది.

"అన్నమ్మా" అని కేకేసింది- రామలింగం తల్లి.

"అన్నమ్మా! ఏమిటి! పున్నమ్మలా-! చక్కటి పేరును ఖూనీ చేసింది ఈ టోడెమ్మగారు." లోలోపల విసుక్కుంటూ పైకి మాత్రం మర్యాదగా "ఏమిటండీ?" అంది తను.

"నీకు వీలున్నపుడొకసారి వచ్చిపోమ్మా. భాగవతంలో నాలుగు పద్యాలు చదివి వినిపించుదుగాని" అంది.

తనేదోమాట్లాడేలోపునే అనుమతి తీసుకుంది-మామ్మగారు.

"ఆవిడ కెంత ముచ్చటగా ఉందో ఏమో....? వీలున్నప్పుడు ఒకసారి వెళ్ళి వినిపించిరా! పుణ్యమొస్తుందికూడాను" అంది.

తన అంగీకారంకూడా తెలపగానే ఇద్దరినీ ఆశీర్వదిస్తూ వెళ్ళిపోయింది మామ్మగారు.

ఓ సాయంత్రం- అమ్మ షాపుకి బట్టలకోసం వెళ్ళినప్పుడు- మామ్మగారి అభ్యర్ధన గుర్తుకొచ్చింది తనకి. రామలింగం పోర్షను లోకి వెళ్ళింది తను- తలుపు తాళంపెట్టి.

మునిమాపువేళ అది. చీకట్లు ముసురుకో బోతున్నాయి.

దగ్గరగాఉన్న తలుపులు తోసుకుని లోపలికెళ్ళింది తను.

"మామ్మగారూ!" అంటూ పిలిచింది. ఎవరూ పలకలేదు.

కొంచెం లోపలికెళ్ళింది.

మంచంమీద ఒకామె పడుకుని ఉంది.

ఆమె రామలింగం భార్య! రోగిష్టిమారిది.

దగ్గరగావెళ్ళి "ఏమండీ!" అని పిలిచింది.

పలకలేదామె. మగతలోఉంది. ఏదో మాత్ర వేసుకున్నట్లుంది.

మామ్మగారు- మామూలుగా ఈవేళలో - బయటికివెళ్ళరు. పెరట్లో ఏమన్నా పనిచేసుకుంటుందేమో? కొంచం ముందుకి నడిచింది తను. అక్కడి దృశ్యంచూసి వళ్ళు గగుర్పొడిచింది తనకి.

రామలింగం.... ఒక టేబులు ముందు కుర్చీలో కూర్చున్నాడు.

అతని జుట్టంతా నెరిసి.... ముగ్గుబుట్టలా ఉంది

కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి.

ముఖం ముడతలతో అసహ్యంగా ఉంది. తనని చూడగానే "ఓ! శారదమ్మ కూతురా " అన్నాడు. అదోలా నవ్వుతూ.

"నమస్కారమండీ! మామ్మగారు లేరా?" వినయంగా అడిగింది.

"మామ్మగారికోసం కాకపోతే...." నా కోసం వస్తావుటమ్మా....? నా కన్నకూతురే నన్ను నిర్దాక్షిణ్యంగా వదిలేస్తే...! ఇంక నా మొహం ఎవరు చూస్తారు??" అయన కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. అంత పెద్దాయన— అలా బేలగా బాధపడుతుంటే గుండె తరుక్కుపోయింది.

"ఏమిటండీ? ఏమయింది మీ రెండో అమ్మాయికి" అంది సానుభూతిగా.

ఆయన అంతా వివరంగాచెప్పి "నా కూతుర్ని బలి తీసుకున్నానమ్మా. నేను వస్తుతః తాగుబోతుని కాదమ్మా. నాకున్న బాధలవల్ల ఇలా తయారయ్యాను". అన్నాడు విచారంగా. తను వింటోంది.

"చూడమ్మా! నువ్వు ంచున్నావు. నేను కూర్చున్నాను. ఇంకా పానపాత్ర ముట్టుకోలేదనుకో! అలా ఆ కుర్చీలో కూర్చోరాదూ?"

"పరవాలేదులెండి!" అంటూ అలాగే నిల్చుండిపోయింది తను. వంచిమాటలవల్ల ఆయనమీద సానుభూతి కలిగి - భయం పోయింది

"ఈ దీనుడిమీద ఎవరు జాలి చూపిస్తారు? జీవితంలో అన్నీ కోల్పోయాను. ఏ కోరికలూ తీరక....జీవచ్ఛవంలా బతుకుతున్నాను."

పాపం అనిపించింది తనకి.

"చూడు పాపా! నువ్వు నా కంటే చాలా చిన్నదానివి. అయినా నిన్ను ప్రాధేయపడి అడుగుతున్నాను.... నాకో చిన్న సాయం చెయ్యగలవా?"

"చెప్పండి ఏమిటో?"

"చెపుతానమ్మా! నిన్ను చూస్తుంటే.... పోయిన నా ప్రాణం లేచివచ్చినట్టుగా ఉంది.... నవచైతన్యం వెల్లివిరిసినట్టుగా ఉంది!"

ఆయని భాష తన కర్థం కావటంలేదు. అయినా ఆయన చెప్పుకుపోతూనే ఉన్నాడు

"పాపా! నీకు నేను చీరలు కొనిపెడతాను."

"ఎందుకు?"

"ఎందుకేమిటి? కట్టుకుంటానికి. ఇంకా బోలెడన్ని నగలు చేయిస్తాను...."

"మీరంటున్నదేమిటో నా కర్థంకావటం లేదు." అయోమయం ముఖంపెట్టింది తను.

"నీ కష్టసుఖాలన్నీ నేను పంచుకుంటాను. నువ్వూ అలాగే

చెయ్యాలని ఆశిస్తున్నాను పాపా !"

"ఏమిటండీ మీ రనేది ?"

ఇంకులో అర్థంకాకుండా ఉంటానికేముందమ్మా ?"

"సరిగా చెప్పండి !"

"నాకు బిల్లకింద సంపాదన బాగా వస్తుంది. అయినా అన భవించటానికేమీలేదు. ఈ తాగుడు తప్ప. నువ్వు మానేయమంటే ఇదికూడా మానేస్తాను."

సినిమా డైలాగుల్లా ఉన్నయ్ ఆయన మాటలు. విషయం అర్థంగాకుండా గందరగోళంగా ఉన్నది తనకి.

నేను మానేయమంటే మానేయటమేమిటి ? నేను కృష్ణలో దూకమంటాను దూకుతారా !" నవ్వుతూ అడిగింది. అంతధైర్యం ఎలా వచ్చిందో తనకి"

"ఆహా ! అక్షరాలా".

తనకెంతో ఆశ్చర్యమేసింది.

"అయితే ఒక షరతు...."

"ఏమిటది ?"

"నాకు భార్య ఉందికదా ?"

"ఉంది."

"ఆమె రోగిష్టిది కదా ?"

"అవును"

"అంటే ఎందుకూ పనికిరాదనేగా ?"

విషయం అర్థమవటంలేదు తనకి. జవాబు చెప్పలేదు తను

"నేను బజారున పడితే ఇల్లు గుల్ల, వళ్ళు గుల్లేకదా !"

అయితే ఏమంటాడింతకి. తన మనస్సు ఆదుర్దాతో ఎగిరి పడుతోంది.

"ఇప్పటికే నా పరువు సగం పోయింది - ఈ తాగుడుతో."

శ్రోతలా వింటోంది తను.

"రామలింగానికి తాగుబోతనే పేరు ఉందిగానీ,తిరుగుబోతని ఇంకా ముద్రపడలేదు పాపా !"

"....తను శ్రద్ధగా ఆలకిస్తోంది."

"ఇప్పుడా ముద్రకూడా వేయించుకోవాలనుకుంటున్నాను."

అసలు విషయం బయట పెట్టాడాయన.

ఛీ! అనిపించింది తనకి. ఇదా! రామలింగం మనసులోని మనసు?! వెనక్కి తిరగబోయింది తను.

"ఆగమ్మా! అసలు విషయం తెలుసుకుని వెళ్ళు" వారించాడు రామలింగం. తనకింకా అర్థంకాలేదనుకుంటున్నాడు - మానవుడు.

"నా వ్రీస్‌వల్ల ఇలా తయారయ్యాననుగానీ, నాకేమంత వయస్సుందని? కాలం కలిసి రావాలేగానీ, మళ్ళీ నిత్యనూతనుడిలా, నవయువకుడిలా తయారవ్వనూ?"

"........"

"ఏంలేదమ్మా! నువ్వు కోప్పడకుండా కాస్త నిదానంగా ఆలోచించు"

"మీఅమ్మ నీకు ఖరీదైన బట్టలు కొనిపెట్టగలుగుతోందా?"

"........"

చేతినిండా డబ్బులు ఇవ్వగలుగుతోందా?"

"........"

నీతోటి ఆడపిల్లలు చూడు. నీలాగే ఇలా ఉన్నారేమో? సరదాగా సంతోషంగా ఉన్నారు. జీవితాన్ని అనుభవిస్తున్నారు.

"........"

"నేను నీకు అన్నీ ఇస్తాను- ఎప్పుడు కావాలంటే అప్పుడు. దయచేసి నామాట కాదనకు. ఆ సుఖంకూడా ప్రసాదిస్తాను."

తనకి తెలియకుండానే కోపం ఉబికి వచ్చేసింది.

"రామలింగంగారూ! ఏమిటి మీరనేది? నేను మీ కూతురు లాంటిదాన్ని."

గమ్మత్తుగా నవ్వాడు- రామలింగం.

"పిచ్చి పాపా! కన్నకూతురు తప్ప- ఇంకే పరాయి ఆడపిల్లా కూతురు కాలేదు. ఈ వావివరసలు ఆత్మవంచన తప్ప మరేం కాదు పైకి "కూతురా!" అని పిలుస్తూ, లోపల "ప్రేయసీ" అనుకుంటే బాగుంటుందా!"

ఎంత పచ్చిగా, అసహ్యంగా మాట్లాడుతున్నాడు రామలింగం? అనిపించింది తనకి.

అప్పోసీలే వాటిమీద తర్జన భర్జన లెందుకుగానీ, నిన్ను నేను కూతురుగా కాదు. 'స్పేర్ వైఫ్'గా చూసుకుంటాను కాదనకు. రెండో కంటివాడికి తెలియకుండా జాగ్రత్త పడతాను. అంతా గప్ చిప్ సాంబారు బుడ్డీ!"

ఉద్రేకంతో ఊగిపోయి, రామలింగాన్ని నానా తిట్లు తిట్టి వచ్చింది తను.

"బలవంతంగా లోపలికి లాగేసి నోరు నొక్కేస్తే, పది నిమిషాల్లో పనయిపోయేది. మర్యాదగా అడుగుతుంటే.... నీలుగుతోంది! దీన్ని, దీని తల్లిని, ఆ దొంగభక్తుడు- ఈశ్వరయ్య ఓ పట్టు పట్టకుండానే ఉన్నాడా?" అంటున్న రామలింగం మాటలు తన చెవుల్లో కర్ణ కఠోరంగా గింగురుమంటూనే ఉన్నాయి.

ఈశ్వరయ్య, సుందరయ్య, రామలింగం పైకి ఎంత మంచిగా కనిపిస్తారు వీళ్లు? "మేడిపండులాంటి వాళ్ళని ఎవరికి తెలుసు? చెప్పినా ఎవరు నమ్ముతారు! నమ్మరు! కారణం.... మంచి తనమనే ముసుగు వాళ్ళు కప్పుకోవటమే!

హఠాత్తుగా తన మనసు కామేశంమీదకి మళ్ళింది. అతను భార్యమీద చూపించే ప్రేమ, అనురాగం ఆమెను స్కూటరు మీద తిప్పే షికార్లు ... అనుక్షణం ఆమె కొంగు వదలకపోవటం గుర్తొచ్చాయి తనకి

"నో డౌట్! ఈ ఆవరణ మొత్తంమీద అతనొక్కడే మంచివాడు. మిగతావాళ్ళంతా పరమదుర్మార్గులు.. కామపిశాచాలు!" అనుకుంది.

ఈశ్వరయ్య.... సుందరయ్య.... రామలింగాలకి దూరంగా ఉంటూ కామేశం మంచితనాన్ని గమనించసాగింది. ఇలాంటి విషయాలు అమ్మకు తెలియటం మంచిది కాదనుకుని.... ఆమెకు చెప్పటం మానుకుంది

## 8

మళ్ళీ గంటకొట్టింది ఈశ్వరయ్య ఇంట్లో గోడగడియారం పన్నెండున్నరయిందని గ్రహించింది అనూరాధ.

ఏమిటింతగా సమ్మోహించేసింది నిద్ర తనమీద?

మళ్ళీ అటూ, యిటూ దొర్లింది. ఈసారి ఆమె ఆలోచనల్లో కామేశం చోటుచేసుకున్నాడు.

ఓ నెలరోజులు గడిచిపోయాయి.

ఓ సాయంత్రం కాలేజీ వదిలిపెట్టినతరవాత.... బాడీగార్డుల ఈటెలలాంటి మాటల విన్యాసాలు పూర్తయింతర్వాత.... వాళ్ళు వెళ్ళిపోయింతర్వాత.... 'పనుందంటూ' వేరేచోటికి వెళ్ళిపోయారు సుధారాణి.... ఆశాలతలు. తను ఒంటరిగా నడుస్తోంది సిమెంటు రోడ్డుమీద. "ఇప్పుడు ఎవరన్నా తన వెంటపడితే....? ఆ వూహకే భయమేసింది తనకి. ఉలిక్కిపడి అలవోకగా వెనక్కి తిరిగిచూసింది ఎవడో స్ట్రీట్ గూండాలా ఉన్నాడు. గళ్ళలుంగీ... గళ్ళషర్టు....! మెడుటికికట్టిన దుమాలు....! చింపిరిజుట్టు....!ఎర్రగా ఉన్న కళ్ళు! వాడినిచూసి వణికిపోతుంది తను.

"ఏం పిల్లా? ఏంటికత? ఒంటరిగా ఏడుతుండావు!" అంటూ వెంబడించాడు తనని. వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది తనకి.

నిజంగా తనకి బుద్ధిలేదు. లేకపోతే.... తన స్నేహితురాళ్ళు వెళ్ళగానే రిక్షా ఎక్కివెడితే ఏంపోయింది? ఇప్పుడెలా? రిక్షాకోసం చూసింది తను. కనుచూపు మేరలో రిక్షా కనిపించటంలేదు. జనం గూడా ఎక్కడో దూరంగా, పల్చగా ఉన్నారు. స్పీడుగా నడవటం మొదలెట్టింది. ఒక్కసారి వెనక్కితిరిగి చూసింది వాడూ జోరుగా నడుస్తూ వస్తున్నాడు తనని చూసి ఈలవేస్తున్నాడు.

"ఏ దేవుడన్నా తనని కాపాడకూడదూ!" అనుకోకుండానే భగవంతుణ్ణి ప్రార్థించింది. "పట్టణాల్లో అమ్మాయిల గతి నిజంగా అధోగతే!" రోడ్డుమీద వెడుతుంటే ఇంటికి చేరతారో లేదోకూడా తెలియదు అనిపించింది తనకి.

తన పక్కన స్కూటరాగేసరికి మరికాస్త వణికిపోయింది తను పులిమీద పుట్రలా వీడెవడు? అనుకుని భయం భయంగా చూసింది.

అంతే!

పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది.

కామేశం! తను కాంపౌండు మనిషి! తెలిసిన మనిషి!

ఇప్పుడు తన కితనే అపద్బాంధవుడు! ఇంతకుముందు తనెప్పుడూ ఇతనితో మాట్లాడలేదు.

అతనూ అంతే!

తనతో మాట్లాడటానికి ప్రయత్నించలేదు. వెకిలిచేష్టలు చెయ్యలేదు. తను కనిపించినా తలవంచుకుని వెళ్ళిపోయేవాడు. ఇతను తననుకుంటున్నట్టుగా నిజంగా బుద్ధిమంతుడు! అందుకు సందేహం లేదు.

చిరునవ్వు నవ్వాడతను. "బాగున్నారా" అంటూ పలకరించాడు.

"అడుగో! అటు చూడండి వాడు నన్ను వెంబడిస్తున్నాడు" భయం భయంగా చెప్పింది.

"డోన్ట్‌వర్రీ! మీరేమీ ఆలోచించకుండా నా స్కూటర్ ఎక్కండి." ఎంతో మర్యాదగా అడిగాడు. ఆ పరిస్థితిలో అంతకన్నా గత్యంతరంలేదు. మారుమాట్లాడకుండా ఎక్కికూర్చుంది.

ఆడపిల్ల వెనకాల కూర్చుంది గదాని వెకిలిమాటలు మాట్లాడటంగానీ, వికారపుచేష్టలు చేయటంగానీ ఏమీచెయ్యలేదు-కామేశం. అసలు దాదాపు మాట్లాడనే లేదతను. "చాలా థాంక్సండీ" అని, తనంటే. 'నో మెన్షన్' చెప్పి ఊరుకున్నాడు.

మరో పది నిముషాల్లో స్కూటరు ఓ ఎ. సి. హోటలు ముందాగింది.

తను దిగి- విస్మయంగా అతనికేసి చూసింది.

"ఇంటివరకూ మిమ్మల్ని స్కూటరుమీద తీసుకెడితే.... బాగుండదు. నలుగురు మరోవిధంగా అనుకుంటారు."

ఆ మాటలతో అతనిమీద గౌరవభావం ఎన్నోరెట్లు పెరిగిపోయింది- తనకి.

"రండి! అసలే వర్రీగా ఉన్నారు మీరు. కాస్త కాఫీ తాగి, మీరు రిక్షామీద వెడుదురుగాని, నేను పనిచూసుకుని మరో గంటలో వస్తాను."

"ఎందుకులెండి! నేను వెళ్ళిపోతాను." అంది తను మొహమాటంగా.

"ఇచ్చి పుచ్చుకుంటేనే మిస్ అనూరాధా! ఏదయినా రాణిం

చేది?" చిరునవ్వు కురిపించాడతను.

"ఏమిటి."

"నేను మీకు ఆపదలో సహాయం చేశాను. మీరు నాకు ఆపదలో సహాయపడాలి." అతని మొహం కళకళలాడిపోతోంది.

"ఏమిటి మీకొచ్చిన ఆపద?"

"మా ఇందు.... లేదు మీరు కాఫీకి కంపెనీ ఇవ్వాలి తప్పదు. లేకపోతే మీకు కృతజ్ఞత లేనట్టే!"

ఇతని మాటలెంత బాగుంటాయి? అనుకుని "సరే పదండి" అంది.

అతను స్కూటర్ లాక్ చేశాడు.

ఇద్దరూ ఎ. సి. రూంలోని వెళ్ళి కూర్చున్నారు

జనం అట్టే లేరు. మూలగా ఒకచోట కొత్తజంట ఒకటి కూర్చుంది వాళ్ళు టిఫిన్ తినటం మరిచిపోయి - ప్రణయచేష్టలు సంజుకు తింటున్నారు.

తను సిగ్గుపడింది. ఇద్దరూ ఎదురు బొదురుగా కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు

"ఏం తీసకుంటారు?"

"ఓన్లీ కాఫీ"

"ఇంకా నయం సింపుల్‌గా మంచినీళ్ళనలా!" అంటూ రెండు స్వీట్లు తెప్పించాడు కామేశం. మొహమాటపడుతూ అది తినేసరికి రెండు రవ్వట్లు తెప్పించాడు.

ఈలోపుగా ఆ కొత్తజంట బిల్లు పేజేసి వెళ్ళిపోయారు. తనూ, అతనే మిగిలారు. తనకి ఇబ్బందిగా ఉంది.

"ఇక నేనేమీ తినలేను" అంది

"కాలేజీ అమ్మాయిలకి బెట్టు ఎక్కువఅంటారు నిజమే నన్నమాట!" నవ్వాడు కామేశం.

క్వశ్చనుమూర్కు ముఖం పెట్టింది.

లేకపోతే ఏమిటండీ? ఒక్క అట్టుకే లావయిపోగు మీ అందం పాడయిపోదులెండి! అన్నట్టు మీకు కోపంరాకుండాఉంటే ఓ కాంప్లిమెంటు....!

"ఏమిటది?"

"మీరు బ్యూటీ క్వీన్‌లా ఉంటారు. మెరిసిపోయే అందం మీది! నన్నపార్థం చేసుకోకండి. సౌందర్యారాధకుణ్ణి నేను. భావ కుణ్ణి! తీరిక ఉన్నప్పుడల్లా ఒక్క విషయమే ఆలోచిస్తుంటాను."

అతనిమాటలు వెకిలిగా అనిపించలేదు తనకి.

థాంక్స్ చెపుతూ "ఏమిటది?" అంది తను.

"భగవంతుడు మిమ్మల్ని ఏ మెటీరియల్‌తో చేశాడా? అని."

"మట్టి" అంది తను నవ్వుతూ- రవ్వట్టు తింటూ.

"కాదు! బంగారం."

"థాంక్స్."

"నో మెన్షన్. బై ది బై" అంటూ ఆగిపోయాడతను.

"చెప్పండి" అంది అతనిమీద గౌరవంతో.

"మా ఇందు పుట్టింటికెళ్ళింది. రావటానికి కనీసం ఓ పది రోజులు పడుతుంది."

తన కెందుకు చెపుతున్నా డీవిషయం? అర్థంకాలేదు తనకి.

"అంతవరకూ నాకు అంతా ఖాళీనే." నర్మగర్భంగానవ్వాడు.

తను మాట్లాడలేదు.

"నాకు కాలేజీ అమ్మాయిలంటే చాలా ఇష్టం. ఎందుకని అడగరేం? చాలా అల్ట్రా మోడ్రన్‌గా ఉంటారు చనువుగా మాట్లాడతారు. కాఫీకి, సినిమాకి, షికార్లకి కంపెనీ ఇస్తారు. చనువుగా ప్రేమగా ఏది అడిగితే అది ఇస్తుంటారు! ఆఁ! చూడండి మిస్ అనూరాధా! నేను మీకుచేసిన సహాయానికి మీరు గ్రేట్‌ఫుల్‌గా ఉంటారని ఆశిస్తాను."

"ఊఁ" అంది యాంత్రికంగా కాలేజీ అమ్మాయిల గురించి అతను చేసిన వ్యాఖ్య మాత్రం తనకి నచ్చలేదు. అతనన్నట్టు ఏ ఒకరిద్దరుంటారేమో కానీ.... అందరూ ఉండరనుకుంది.

"రోజూ మీ కాలేజీకివచ్చి స్కూటరుమీద తీసుకొస్తాను. మీరిలా నాతో హోటలుకొచ్చి కంపెనీ ఇవ్వగలరా? ప్లీజ్!" తనచెయ్యి మృదువుగా నొక్కి వదిలాడు.

అతనలా చెయ్యటం తనకి నచ్చలేదు. కానీ ఊరుకుంది ఏమనాలో తెలియక.

"అమ్మో! పలుగురూ చూస్తే బాగుండదు" తప్పించుకో

బాడీగార్డులు

టానికి ప్రయత్నించింది తను.

"నలుగురూ చూడకపోతే బాగుంటుంది అనేగా? మీఅర్థం!"

నొసలు చిట్లించింది తను.

"అలా అయితే ఒకపని చేద్దాం."

"..........."

"సాయంత్రం మీ అంతటమీరే ఇక్కడకు వచ్చెయ్యండి! ఓ గంట పైన రూంలో కూర్చుని మాటలాడుకుని వెళ్ళిపోదాం."

"ఏమిటి మాట్లాడేది?" అసహనంగా అంది.

"మరీ అంత అమాయకురాలిలా మాట్లాడకు అనూరాధా. ఈరోజుల్లో కాలేజీఅమ్మాయిలు చాలామందిచేస్తూనేఉన్నారీపనులు.

"ఛీ" అనిపించింది తనకి. ప్రతివాడూ కాలేజీ అమ్మాయిల మీద విసుర్లు విసిరేవాడే!

"ఆం! సుందరయ్య.... ఈశ్వరయ్య.... రామలింగాలమీద నీ అభిప్రాయమేమిటి?" సడన్‌గా మాట మార్చాడు కామేశం.

"పరమ నీచులు!"

అప్రయత్నంగా అనేసింది తను.

గమ్మత్తుగా నవ్వాడు కామేశం.

"అని నీ అభిప్రాయం. నీమీద వాళ్ళ అభిప్రాయమేమిటో తెలుసా?"

"ఏమిటి?" ఆదుర్దాగా అడిగింది.

"చెపితే నువ్వు బాధపడకూడదు."

"చెప్పండి."

"నువ్వు తిరుగుబోతువట. "వెరైటీ ఈజ్ బ్యూటీ" నీసిద్ధాంత మట. రోజుకో మగాడు కావాలట! మధ్యాహ్నం.. సాయంత్రం.. లేదట నీకు ఎప్పుడుపడితే అప్పుడు నీ ప్రియుడితో హోటలు రూంలో కులుకుతుంటావట. డబ్బుకు... డబ్బు, సుఖానికి సుఖం పొందుతుంటావట. కంట్రాసెప్టివుల సహాయంతో ప్రెగ్నెన్సీ రాకుండా చూసుకుంటావట. గుండెలుతీసిన బంటువట!"

వింటున్న తన ముఖం కందగడ్డలా అయిపోయింది. ముచ్చెమటలు పట్టేశాయి.

కాఫీ తెచ్చి అక్కడపెట్టి వెళ్ళిపోయాడు బట్లర్- వీళ్ళది

ఏదో ప్రేమ వ్యవహారంలా ఉంది। కాసేపు ఏకాంతాన్ని అనుభ వించనీ। తనకి బక్షీస్ బాగా ముడుతుంది" అనుకుని.

"నిన్ను బాధ పెట్టాలని కాదు అనూరాధా। నువ్వంటే నాకెంతో ఇష్టం. అం। ఒకటడుగుతాను చెప్పు. నిజంగా నీకేమీ తెలియదా?" కుతూహలంగా అడిగాడు.

"ఒట్టు। నేనేపాపం ఎరగను."

"నిన్నుచూస్తే జాలేస్తోంది అనూరాధాదేవీ।" తన హాంద్ కర్చీఫ్‌తో ఆమె నుదుట పట్టిన చెమట తుడిచాడు. తనకిష్టం లేక పోయినా ఆ పరిస్థితిలో అతన్ని వారించలేక పోయింది. తను ప్రశ్నార్థకంగా చూసింది- అతనికేసి.

"ఎటూ చెడ్డపేరు రానేవచ్చింది. వాళ్ళమీద కక్ష తీర్చుకో। ఆ దుర్మార్గుల ముఖంమీద చెప్పుతీసుకు కొట్టినట్టు ప్రవర్తించు."

"అంతే?"

"నా ఇందు స్థానాన్ని టెంపరరీగా నువ్వు భర్తీ చెయ్యి। నేను నీకు అన్నివిధాల సహకరిస్తాను."

"ఏమిటి మీరనేది?" ఏహ్యంగా చూసిందతన్ని.

"ఫ్రీగా నీకు కావలసిన సుఖం ఇస్తాను. నువ్వు కోరినంత డబ్బిస్తాను."

"కామేశంగారూ మీరెంతో మంచివారని అభిప్రాయపడ్డాను ఇన్నాళ్ళూ... ఆ వీధి గూండాకన్న దిగజారిన మనుష్యులని... ఇప్పుడే తెలుసుకుంటున్నాను. గుడ్‌బై। మీ సహృదయతకి. పోతే కాలేజీ అమ్మాయిలమీద మీరు అమూల్యమైన అభాండాలు వెయ్యకండి. వస్తాను ఛీ। ఇదా మీ నిజస్వరూపం?" కాఫీ తాగ కుండా వచ్చేసింది తను.

విషపు నవ్వు నవ్వాడు కామేశం.

"ఈశ్వరయ్య, సుందరయ్య, రామలింగం నిన్నుపట్టటానికి పన్నాగాలు పన్నుతున్నారు. నేనూ వాళ్ళతో చేతులు కలుపుతాను. మేం నలుగురం- నువ్వు ఒక్కదానివి.. హి?"

"మీతరంకాదురా బ్రూట్స్" చీకొట్టి వినవిస్తూ నడుచుకుంటూ వెళ్ళిపోయింది తను.

రిక్షాలో ఇంటికి చేరింది.

మళ్ళీ గంటకొట్టింది గోనగడియారం. ఒంటిగంటయింది విద్రపట్టేసూచనలు కనిపిస్తున్నాయ్ అనూరాధకి.

కామేశాన్ని ఎంత మంచివాడనుకుంది తను? సార్థకనామ ధేయుడనిపించాడు సౌమ్యేంద్రల్!

కామేశం చెప్పినట్టుగా.. మిగతాముగ్గురూ తనని పాడు చెయ్యటానికి పన్నాగాలు పన్నుతూనే ఉన్నట్టున్నారు. కామేశం గూడా ఆ దుర్మార్గులతో చేతులుకలిపినట్టున్నాడు. తరచు నలుగురు రామలింగం ఇంట్లో సమావేశమవుతున్నారు.

ఎలాంటి విషవలయంలో చిక్కుకుంది తను?

తండ్రి సంరక్షణలేని ఆడపిల్లలు, చదువుకునే కాలేజీ అమ్మాయిలు ఇలాంటి నీచుల కామదాహానికి బలిఅయి పోవల సిందేనా?

అమ్మకి అర్థంకాదు, తన విషమపరిస్థితి. వాళ్ళు తనని కన్న కూతురులానో, తోడబుట్టిన చెల్లెల్లానో చూసుకుంటారని ఆమె భ్రమ. చెప్పినా తననే మందలిస్తుంది

ఇంటిదగ్గర పరిస్థితి ఇలా ఉంటే, కాలేజీలో ఆ బాడీగార్డుల గోల! కుందేలుపిల్ల వెంటబడ్డ రేసుకుక్కలా ఉంది వాళ్ళ పరిస్థితి.

కొన్ని క్షణాల్లో అనూరాధ ఆలోచనాసరళి పూర్తిగా మారిపోయింది. ఈ నలుగురు, ఆ నలుగురు ఇందులో ఎవరూ తన నొదలిపెట్టరు. ముసలినక్క ఈశ్వరయ్య! నల్ల బంగారం సుందరయ్య! తెల్లజుట్టు, ముడతల ముఖం రామలింగం, బ్లాక్ మెయిల్‌చేసే కామేశం! లాంటి వెధవలు ఎందుకు తనకి?

కండలు తిరిగిన ప్రసాద్! ధైర్యానికి మారుపేరు గోపీ! సాహసానికి ప్రతినిధి శేషు! దూసుకుపోయే శేఖర్ కావాలి తనకి!!

అనునయంగా తను ఒక్కమాట మాట్లాడితేనే.... తనని పువ్వుల్లో పెట్టి చూస్తారు. తనమీద ఈగ వాలనివ్వరు! అయితే తను నలుగురితోనూ చనువుగా మసలుతుందా? ఇన్నాళ్ళు తనకున్న మంచిపేరు....? ఏమిటి మంచిపేరు?

కాలేజీ అమ్మాయిలమీద తమ అమూల్యమైన అభి ప్రాయాల్ని సుందరయ్య ప్రభృతులు నలుగురూ వ్యక్త పర

చాయగా! ఇంకా ఎందుకు తన పేరుకోసం తాపత్రయపడటం? తను వారితో క్లోజ్‌గా తిరగాలి. వారి గాఢ ప్రేమను చూడాలి. ఆవరణలోని నలుగురూ కళ్ళకుళ్ళు చావాలి. అసూయతో మగ్గిపోవాలి. తను బాడీగార్డుల నీడన చల్లగా, హాయిగా ఓహ్....!

చచ్చు దద్దమ్మలు, పిరికి దద్దమ్మలు ఏ కాలేజీ అమ్మాయి తీసుకోని నిర్ణయం తీసుకుంది తను.

ఆడపిల్లల్ని ఏడిపించే బాడీగార్డులతోనే కాలేజీ అమ్మాయి స్నేహం కలపటం ఇది చరిత్రలో అపురూపం. కొత్తదనానికిది నాంది! ఏ ఆడపిల్లా చేయలేని పని! అనూరాధ మనసు సంతోషంతో గంతులేసింది. ఆ సంతోషం కళ్ళమీద నిద్రగా మారింది. కొన్నిక్షణాల్లో అనూరాధ నిద్రాదేవివళ్ళో దూరిపడుకుంది.

# 9

మర్నాడుపొద్దున్నే అనూరాధ నిద్రలేచి పెరటిలోకి వచ్చే సరికి ఏడుగంటలయింది. సూర్యభగవానుడి బంగారుకిరణాలు నులివెచ్చగా వంటికి తగులుతున్నాయి. అక్కడక్కడా చెట్లమీద కాకులు అరుస్తున్నాయి. ఉండుండి వీస్తోంది గాలి.

శారదమ్మ నూతి పళ్ళెంమీద కూర్చుని గిన్నెలుతోముతోంది.

"ఏమిటే అనూ! రోజూ పెందరాడే లేచేదానివి ఇవ్వాళ ఇంతాలస్యమయింది? ఎన్నిసార్లు తట్టిలేపానో నేను. నువ్వ లేవనే లేదు."

"ఏదో కొత్త బద్ధకంగాఉంది నిద్ర బాగాపట్టేసిందమ్మా" అని బదులుచెప్పి... బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది అనూరాధ.

నాతల్లికి పరీక్షలయిపోగానే చక్కటి సంబంధంచూసి పెళ్ళి చెయ్యాలి. దీనికిప్పుడిప్పుడే కన్నెపిల్లల కలలు అలవాటయి నట్టున్నాయి. లేకపోతే రాత్రల్లా మేలుకుని... ఇంత ఆలస్యంగా ఎందుకు లేస్తుంది? అనుకుంది శారదమ్మ- మనసులో.

హోమ్‌వర్కంతా పూర్తిచేసుకునేసరికి భోజనానికి కేకేసింది తల్లి. భోజనంకానిచ్చి డ్రస్ చేసుకుంది అనూరాధ. టిఫిన్‌బాక్స్,

పుస్తకాలు పుచ్చుకుని కాలేజీకి బయలుదేరింది.

సుధారాణి, ఆశాలతల ఇళ్ళు దారిలోనే. వాళ్ళని కలుపుకుని బయలుదేరింది కాలేజీకి ఇళ్ళు బాగా దూరంకాక పోవటంవల్ల, ముగ్గురూ నడిచే వెళతారు. కావాలనుకుంటే సుధారాణి, ఆశాలత మోటారు వాహనాలమీద వెళ్ళగలరు. అనూరాధకోసం వాటిని వదులుకున్నారు వాళ్ళు.

ఆశాలత గలగల మాట్లాడేస్తోంది. సుధారాణి కింకిలా నవ్వుతోంది.

"ఆ తెలుగు లెక్చరర్‌గాడు లేడూ. షేక్స్పియర్ మొహం వాడూను. ఆడపిల్లలకేసి అలా తినేసేలా చూస్తాడేమిటి?" ఆశాలత సుధారాణికేసి చూసింది.

"ఆ ఇంగ్లీషు లెక్చరర్‌గాడు మాత్రం తనో హిందీ యాక్టరులా ఉంటాడని వాడి నమ్మకం. నిముష నిముషానికి కాలరు సవరించుకుంటాడు. తన స్లాక్‌కేసి, ఫాంటుకేసి చూసుకుంటాడు. ఎక్కడ నలిగిపోయాయో అని."

ఆడపిల్లల వెంటబడే జబ్బు. స్టూడెంట్లకేకాదు. లెక్చరర్లకి కూడా బాగా ఉంది. సెకండియర్ స్టూడెంటు మైథిలికి హిస్టరీ లెక్చరర్‌గాడు లేడూ. అదే ఆ అడ్డసొరకాయ తలకాయగాడు. "ప్రేమలేఖ రాశాట్ట." నీ వెంటబడి, విసుగెత్తి వేసారిపోయాను ఎప్పుడు కరుణిస్తావు దేవీ!" అని.

"ఇంకా కొన్నాళ్ళుపోతే. ప్రిన్సిపాలుకూడా ఆడపిల్లల వెంట పడతాడేమోనే?!"

సుధారాణి, ఆశాలత పకపకా నవ్వారు.

"ఏమే అనూ! ఇంత సరదా సంభాషణ నీకు కనీసం నవ్వు కూడా తెప్పించటం లేదుటే?"

సుధారాణి మోచేత్తో పొడిచింది- అనూరాధని.

"నేను చెప్పలేదుటే! దాని కీమధ్య పరధ్యానం ఎక్కువయింది. నా ఉద్దేశమేమిటంటే....?!" అని సగంలో ఆపేసింది ఆశాలత.

ఉలిక్కిపడి తేరుకుని, "ఏమిటే?" అంది అనూరాధ.

"ఒసేయ్ ఆశా! నువ్వలా సగంలో ఆపేసి, మాకు చెప్ప

కుండా అం  ఆశ పెడుతూనే ఉంచే, నువ్వు శిక్ష అనుభవిస్తావ్ తెలుసా!" సుధారాణి కళ్ళెగరేసి బెదిరించింది.

"ఏంశిక్షే అది పక్షి!" సవాలుచేసింది ఆశాలత.

"నిన్ను రేప్ చేస్తాడు ఒకడు." గల్లున నవ్వింది సుధారాణి.

ఆశాలత ముఖం చిన్నబోయింది.

"సరసం అనేది- ఇతరుల మనసు గాయపరిచేదిగా ఉండ కూడదే-!" నెమ్మదిగా అంది-బాధగా,

"ఒసేయ్ పిచ్చీ! నువ్వూ, అనూ నాకు ప్రాణస్నేహితు రాళ్ళుకదా? నేను అవమానిస్తానుటే. సరిగ్గా విను-వాడెవరోకాదు?"

"ఎవరు?" ఆతృతగా చూసింది ఆశాలత.

"కార్యంగడిలో నీ మొగుడు!" సుధారాణితోపాటు తనూ నవ్వేసింది ఆశాలత.

"చంపేశావ్ పో! నేనింకేదో అనుకున్నాను. సారీనే!" అంది ఆశాలత నొచ్చుకుంటూ.

"ఏం మహాతల్లీ! ఇంత చక్కటి జోక్‌కికూడా నువ్వు పడి పడి నవ్వలేదంటే.. నాజోక్ పేలనట్టే!.." సుధారాణి ఓడి పోయిన ముఖం పెట్టింది.

"అదేంకాదు.. కుమారి అనూరాధాదేవి లవ్‌లో పడినట్టే.!!" ఆశాలత కవ్వింపుగా అంది.

"ఎవ్వరితో నే..? ఎవరే ఆ దివ్యసుందరుడు?" సుధారాణి ఆరాటపడిపోతోంది.

"సుధా! చెపుతున్నాగానీ.. అనూ నన్నుకొట్టకుండా కొమ్ము కాయాలే నువ్వు.." ఆశాలత అర్థించింది.

"ఓ. కె. భామినీ! నీకిదే.. నా అభయహస్తం! ఇక ప్రవ చించుము.. మన నెచ్చెలి హృదయాన్ని దోచుకుపోయిన ఆదివ్య.. సారీ.. దొంగసుందరు డెవరో?"

"ఫలానా అని చెప్పలేనుగానీ.. ఆ నలుగురు బాడీగార్డుల్లో ఒకడు.." ఆశాలత సుధారాణిపక్కకి జేరింది.

అనూరాధ తొణకలేదు, బెణకలేదు.

"నిజమేనుటే .?" విస్తుపోయింది సుధారాణి. అనూరాధ మాట్లాడలేదు.

"నిజంకాకపోతే అలా హాస్యంగా ఎందుకంటుంది"
ఆశాలత రెట్టించింది.

"చెప్పవే అనూ! త్వరగా చెప్పు. ఆశా చెప్పింది నిజం కాదని చెప్పు! ఆశా ఏదో సరదాకి అన్నదని చెప్పు" హడావుడిపడిపోతోంది సుధారాణి.

నిబ్బరంగా గంభీరంగా అంది అనూరాధ.

"ఆశా చెప్పింది పూర్తిగా కరకు కాదు."

గుండెలమీద చెయ్యి వేసుకుంది సుధారాణి.

"అబ్బ! ఎంత చల్లనిమాట చెప్పావ్ అనూ. లేకపోతే నువ్వు ఆ రోడ్ సైడ్ రోమియోగాళ్ళని, ఆ రౌడీ వెధవల్ని ప్రేమిస్తున్నావని ఎలా అనుకుంటాను? థాంక్స్ ఎ లాట్!"

"నీ థాంక్స్ విత్ డ్రా చేసుకో."

"అదేమిటే?" కళ్ళు పెద్దవి చేసింది సుధారాణి.

"నేను ఆ నలుగురు బాడీగార్డుల్ని ప్రేమిస్తున్నాను. ఆశా ఒక్కర్నే ప్రేమిస్తున్నా ననుకుంటోంది గదా! ఆమె అభిప్రాయం తప్పు" ఖండించింది అనూరాధ.

సుధారాణి నివ్వెరపోయింది.

జోక్ చేసిన ఆశాలత నిర్ఘాంతపోయింది.

"నీకేమన్నా మతిపోయిందిటే? బాడీగార్డుల్ని ప్రేమించటమేమిటే?" ఇద్దరూ ఒకేసారి అడిగారు- అందోళనగా.

"బాడీగార్డులూ మనుషులేనే! వాళ్ళకీ మనసుంటుంది. నా ప్రేమని వాళ్ళు తప్పకుండా స్వీకరిస్తారు" అనూరాధ తెగేసి చెప్పింది.

"అయితే నీ నిర్ణయం మారదంటావ్" సుధారాణి హెచ్చరిస్తున్నట్టుగా అంది.

"మారదు—మారదు—మారదు." నిక్కచ్చిగా అంది అనూరాధ.

"ఎవరిఖర్మకు ఎవరు కర్తలు?" ఆశాలత జాలిపడింది.

"మహాతల్లుల్లారా! మీజాలి, సానుభూతి నా కక్కరలేదు."

"కోపం నీకే కాదు మాకూ ఉంది. నువ్వు బాడీగార్డుల్ని ప్రేమిస్తున్నావని, వాళ్ళతో తిరుగుతున్నావని తెలిస్తే, మా తల్లి

దంత్రులు నీతో స్నేహం చెయ్యవియ్యరు" తీక్షణంగా అంది సుధారాణి.

"అందుకని ఏమంటావ్ ?"

అనూరాధ రెచ్చిపోయింది.

"మేము నీతో స్నేహం మానుకోవలసి వస్తుంది."

ఆశాలత కుండబద్దలు కొట్టినట్లు అసలు విషయం చెప్పేసింది.

"సరే ! మీ యిష్టం" అంది అనూరాధ ధృడంగా స్నేహితురాళ్ళిద్దరూ నివ్వెరపోయారు.

"ఆ రౌడీ వెధవలకోసం అమూల్యమయిన మా స్నేహం వదులుకుంటారన్నమాట. నువ్విలాంటి మనిషివనుకోలేదు."

"మీ స్నేహంకన్నా అమూల్యమయినదాన్ని పోగొట్టుకోవటం నా కిష్టంలేదు."

"కాస్త తెలుగులో చెప్పు." ఆశాలత వెటకారంగా అంది.

అనూరాధ మాట్లాడలేదు

"రావే ఆశా ! పేదవాళ్ళతో స్నేహం కలపటం మనదే తప్పు బాగా బుద్ధి చెప్పిందిగా ! ఇక పద ! పోదాం." రిక్షా కేకేసింది సుధారాణి.

చూస్తూఉండగానే సుధారాణి, అనూరాధ రిక్షాఎక్కి వెళ్ళిపోయారు. స్నేహ బంధంవల్లనో ఏమో, వెడుతూ వెడుతూ వెనక్కి తిరిగిచూశారు రిక్షా విండోలోంచి.

స్నేహితురాళ్ళిద్దరూ కనుమరుగవగానే హాండ్‌కర్చీఫ్‌తో కళ్ళనీళ్ళు తుడుచుకుంది అనూరాధ. దానిభావం ఆమెకే తెలుసు!!

కాసేపటిలో కాలేజీ జేరుకుంది అనూరాధ. క్లాసురూంలో సుధారాణి, ఆశాలతలు ఎప్పటిలా తమపక్కన కూర్చోనివ్వలేదు.

## 10

సాయంత్రం కాలేజి విడిచిపెట్టాక సుధారాణి, ఆశాలతలు.. అనూరాధకన్నా ముందే వెళ్ళిపోయారు. అలావెళ్ళటం కేవలం తనమీద కోపంవల్లనే అని గ్రహించకపోలేదు అనూరాధ.

రోజూ ముగ్గురూ కలిసివెళ్ళేవారు ఇవాళ ఒంటరిగావెళ్ళటం

చాలా బాధగా ఉంది అనూరాధకి.

అయినాసరే! తనకోసం తపిస్తున్న బాడీగార్డుల్ని, తనకి ముఖ్యంగా కావలసిన బాడీగార్డుల్ని, వదులుకో దలుచుకోలేదు అనూరాధ.

"ఒరేయ్!" అన్న గోపీ గొంతు వినిపించటంతో గాలిలో తేలిపోయింది అనూరాధ మనసు.

"ఇవాళ హేమమాలిని ఒక్కతే వుందరోయ్!" ప్రసాద్ కేరింత!

"జయసుధ.. జయప్రదలు ఏర్రా?" శేషు ఆరా!

"బోర్నవిటా తాగటానికి ముందు వెళ్ళుంటార్రా!"

శేఖర్ సమాధానం.

"మనం నలుగురం తాయత్తులా సాయపడదాం రా! ఈ చిన్నారికి, అందమైన ఆడపిల్లల్ని ఆదుకోవటమేగదరా మన కర్తవ్యం!" గోపీ మిగతావాళ్ళని అడిగాడు.

"కరక్టురా! ఒరేయ్." ప్రసాద్ వంతపాడాడు.

అప్పటికే చాలామంది స్టూడెంట్లు, లెక్చరర్లు బాగా ముందు కెళ్ళిపోయారు.

"ఏయ్ మిస్టర్స్."

వెనక్కితిరిగి తీక్షణంగా చూసింది- అనూరాధ.

ఒక్కసారిగా కంగుతిన్నారు రోమియోలు. పొందికయిన పిల్ల అనూరాధ తమని అలా పిలుస్తుందని ఊహించలేదు వాళ్ళు.

ఒకళ్ళ మొహాలొకళ్ళు చూసుకున్నారు. దరిదాపుల్లో ఎవరూ లేరు. ధైర్యం పుంజుకుని "ఏమిటి మిస్!" అన్నారు దగ్గరగావచ్చి.

"మీ కసలు కనీస మర్యాదలు తెలియవనుకుంటానే!" ముఖం చిట్లించింది.

తెల్లముఖాలు వేశారు నలుగురూ ఈసారి.

"కాలేజీ అమ్మాయిమాత్రం మనిషికాదా."

"అమ్మమ్మ ఎంతమాట! అందులో మీరు బ్యూటీ క్వీన్" గోపీ పూర్తిగా ధైర్యం తెచ్చుకున్నాడు,

ఒంటరిగా వెడుతోందిగదా స్నేహితురాళ్ళెవరూ లేరు కాస్త సాయం చెయ్యాలనిపించటంలేదూ మీకు!"

నొచ్చుకున్నారు అందరూ.

"ఏం చెయ్యమంటారు చెప్పండి. ఆ పుస్తకాలు ఇలా ఇవ్వండి" ప్రసాద్ పుస్తకాల కోసం వినయంగా వంగి చెయ్యి చాచాడు.

అతనికి పుస్తకాలు ఇచ్చింది. తెగ సంబరపడిపోయారు.

"ఆ టిఫిన్ బాక్స్ ఇలా ఇవ్వండి" పుచ్చుకున్నాడు శేఖర్.

"మరి మీకో"

గోపీ, శేషులు ప్రాధేయపడ్డారు.

ప్రసాద్ చేతిలో పుస్తకాలు తలా కాసివి తీసుకోంది. మహాప్రసాదం అన్నట్టు అలాగే చేశారు.

"మీరు నలుగురూ ఎందుకూ పనికిరారు." విసుక్కుంది అనూరాధ.

విభ్రాంతపోయారు—బాడీగార్డులు.

"హోటలుకెళ్ళి కాఫీ తాగుదాం!" అంటే మీ డిగ్నిటీకి ఏమయినా భంగం కలుగుతుందా?" దాదాపు ఎగిరి గంతేసినంత పని చేశారు నలుగురూ.

"క్షమించండి మిస్!" అంటూ రోడ్డు పక్కగా ఉన్న రిక్షాలు కేకేశారు. అనూరాధ ఒక రిక్షా ఎక్కిన తరువాత, వాళ్ళు నలుగురూ రెండు రిక్షాలు ఎక్కారు.

రిక్షాలు ఝూమ్మంటూ పోతున్నాయ్ రోడ్డుమీద. టైము అయిదుగంటలు కావస్తోంది సూర్యుడు తన ప్రతాపాన్ని త్వర త్వరగా కోల్పోతున్నాడు. రోడ్డుమీద జనసంచారం బాగానేవుంది. పిల్లగాలులు ఉండుండి వీస్తున్నాయి.

పదినిముషాల్లో ఓమంచి హోటలుదగ్గర ఆగాయి రిక్షాలు. అంతా దిగారు. అనూరాధ డబ్బులివ్వబోతుంటే వారించారు బాడీ గార్డులు.

ఫామిలీరూంలోకి వెళ్ళారు.

"నాకు కాఫీచాలు ఇంకేమీవద్దు." అంది అనూరాధ బెట్టుగా.

"మీరలా అంటే ఎలా అనూరాధగారూ! మీపట్ల మాకున్న అభిమానాన్ని, చూపనివ్వండి!" అంటూ మనిషికొక అయిటమ్ తెప్పించారు.

అన్నీ సగం సగం తిని వదిలేసింది అనూరాధ. దానికే

ఎంతో సంతోషించారు వాళ్ళు।

ఏదో కబుర్లు చెపుతోంది అనూరాధ. వాళ్ళు ఆమె అడిగిన దానికి సమాధానాలుమాత్రమే ఇస్తున్నారు.

"మగవాళ్ళముందు ఆడది ఎలా సిగ్గుపడుతుందో.... ఆడది చనువుగావుంటే, మగవాళ్ళుకూడా అంతే। అనుకుంది

"ఏమన్నా మాట్లాడండి అంది వాళ్ళనుద్దేశించి" ఏం మాట్లాడాలో తోచలేదు వాళ్ళకి.

"సరే అయితే నేనే మాట్లాడుతాను లెండి" అంది మళ్ళీ ఫామిలీరూంలో ఆ అయిదుగురు తప్ప ఎవరూలేరు. "ఆడపిల్లల వెంటపడి ఏడిపించే రౌడీలు-బాడీగార్డులేనా ఇప్పుడంత బుద్ధిమంతుల్లా కూర్చున్నారు? ఎంత వింతగా ఉంది?" అనుకుంది అనూరాధ.

"నేను మీ అందరికీ ప్రియమైనదాన్నేనా!" అందరి ముఖాలకేసి పరీక్షగా చూస్తూ అంది. "ఊహించని ఆ ప్రశ్నకు ఆశ్చర్యపోయారు ఆ నలుగురూ."

వెంటనే మాటరాలేదు వాళ్ళకి. నోట్లో నాలుక లేదనుకున్న ఈ అమ్మాయి ఎంత చనువుగా ఎలాంటి ప్రశ్న అడుగుతోంది? అనిపిస్తోంది వాళ్ళకి.

"ఏం మాట్లాడరు? అయితే నేను మీకు ప్రియమైనదాన్ని కాదన్నమాట!" కోపంగా ముఖంపెట్టింది అనూరాధ.

"క్షమించండి. అలాంటిదేమీలేదు" "మీరంటే మా కందరికీ ఎంతో ఇష్టం!" ప్రసాద్ గొంతు పెగుల్చుకుని జవాబిచ్చాడు.

మిగతా ముగ్గురూ వంతపాడారు.

"థాంక్యూ వెరీమచ్!"

"నో మెన్షన్ మిస్."

"అలా అని ఊరుకుంటే కాదు"

"ఏంచెయ్యాలో చెప్పండి!"

"చెప్పానుగా? మీ నలుగుర్నీ, నేను అభిమానిస్తున్నాను, ఆరాధిస్తున్నాను. ఇన్నాళ్ళు మీ సూటీపోటీ మాటలనే విన్నానుగానీ, దానివెనుక నామీద అంతులేని అభిమానం దాగిఉందని తొలిసారిగా ఇప్పుడే తెలుసుకున్నాను. ఇకనుంచీ నా పూర్తి రక్షణ బాధ్యత మీది। దానికోసం మీరు ప్రతిక్షణం సిద్ధంగా ఉండాలి."

"ఓ" అన్నారు ఏకగ్రీవంగా నలుగురూ. ప్రశంసిస్తున్నట్టు చూసింది అనూరాధ.

"పదండి వెళదాం. ఇప్పటికే చాలా పేపయింది."

అనూరాధ తమతో కాఫీ హోటలుకి వచ్చినందుకు నలుగురూ పదేపదే తమ కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

అనూరాధని ఇంటికి సాగనంపటానికి బయలుదేరారు. టిఫిన్ బాక్స్, పుస్తకాలు మోస్తూ. ఇల్లు ఓ యాభై గజాలు ఉందనగా "సీయూ" అని చెప్పి పుస్తకాలు, టిఫిన్‌బాక్స్ తీసుకుంది వాళ్ళ దగ్గరనుండి. గుడ్ బై చెప్పి వెళ్ళిపోయారు బాడీగార్డులు.

# 11

అనూరాధ బాడీ గార్డులతో స్నేహం చేస్తోందన్న విషయం కాలేజీలో అందరికి తెలిసిపోయింది. నాలుగు రోజుల్లో దానికి బాగా పబ్లిసిటి యిచ్చిన వాళ్ళు సుధారాణి, ఆశాలతలు. అలాచేస్తే నన్నా అనూరాధ వాళ్ళస్నేహం మానివేస్తుందని వాళ్ళ ఉద్దేశం.

తోటి విద్యార్థినులు చాలామందిమృదువుగా మందలించారు అనూరాధని.

"నిప్పుతో చెలగాట మాడుతున్నావ్" అని కొందరన్నారు.

"అరిటాకు ముల్లు సామెత అవుతుంది- జాగ్రత్త!" అని హెచ్చరించారు మరి కొంతమంది.

"విన్నా దారుణంగా రెప్ చేస్తారు వాళ్ళు. సురేఖకి పట్టిన గతే నీక్కూడా పడుతుంది" భయపెట్టారు కొంతమంది.

"ఆ వార్త పేపరులో చూసి సంతోషిద్దురుగానిలే! వేయిట్ అండ్ సీ!" అంది అనూరాధ ఎగతాళిగా.

"దానికి ఒకరితో కాదు. నలుగురితో రేప్ చేయించుకోవాలి అని ఉన్నప్పుడు మనకెందుకులే ఊరుకోండి" అన్నారు సుధారాణి, ఆశాలతలు.

"షటప్" అంది అనూరాధ—వాళ్ళ మాటలలోని అసభ్యత ఆమెని హర్ట్ చేసింది.

మూతి మూడు వంకరలు తిప్పారు, సుధారాణి, ఆశాలతలు.

"మా అమ్మకుకూడా చెప్పి షణ్యం కట్టుకోవోయారు ?" వ్యంగ్యంగా అంది అనూరాధ.

"మాకేం పట్టలేదు. ఏదో స్నేహితురాలివిగదావి ఈ మాత్ర మయినా పూనుకున్నాం. వినలేదు. నీ ఖర్మ నీవే అనుభవించు." అన్నారు.

ఆ క్షణంనుంచీ అసలు మాట్లాడటం మానివేశారు సుహా రాణి, ఆశాలతలు.

ఒకరిద్దరు లెక్చరర్లుకూడా అనూరాధని మందలిద్దామను కున్నారు గానీ.... ఒకవేళ తమపేర్లు ఆమె తన బాడీగార్డులకి చెప్పిందో.... వాళ్ళు తమ పనిపడతారవి భయపడి ఊరుకున్నారు.

ఏమైనా బాడీగార్డులతో కావాలని అనూరాధ స్నేహం చేస్తోం దనే విషయం కాలేజీలో గొప్ప సంచలనం కలిగించింది. ఇది కాలేజీ చరిత్రలోనే అపూర్వం! పర్యవసాన మేమవుతుందో....? చూడాలని వేచిఉన్నారు విద్యార్థి వర్గం, ఉపాధ్యాయ వర్గంకూడా.

రోజూ ఉదయం, సాయంత్రం అనూరాధకి చక్కటి ఎస్కార్టు ఇస్తూనే ఉన్నారు బాడీగార్డులు నలుగురూ. వారితో ఎన్నో విషయాలు మాట్లాడుతూనే ఉంది అనూరాధ. నేను మిమ్మల్ని అరాధిస్తున్నాను గనుక, మీరు మిగతా కాలేజీ అమ్మాయిల్ని కన్నెత్తి చూడకూడదు. వారిని ఏడిపించకూడదు. అని ఆంక్ష విధిం చింది. అనూరాధ అందాల్ని మనస్సులో తల్చుకుని వెంటనే ఒప్పు కున్నారు వాళ్ళు- అంతేకాదు. అక్షరాలా పాటించారు.

హోటలుకు రమ్మనమని రోజూ ఆహ్వానిస్తున్నారు నలు గురూ.

"వారానికోసారి మాత్రమే" అంది అనూరాధ.

నలుగురూ గుర్తు చేశారు. ఇవాళ హోటల్ డే అని.

"సరే పదండి" అంది—అనూరాధ.

సంతోషంగా అనుసరించారు.

ఫామిలీ రూంలో టిఫిన్ చేస్తున్నప్పుడు సినిమా ప్రపోజ్ చేశాడొకడు. మరొకరు పిక్నిక్ అన్నాడు. మరొకడు షాపింగ్ అన్నాడు. ఇంకొకడు సీషోర్ ! అన్నాడు.

"ఇలాంటివన్నీ చేస్తే అనూరాధ తమకు లొంగుతుందని,

మె అందాన్ని తియ్యగా జుర్రుకోవచ్చని వారి అభిప్రాయం.

"నో" అంది గట్టిగా.

ఆశ్చర్యపోయారు నలుగురూ. టిఫిన్, కాఫీ పూర్తిచేసిన మరో ఫామిలీ అప్పుడే వెళ్ళిపోయింది.

"ప్రస్తుతం నేను ఆపదలో ఉన్నాను—నన్నాదుకోవటం మీ కర్తవ్యం."

గంభీరంగా ముఖం పెట్టింది.

"చెప్పండి. మీరేం చెయ్యమంటే అది చేస్తాం. మిగతా స్టూడెంట్లెవరన్నా....మీరు మాతో చనువుగా ఉంటున్నారని అల్లరి చేస్తున్నారా? చెప్పండి వాళ్ళ ఎముకల్లో సున్నం లేకుండా చేస్తాం!"

"అదేంకాదు."

"మరేమిటి?"

నేనుండే ఇంటికాపౌండులో నలుగురుప్రముఖులు ఉన్నారు. ఈశ్వరయ్య అని ఒకాయన మహాభక్తుడు. సుందరయ్య అని మరొకాయన ప్రముఖ వ్యాపారస్తుడు. రామలింగం అని గవర్నమెంటు ఉద్యోగి. కామేశం అని ప్రైవేట్ కంపెనీలో పనిచేస్తాడు."

"ఇదేమిటి మంచివాళ్ళగురించి మాకుచెపుతున్నారు మీరు? సందేహం వెలిబుచ్చాడు గోపీ. పైకి మంచిగానే వుంటారు వీళ్ళ నలుగురూ. కానీ వీరి మనసునిండా కుళ్ళు! కల్మషం! ప్రవహిస్తూ ఉంటుంది. తండ్రితోడులేకుండా నేను తల్లితో ఉంటం వీరికి చాలాబాధగా ఉందట. నాకష్టసుఖాల్ని చూస్తారుట వీరు - ఒక షరతుమీద నాశీలం వారికి టీఫినులాగ సమర్పిస్తే. నేను ఛీ! కొట్టాను. అంతే! వాళ్ళు నామీద పగబట్టారు. వాళ్ళు నలుగురు కలిసి.... నన్ను పాడుచెయ్యటానికి, తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. నాకిక దిక్కులేదు. మీకు దక్కాను" నిర్లిప్తంగా అంది అనూరాధ.

పిడికిళ్ళు బిగించారు నలుగురు

"మిస్ అనూరాధా! కొండంత అండగ మేమున్నాం నీకు. వాళ్ళ నలుగుర్ని చితకబాదేస్తాం. బుద్ధిచెపుతాం."

"నిజంగా"

"మీమీద ఒట్టు"

[illegible]
చితకబాదితే పోలీసులతో గొడవ. ఉల్లరీను." భయపడింది. ...
విషయం మాకొదిలేయండి మేం చూసుకుంటాంగా అన్నాడు.
ఎలా చేస్తారో! ఏమో! అనుకుంది అనూరాధ.

# 12

సాయంత్రం ఆరున్నర గంటలయింది. ఈశ్వరయ్య లోపల ఎక్కడో పూజా కార్యక్రమంలో ఉన్నాడు.

అది మామూలు పూజకాదు.

"దేవీపూజ!! కామాక్షిదేవీపూజ" "ఏం కామాక్షి! ఇన్నాళ్ళయిపోయింది. ఆ పిల్లని నాకు లోబరచకపోయావ్."

బలంగా పొదివి పట్టుకుని.... కామాక్షి బుగ్గలనిండా ముద్దులు పెట్టాడు. చక్కిలిగింతలు పెట్టాడు.

"ఆగండి! అలా కితకితలు పెడితే నేనెలా మాట్లాడేది!".

ఊరుకున్నాడు ఈశ్వరయ్య

"దానికి అనుభవించే గీత లేదులాఉంది ఈశ్వరయ్యా. లేకపోతే ఎన్నివిధాల నూరిపోసినా చలనం కలగటంలేదు దానిలో!"

"నన్ను రంగంలోకి దూకమంటావా! దాన్ని సాధించి పూలరంగడిలా మీ ఇద్దర్నీ చెరొవేపున వేసుకుని...."

ఆయన మాటల్ని పూర్తిచెయ్యనివ్వలేదు కామాక్షి.

తనపేరుని సార్థకం చేసుకుంటూ ఆయన్ని పెనవేసుకుపోయింది— ఆయనకున్న భక్తి సంగతి ఏమోగానీ, రక్తిసంగతి బాగా తెలుసు ఆమెకి.

టక్! టక్! మని తలుపు చప్పుడయింది.

ఉలిక్కిపడి విడిపోయా రిద్దరూ.

ఆ సమయంలో ఈశ్వరయ్య భార్య గుళ్ళో పురాణశ్రవణాని కెళ్ళింది.

"చూడు! ఎవరొచ్చారో!" అన్నాడు.

కామాక్షి చీర సరిచేసుకుని వెళ్ళి తలుపు తీసింది.

తీస్తూనే ఆశ్చర్యపోయింది.

"ఈశ్వరయ్యగారున్నారా;" అని అడిగాడు వచ్చినవాళ్ళలో ఒకడు.

"ఉండండి పిలుస్తాను." లోపలికి పరుగెత్తింది కామాక్షి.

"ఎవరు?" అన్నాడు ఈశ్వరయ్య. ఈలోపుగా ఆయన హరే రామ పంచె కండవా సరిజేసుకుని సిద్ధంగా ఉన్నాడు.

"ఎవరో నలుగురు వచ్చారు. కాలేజీ కుర్రాళ్ళలా ఉన్నారు. కామాక్షి భయం భయంగా చెప్పింది.

"కాలేజీ కుర్రాళ్ళా! వాళ్ళకి తనేం అపకారం చెయ్యలేదే! ఎందుకొచ్చి ఉంటారు?" వణికిపోయాడు.

తడబడుతూ వచ్చాడు.

అప్పటికే వాళ్ళు ముందుగదిలో ఉన్న కుర్చీల్లో అసీనులై ఉన్నారు.

"నమస్కారం" అన్నాడు అలవాటు ప్రకారం.

కోపంగానే ఉన్నాయి వాళ్ళ ముఖాలు.

"ఆ కుర్చీలో కూర్చోండి!" గంభీరంగా అన్నాడు ప్రసాద్.

"పెద్దలు మీరు నమస్కారం అనకూడదు. మేమనాలి అది! మీతో పనిపడి వచ్చాం.' కట్టె విరిచినట్లు మాట్లాడాడు గోపీ.

"మీరో పని చెయ్యాలి... లేకపోతే... శేషు అదిలించాడు!

"మీ పని మేం చెయ్యాల్సి వస్తుంది"

బెదిరించాడు శేఖర్.

వణికిపోతున్నాడు ఈశ్వరయ్య.

"అ...లా...,గే..! మీ యిష్ట ప్రకారమే చేస్తాను" అన్నాడు.

"థాంక్స్! అయితే వినండి, మీ యింట్లో కాపురముండే ఒకావిడ? అవిడ కూతురు అనూరాధ. మా కాలేజీలోనే చదువుతోంది. తెలుసా!"

"తెలుసు" ఇంకా వణుకు తగ్గలేదు ఈశ్వరయ్యకి

"ఆ అమ్మాయిని మేం ప్రేమిస్తున్నాం.

గోపీ అసలు సంగతి చెప్పాడు.

"మీరందరూనా?" అప్రయత్నంగానే అడిగాడు ఈశ్వరయ్య. అతని గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది. ప్చ్! తను పట్టాలనుకున్న పిట్ట అనూరాధ!

"అవును"

మీ కాంపౌండులో ఎవరో ఒక దుర్మార్గుడు ఆమెను మాన

భంగం చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడుట!

శేషు ముఖం కోపంతో ముడతలు పడింది.

"ఎవడు వాడు?" అనుమానంగా ప్రశ్నించాడు ఈశ్వరయ్య.

"ఎవరో తెలిస్తే...ఈ పాటికి కత్తికొూక కండకింద చీల్చే వాళ్ళమే కదా— ఎంత అడిగినా వాడి పేరు మాత్రం చెప్పటం లేదు అనూరాధ.

శేఖర్ ఆవేశంతో ఊగిపోయాడు.

గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు ఈశ్వరయ్య. తనకి గండం తప్పినందుకు సంతోషించాడు.

"మీరు మహాభక్తులు. సర్వం తెలిసినవారు. మీరలాంటి వ్యక్తిని సహిస్తారా?"

"సహించను"

"వాడినేం చెయ్యాలంటారు?"

"ఉప్పుపాతర వెయ్యాలి!"

"వెరీగుడ్! వాడెవడో కనుక్కొని దయచేసి మీరా పని చెయ్యాలి— తప్పదు. పెద్దలుగా మీరీ బాధ్యత స్వీకరించి తీరాలి. వాడి పేరుకూడా మాకు చెప్పక్కరలేదు. వాడికి మీరే బుద్ధిచెప్పండి. మే మెలాగూ అనూరాధని వెయ్యికళ్ళతో కాపాడుతూనే ఉంటాం. వాడు ఎదురు తిరిగినా, పిచ్చి వేషాలేసినా మాకు చెప్పండి. వాడి ఎముకలు లెక్కపెడతాం."

"అలాగే మీరు నామీద ఎంత గౌరవంతో పెట్టిన బాధ్యతని సక్రమంగా నిర్వహిస్తాను"

కక్కలేక మింగలేక అన్నట్టుగా ఉంది ఈశ్వరయ్య పరిస్థితి.

"చివరగా ఒకమాట— ఈ విషయం "అదే" మేం పచ్చి నెత్తురు తాగే రౌడీలమని, అనూరాధకు అండగా ఉన్నామని ఎవరికీ తెలియకూడదు. ఎవరన్నా అడిగితే కాలేజీ విద్యార్థులెవరో చందాలకి వచ్చారని చెప్పండి, తెలిసిందా?

గంగిరెద్దులా తలూపాడు ఈశ్వరయ్య.

"మీరు నిజంగా మహాభక్తులు. వస్తాం: మేం చెప్పింది గుర్తుందిగా?" ఠీవిగా బయటకు నడిచారు నలుగురూ. ఈశ్వరయ్య కాఫీ తీసుకు వెళ్ళండన్నా వినకుండా వెడుతూ, వాళ్ళు అక్కడ

విల్చున్న అనూరాధకేసయినా చూడలేదు. గేటువరకు సాగనంపి తిరిగి వస్తున్నప్పుడు సుందరయ్య.. రామలింగం., కామేశం చుట్టు ముట్టారు ఎవరువాళ్ళు అని. కాలేజీ కుర్రాళ్ళు విరాళాలకవి వచ్చా రని చెప్పి తనింట్లోకి వెళ్ళిపోయాడు ఈశ్వరయ్య.

తమని విరాళాలు అడగలేదని చంకలు కొట్టుకున్నారు మిగతా ముగ్గురూ.

లోపలికి రాగానే తలుపు గడియవేసి అడిగింది కామాక్షి. "అమ్మో! ఈ పిల్ల ఇంత నంగనాచి అనుకోలేదు. వాళ్ళ నలు గురితో కులుకుతుందన్న మాట! అందుకే నేను ఎంత చెప్పినా మీకు లోబడటం లేదు. పైగా వాళ్ళని మీ మీదికి పంపింది. ఎంత ధైర్యమో చూడండి! మీరు వాళ్ళని తక్షణం ఇల్లు కాళీ చెయ్య మనండి నేను లేను మీకు!" అంటూ ఆయన భుజంమీద చెయ్యి వేసింది—అనునయంగా.

విదిలించి కొట్టాడు ఈశ్వరయ్య.

"వాళ్ళని ఇల్లు కాళీ చేయమన్నా. ఆ పిల్ల జోలికి వెళ్ళినా కుక్కని బాదినట్లు బాదుతారు ఆ కుర్రాళ్ళు దుస్సలహాలివ్వకు పో!" అని కసురుకున్నాడు ఈశ్వరయ్య.

# 13

అప్పుడే వీధిలైట్లు వెలిగాయి. బజారంతా సందడిగా ఉంది. షాపులు బిజీగా ఉన్నాయి.

"సుందరయ్యగారంటే మీరేనా?" అంటున్న ఆ వ్యక్తుల్ని చూసి గాబరా పడిపోయాడు సుందరయ్య.

వీళ్ళు మొన్న ఈశ్వరయ్య దగ్గరకి విరాళానికి వచ్చిన కాలేజీ స్టూడెంట్లని పోల్చుకున్నాడు. తనని వదలి పెట్టినందుకు సంతోషించాడు ఆరోజున. కానీ ఇప్పుడు తప్పేట్టులేదు- ఏమన్నా అంటే పీకి పాకాన పెడతారు. అసలే కాలేజీ కుర్రాళ్లు!!

కాష్ కౌంటరు మరొకళ్ళకి అప్పగించి రండి అంటూ తన ప్రైవేట్ రూంలోకి తీసుకెళ్ళాడు నలుగుర్ని. బెల్లు నొక్కి బోయ్‌తో నాలుగు గోల్డుస్పాట్ తెప్పించాడు.

అంతవరకూ మౌనంగానే ఉన్నారు నలుగురూ.

"చెప్పండి! మీరు వచ్చిన పనేమిటో?" అన్నాడు వినయంగా.

"ఇంత మంచివారులా కనిపిస్తున్నారు. మీ గురించి అంత చెడుగా చెప్పాడేమిటి ఈశ్వరయ్య?" ప్రసాద్ మొదలుపెట్టాడు.

విరాళంకోసం కాదన్నమాట పీకొచ్చింది. సంతోషం పుంజుకున్నాడు సుందరయ్య. కాని ఇంకేదో కొత్తమాట అంటున్నారేమిటి వీళ్ళు?

"నా గురించి ఈశ్వరయ్య చెడుగా చెప్పాడా?" అన్నాడు.

"కాస్త, కూస్త చెడుకాదు. ఛండాలంగా చెప్పాడు."

ఆశ్చర్యంగావుంది సుందరయ్యకి

"ఈశ్వరయ్య ఇంట్లో అనూరాధ లేదూ!"

"అఁ! ఉంది" అన్నాడు సుందరయ్య యథాలాపంగా "ఆమె మా ఊర్వశి మా అందరి ప్రేయసి శేషు కుండబద్దలుకొట్టినట్టు చెప్పాడు.

నోరు వెళ్ళబెట్టేశాడు సుందరయ్య.

"ఆమె నెవరేమన్నా అంటేమాత్రం సహించం. వాడినెత్తురు తాగుతాం." శేఖర్ ఉద్రేకంగా అన్నాడు

"అసలు మీనెత్తురు తాగాలనే వచ్చాం." ముచ్చెమటలు పోశాయి. సుందరయ్యకి.

"కానీ, మీమంచితనంచూసి మా మనసు మార్చుకున్నాం" అన్నాడు ప్రసాద్.

'బతుకుజీవుడా!' అనుకున్నాడు సుందరయ్య. "మీరు ఆ అమ్మాయి శీలాన్ని కొల్లగొట్టటానికి ప్రయత్నిస్తున్నారని ఈశ్వరయ్య చెప్పాడు.

"ఏడిశాడు వెధవ! కూతురువరసతో పిలుస్తూ కామాక్షితో కామకలాపాలు సాగించటంకాదు. ఎవరికి తెలియదు వాడిబతుకు? వాడిభక్తి అంతా వటవ! అనూరాధ నాకు చెల్లెలు వంటిది. మీరు నా బావమరుదులు." లౌక్యం ఉపయోగిస్తూ, ఈశ్వరయ్యమీద తన కున్న అక్కసంతా వెళ్ళగక్కుతున్నాడు సుందరయ్య.

"వరే! సుందరయ్యగారూ! మీమాట మనస్ఫూర్తిగా నమ్ముతున్నాం. అయితే మీరు మాకో సాయం చెయ్యాలి.

"చెప్పండి సార్! మీకు నా ప్రాణమైనా ఇస్తాను."

"మీ ప్రాణం మాకొద్దుగానీ ఒక మాట ఇవ్వండి చాలు"

"ఏమిటది?"

మీ చెల్లెలుమీద మీ కాంపౌండులో ఎవరో ఒకరు చెయ్యి వెయ్యాలని ప్రయత్నిస్తున్నట్టు! — మీరా స్కౌండ్రల్ ఎవరో ఆరా తీసి చెప్పాలి—వాడి పని మేం చూసుకుంటాం"

"అట్టాగే సార్"

"థాంక్స్‌ండీ! వస్తాం మరి ఓ చిన్నమాట"

"చెప్పండి"

"మేమిలా మీ దగ్గరికి వచ్చినట్టు ఎవరికీ తెలియకూడదు. మేం మీతో చెయ్యి కలిపామని తెలిస్తే... మీతో అందరూ మంచిగా నటిస్తారు—అసలు విషయం కనుక్కోలేరు మీరు."

"అలాగే బాబులూ!"

"వస్తాం మరి"

వీధివరకూ వచ్చి వంగి వంగి నమస్కారాలు పెట్టాడు సుందరయ్య. వాళ్ళు వెళ్ళిపోగానే గుండెలమీద బరువు దిగిపోయి నట్టు ఫీలయ్యాడు.

గుమాస్తాలు ఎవరు వాళ్ళని? అడిగితే "నోరు మూసు కోండి" అని కసురుకున్నాడు.

ఇక అనూరాధమీద ఆశ వదులుకోటం మంచిది. ఆమెతో మాట్లాడటం కూడా డేంజరే! విస్పష్టంగా అవగతమైంది సుందరయ్యకి.

# 14

మధ్యాహ్నం మూడుగంటల సమయం. ఆఫీసు పక్షులు.... తప్పనిసరిగా ఫైళ్ళు చూస్తున్నాయి.

"నమస్కారం రామలింగంగారూ!"

తలవంచి ఫైల్లో మునిగిపోయిన రామలింగం తన సీటు కెదురుగా స్తంభాల్లా నిల్చున్న నలుగురు యువకుల్ని చూసి నివ్వెర పోయాడు

"మీరా?" అన్నాడు గాబరాగా.

"ఏం? మేం మీకిదివరకే తెలుసా!" అన్నాడు శేఖర్.

"అప్పె తె....లి....యు....దు....రండి-కూర్చోండి."వాళ్ళ తనక తెలుసు అన్న విషయము కప్పిపుచ్చాడు రామలింగం.

"ఇక్కడకాదు అలా బయటికి రండి. కాంటీనులో కూచుందాం మీతో మాట్లాడాలి." కసురుకున్నట్టుగా అన్నాడు ప్రసాద్.

ఎవరో కొట్టివేసినట్టుగా లేచాడు రామలింగం.

కాంటీను దాదాపు ఖాళీగా ఉంది.

కాఫీలు తెప్పించాడు గోపి.

రామలింగం బిక్కుబిక్కు మంటున్నాడు.

వాళ్ళెందుకు వచ్చినట్టు? విరాళాలకోసం వచ్చినట్టుగా కనిపించటంలేదే.... వీళ్ళ వాలకం!

"మీరు నన్ను పిలుచుకువచ్చిన పనేమిటో శలవిస్తారా?" సాధ్యమైనంత నెమ్మదిగా అడిగాడు.

"శెలవు గిలవు కాదు— సూటిగా జవాబు చెప్పండి!" గోపీ కటువుగా అన్నాడు.

"అలాగే "

ఈశ్వరయ్య ఇంట్లో ఓ పోర్షన్‌లో ఉంటోంది అనూరాధ. మీకు తెలుసుగా?"

శేషు గట్టిగా అన్నాడు.

"తెలియదు" అన్నాడు రామలింగం. ఏమనాలో తెలియక.

"తెలియదూ!" రెట్టించాడు శేఖర్.

తె....లు....సు తడబడ్డాడు రామలింగం.

"ఆ అమ్మాయి మా అందరి ప్రియురాలు!"

తన గొంతెవరో నొక్కినట్టు బాధపడిపోయాడు రామలింగం. వీలున్నప్పుడు తను ఓ పట్టు పడదామనుకుంటున్నాడే.... దాన్ని? ఇక ఆ ఆశ అడియాసేనా?!

"ఆ అమ్మాయిని మీ కాంపౌండులో ఒక రోగ్ ఏడిపిస్తున్నాట్ట." ప్రసాద్ పిడికిళ్ళు బిగించాడు.

"బాబ్బాబు, నేనుకాదు. నాకేం పాపం తెలియను."

"ఆ సంగతి మీరు చెప్పక్కర్లా? మాకు తెలుసు!"

"అమ్మయ్య" అనుకున్నాడు రామలింగం. గుండెదడ కాస్త తగ్గింది.

"కానీ ఆ ఫూల్ ఎవరో మాకు తెలియదు. మేము ప్రేమిం చిన అమ్మాయిని ప్రేమించటానికి ఎన్నిగుండెలు వాడికి?"

"నాకు తెలియదు బాబూ!"

అమాయకత్వం నటించకండి. రామలింగంగారూ! వాడెవరో మీకు ఖచ్చితంగా తెలుసు.

ప్రసాద్ కళ్ళల్లోని ఎర్రజీర చూసి హడలిపోయాడు- రామలింగం.

ఏదోపేరు చెప్పాలిగనక. అప్రయత్నంగా "కామేశం" పేరు చెప్పేశారు.

"థాంక్యూసార్" గోపి సంతోషంగా అన్నాడు.

విచ్చేరపోయాడు రామలింగం. "పేరు చెప్పించటంకోసం మీతోకాస్త గట్టిగా వ్యవహరించాం! మమ్మల్ని మన్నించండి. - "మీవల్ల మాకోసాయంకావాలి." శేషు నెమ్మదిగా అన్నాడు,

"చెప్పండిబాబూ! చేస్తాను." రామలింగంగారికిప్పుడు రిలీఫ్‌గా వుంది.

"మీమీద మాకా నమ్మకంవుంది - కామేశాన్ని రేపు కలిసి, బుద్ధిగా మసలుకోమని చెప్పండి. లేదా వాడి బాడీ షేపులు మారిపోతుందని చెప్పండి. తప్పక చెబుతారుగా?"

"ఓ! అలాగే!"

"మీవల్ల బతికిపోయాడు కామేశం-లేకపోతేనా!" అన్నాడు శేఖర్ ఆవేశంగా వాళ్ళు ఎంతవద్దంటున్నా బిల్లు తనేచెల్లించాడు రామలింగం. నలుగురూ వెళ్ళిపోగానే తేలికగా నిట్టూర్చాడు.

# 15

సాయంత్రం అయిదున్నరయింది.

కంపెనీనుండి బయటపడ్డాడు కామేశం స్కూటరెక్కి-జోరుగా పోనిస్తున్నాడు. రోడ్డు సందడిగా ఉంది. ఒకటే జన ప్రవాహం! కొంపలు మునిగినట్టెగా హడావుడిగా నడిచి పోతున్నారు. సైకిళ్ళు రిక్షాలు, స్కూటర్లు.చిన్నకార్లు తెగతిరుగుతున్నయ్.

దార్లో హోటలు దగ్గర స్కూటరాపి కాఫీ తీసుకుని మళ్ళీ బయలుదేరాడు కామేశం. శ్రీమతి లేకపోవటంతో బోరుగా ఉందతనికి.

పార్కు పక్కగా పోతోంది స్కూటరు. ఓ అందాల భామిని ఒంటరిగా సిమెంటు బెంచీమీద కూర్చుని ఉంటం కళ్ళ పడింది కామేశానికి. అంతటి సదవకాశాన్ని జారవిడుచుకో దలచ లేదు. స్కూటరు పార్కులోకి పోనిచ్చి పక్కగా పార్కుచేశాడు. ఆమె కెదురుగా సిమెంటు సోఫామీద కూర్చుని ఆమె అందాల్ని తాగేయటం మొదలు పెట్టాడు.

"లెట్సుగో! మై హనీ! ఏర్పాట్లన్నీ చేసేశాను" అంటూ వచ్చాడో సూటువాలా!

ఆమె నవ్వుతూ లేచింది.

ఇద్దరూ తుళ్ళుతూ వెళ్ళిపోయారు.

"డామిట్! వాడిప్పుడే రావాలా? ఇంకో అరగంటాగి తగ లడకూడదూ!" కసిగా తిట్టుకున్నాడు కామేశం.

లీలగా అతని కళ్ళల్లో అనూరాధ మెదిలింది.

అప్సరసలా ఉంటుంది అనూరాధ! నరాలు జివ్వు మని పించేలా ఉంటుంది.

కానీ ఏం లాభం! తనలాంటి 'స్మార్టు' అండ్ 'హాండ్సమ్' ఫెలోనే కాదనేసింది.

విలువునా అవమానించింది. అందుకనే తను ఈశ్వరయ్య, సుందరయ్య, రామలింగాలతో చేతులు కలిపింది.

నలుగురూ కలిసి దాన్ని బలవంతంగా చెరచాలనే నిర్ణ యానికి వచ్చారు.

ఆమె తండ్రి జాడకూడా లేదీమధ్య.

పూర్ మదర్! శారదమ్మ ఏం అడ్డుకోగలదు? అప్పుడు అనూరాధకూడా ఏం చెయ్యలేదు.

ఆ సుఖంలోని మజాకి మురిసిపోయి, పెంపుడు కుక్కలా తమవెంట తిరుగుతుంది.

డబ్బు, చీరలు, నగలు, ముట్టజెప్పి, దాని అందన్ని కొబ్బరి ముక్కలా కొరుక్కుతినొచ్చు!

అదిసరే! ఈమధ్య ఈశ్వరయ్య, సుందరయ్య రామలింగాలు మౌనంగా ఉంటున్నారు.

వాళ్ళ మౌనానికి కారణమేమిటో!" తనతో మనసువిప్పి

మాట్లాడటం లేదు.

ఒకవేళ.... వాళ్ళేమన్నా విజయం సాధించారా? ఈ పిట్టను పట్టేశారా? కామేశంగాడి కెందుకు వాటా పెట్టాలని ఊరుకున్నారా? సౌట్కుంద్రడల్స్! తోలువలచి వేలాడేస్తాడు ఈ కామేశం అంటే ఏమనుకుంటున్నారో ఏమో?

"గుడీవినింగ్ సార్"

నలుగురూ ఒకేసారి విష్ చేశారు. ఆలోచనల్లోంచి తేరుకుని ఉలిక్కిపడి తలెత్తి చూశాడు కామేశం.

ఆ రోజున...ఈశ్వరయ్య దగ్గరికి వచ్చిన కాలేజీ స్టూడెంట్లు కదూ?

తనతో ఏం పని?

గుండె దడదడలాడింది కామేశానికి.

"తనూ విష్ చేస్తూ" కూర్చోండి. నేనిక్కడుంటానని మీకెలా తెలుసు" అన్నాడు.

"మొదటి ప్రశ్నకి మా సమాధానం!— మేం కూడా ఈ బెంచీమీద కూర్చుంటే మీరు లేచిపోవాల్సి వస్తుంది! రెండవ ప్రశ్నకి మా జవాబు-ఈ మధ్య మీరు తరచుగా వస్తున్నారుఇక్కడికి—అందుకని మిమ్మల్ని పట్టుకోగలిగాం!"

బాగుండదని తనూ లేచి నిల్చున్నాడు కామేశం...మనసులోని కంగారును అణిచిపెట్టి.

"సరే! ఇలా కూర్చుందాం అందరం శేషు సూచించాడు, అయిదుగురూ పచ్చగడ్డిమీద చతికిలపడ్డారు.

"ఏమిటో నాతో పని? చెప్పండి" కంగారుగా అన్నాడు.

"మామూలు పని కాదుసార్! చాలా పెద్ద పని. మీరు తప్పించుకో లేరిసారి"

"నేనేం చేశాను?" తెలియని భయం ఆవహించింది.

"మీరేమీ చెయ్యలేదా?" ప్రసాద్ తీక్షణంగా అడిగాడు.

"అనూరాధ సంగతి మీకేమీ తెలియదా?"

"కనీసం ఆమెని మేం నలుగురూ ప్రేమిస్తున్నామని.... ఆమెకోసం మా ప్రాణాలిదుస్తామని, అవసరమైతే ఇతరుల ప్రాణాలు తీస్తామనికూడా తెలియదా?"

గ్గా తిమింగా అన్నాడు.

కుంగిపోయాడు కామేశం. అనూరాధనివీళ్ళు ప్రేమిస్తున్నారా?

"నిజం! మీరంటున్న విషయం నా కింతవరకూ తెలియదు."

ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు.

"ఆల్ రైట్! ఒప్పుకున్నాం. సుందరయ్య, ఈశ్వరయ్య, రామలింగాలన్నా తెలియదా?

శేఖర్ అడిగాడు-అతని కళ్ళల్లోకి నిశితంగా చూస్తూ.

"తెలుసు."

"ఈశ్వరయ్య ఎలాంటివాడు."

"భక్తుడు."

"సుందరయ్య?"

"వ్యాపారస్తుడు"

"రామలింగం"

"గవర్నమెంటు ఉద్యోగి"

"మీరు ప్రైవేట్ కంపెనీలో పనిచేస్తున్నారు. అంతేగా మీరు చెప్పేది. ఇదికాదు మాకు కావలసింది"

అసహాయంగా చూశాడు కామేశం. మీరు ఎడ్యుకేటెడ్ అండ్ ఎంప్లాయిడ్ యంగ్ జంటిల్‌మాన్. మీలోఎంతోసంస్కారం వుంది కనుక మీరలాంటిపనులు చేస్తారని మేం కనీసం ఊహించం కూడా .. అయితే అసలు విషయం తెలిసికూడా మీరుచూస్తూ ఊరుకున్నారు. అదే మీరుచేసిన నేరం."

"ఏమిటి? నాకేమి అర్థంకావటం లేదు.

"అర్థమయ్యేట్టు చెపుతాంవినండి."

"ఆముగ్గురు గుంటనక్కల్లో ఒకడున్నాడు. ఎవడో వాడి పేరు చెప్పటంలేదు - అనూరాధ. మా అనూరాధ శీలాన్ని తన కామానికి ఫలహారంగా అరగిస్తానన్నాడుట. వాడు మీకుతెలుసు."

"వాడెవడో నాకు తెలియదుసార్!" తను కాదని వాళ్ళు తెలుసుకున్నందుకు లోలోపల సంతోషించాడు కామేశం.

"ఎందుకుసార్ దాస్తారు? వాడిపేరు మాకు చెప్పండి. రేపీ పాటికి వాడితల తెగేసి వాడి ఇంటిగుమ్మానికి వేలాడకడతాం."

తన గుమ్మంముందు తన తల వేలాడుతున్నట్టుగా ఊహించు

కున్నాడు కామేశం. తల దిల్లిపోయాడు.

"సరే! మీరేదో భయపడుతున్నారు. వాడికి మీరో గట్టి వార్నింగ్ ఇవ్వండి. ఈసారి కనీసం మా డార్లింగ్-అనూరాధకేసి చూసినాసరే వాడి తల మొండెంనుంచి గమ్మత్తుగా వేరవుతుందని చెప్పండి."

"మిమ్మల్ని కనిపెడుతూనే ఉంటాం. వాడిని మందలించారో లేదో అరాతీస్తూనే ఉంటాం జాగ్రత్త."

దూకుడుగా వెళ్ళిపోయారు వాళ్ళు.

నిశ్చేష్టుడై అలే చూస్తూ ఉండిపోయాడు కామేశం.

# 16

ఓ సాయంత్రం

ఈశ్వరయ్యగారు, సుందరయ్య, రామలింగం కామేశాన్ని పిలిపించి తన యింటి మేడమీద ఓ అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు.

నలుగురూ కూర్చుని..., కాఫీ ఫలహారాలు ముగించిన తరువాత ఈశ్వరయ్యగారు మొదలుపెట్టారు గంభీరంగా.

"మిత్రులారా! మానవ జన్మ చాలా పవిత్రమైనది. అది మళ్ళీ మళ్ళీ లభ్యం కాదు. అది మనకు లభించినప్పుడే దాన్ని మనం సార్ధకం చేసుకోవాలి.

ఈశ్వరయ్యగారి మాటలకి అడ్డు తగిలాడు రామలింగం.

"అయ్యా ఈశ్వరయ్యగారూ! ఇదేమీ వేదాంతగోష్టికాదు."

"నాకు తెలుసు రామలింగంగారూ. ఇది ఎవరి గురించీ కాదు, మనల్ని గురించే. అనూరాధ అందాన్ని కొరుక్కు తిందా మనుకున్నాంగదా మన మందరం! అవునా!"

"అవును" సుందరయ్య బదులు పలికాడు. నేను పూజ చేసేప్పుడు ఆ విషయం గుర్తుకు తెచ్చుకున్నాను. అంతే! జగన్మాత చెళ్ళున చరిచింది వీపుమీద. "ఒరేయ్ ఈశ్వరయ్యా! నీకెలా బుద్ధిలేదురా? పెటపెటలాడే కామాక్షిలాంటిదాన్నే కూతురిగా చూసుకుంటున్నావుగదా! అనూరాధమీద నీకు ఆ పాడుబుద్ధి ఎలా పుట్టింది అని! "క్షమించుమాతా!" అన్నాను. "క్షమిస్తాను. కానీ నీవీరోజు

నుంచీ అనూరాధని కన్నకూతురికన్నా ఎక్కువగా చూసుకోవాలి. లేదా నీ తల వెయ్యి వక్కలవుతుంది. రక్తంకక్కుకుని అక్కడే చస్తావు" అంది. ఆమె ఆజ్ఞ శిరసావహించాను. ఇవ్వాళనుంచీ అనూరాధ నా కూతురులాంటిది. ఇదివరకు మీతో - కానిమాటలు మాట్లాడినందుకు సిగ్గుపడుతున్నాను. ఇక మీ విషయమంటారా? మీయిష్టం."

సుందరయ్య వెంటనే అందుకున్నాడు.

"పెద్దవారు- పూజ్యులు- మీకే మనసు మారిపోయినప్పుడు ఇక అల్పులం మా సంగతి ఏముంది? నేనూ సిగ్గుపడుతున్నాను, లోగడ మనం అనుకున్నదానికి ఇవాల్టినుంచీ అనూరాధ నా చెల్లెలు లాంటిది." తల వంచుకున్నాడు.

ఈశ్వరయ్య ఎంత సంగనాచిలా మాట్లాడుతున్నాడు? వాళ్ళ నలుగురూ వచ్చి విన్నా చంపుతాం అవి బెదిరించేసరికి ప్లేటు ఫిరాయిస్తున్నాడు అనుకున్నాడు- సుందరయ్య.

"శతకోటి లింగాలలో ఓ బోడిలింగం అని" మీరంతా సై అంటే సై అన్నానుగానీ, నాబోటి విరాగిలాంటివాడికి, అనూరాధ లాంటి బంగినపల్లి మామిడిపండు ఎందుకు చెప్పండి? చీకటి పడగానే నా బాటిలు సుందరి నాకుందిగా! సయ్యాట లాడటానికి! అనూరాధ నా మూడో కూతురు లాంటిది "

నేనుమాత్రం మీకు దొరుకుతానా మాటల్లో..? అనుకున్నాడు రామలింగం.

"నువ్వేమంటావోయ్ కామేశం!" ఈశ్వరయ్య హారేరామ కండువా సవరించుకుంటూ అడిగాడు.

"కాంపౌండులో వున్న మూ-ముగ్గురు పెద్దవాళ్ళ అడుగుజాడల్లో నడవకపోతే బాగుండదని—సరే! అన్నానుగానీ...నాకు అనూరాధతో అవసరమేమిటో చెప్పండి?— చక్కటి భార్య ఉండగా!! అనూరాధ నాకు తోడబుట్టినదానిలాంటిది.

"మనం నలుగురం ఈనాటితో మన మనసుల్లో ఉన్న కుళ్ళును ఏరి అవతల పారేశాం! పశ్చాత్తాపంతో పునీతులమయ్యాం. పోతే ఓ మాట. అనూరాధ అందం వెర్రెక్కించే అందం! అందు కని.. ఆమె ఎదురుపడ్డా ఇకనుంచీ ఆమె ముఖంకూడా చూడరాదు

మనం. అసలు ఆమెను పట్టించుకోనట్టే ఉందాం!" ఈశ్వరయ్య నీతిని బోధించాడు శ్రోతలకి.

సరేనంటే సరే! నన్నారు మిగతా ముగ్గురూ.

ఆ నలుగురి మనసుల్లో నలుగురు బాడీగార్డులూ సింహ స్వప్నంగా మెదులుతున్నారు లీలగా. అనూరాధ తమమీద రిపోర్టు చేసిందో? తమ శాల్తీలు గల్లంతవుతాయని గడగడవణికిపోతు న్నారు లోలోపల.

కొబ్బరిచెట్ల మీంచి ఉండుండి వీస్తున్న పిల్లగాలులు వారికి హాయి కలిగించటంలేదు.

అనూరాధని వదులుకోలేని కోరిక! వదులుకోపోతే ఆ కాలేజీ స్టూడెంట్లు నలుగురు తమనో పట్టుపడతారన్న భయం, వారిని కలిచివేస్తున్నాయ్!

కనుచీకట్లు ముసురుకుంటున్నాయ్. సమావేశం ముగించారు ఈశ్వరయ్యగారు. కలతబారిన మనసులతో నలుగురూ లేచి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

కిందనుంచి వారి సమావేశాన్ని గమనించిన అనూరాధ అలవోకగా నవ్వుకుంది.

# 17

ఓ వారం రోజులు గడిచాయి. కాంపౌండు వాతావరణంలో చాలా మార్పు కనిపెట్టింది అనూరాధ. "ఈశ్వరయ్య, సుందరయ్య, రామలింగం, కామేశం తన ఉనికినిగురించి పట్టించుకోవటం లేదు. తను యాధృచ్ఛింగా తారసపడ్డా తనను చూడటమే మానివేశారు. ఒకరికొకరు పోటీపడి మంచివాళ్ళనిపించుకోవాలని తంటాలు పడు తున్నారు. లోగడ తననువెంటాడి వేధించబోయిన కామపిశాచాలు వీళ్ళేనా? అనిపిస్తోంది అనూరాధకి. "దెబ్బకు దెయ్యం దడవటం" అంటే ఇదే కాబోలు! తన బాడీగార్డులంటే వణికి చస్తున్నారు ఈ పెద్దమనుషులు! బాడీగార్డుల విషయంలో తనుచేసినపని సముచిత మైనదే! చక్కటి ఫలితాలు కనిపిస్తున్నాయ్." అనుకుంది అనూరాధ.

ఓరోజు తనని బాడీగార్డులు ఫాలో అవలేదు. ఏదో వెలితిగా

అనిపించిందామెకి. దగ్గర్లోవున్న పార్కు కు వెళ్ళి కాసేపు కూర్చుంది.

అయిదు నిముషాల్లో బాడీగార్డులు నలుగురూ అక్కడకు చేరుకున్నారు- హుటాహుటీగా.

"మాకు కాలేజీలో కాస్త ఆలస్యమయింది. మీరు ఇంటికి వెళ్ళిపోయారేమోనని హడలి చచ్చాం. ఎవరో చెప్పారు మీరిక్కడ కూర్చున్నారని- అంతే! ఆఘమేఘాలమీద వచ్చేశాం" అన్నారు. వాళ్ళకి తనమీదగల శ్రద్ధకి, అభిమానానికి పొంగిపోయింది అనూ-రాధ.

"నేను మీకోసం ఎదురుచూసి ఏమీ తోచక ఇక్కడికి వచ్చేశాను" అంది.

నలుగురి హృదయాలు పులకించిపోయాయి.

"ఆంధ్రా జీడిలూ" అంటూ వచ్చాడు ఓ కుర్రాడు. ప్రసాద్ అందరికి తలో పొట్లం ఇప్పించాడు.

"ఇది జీడిపప్పుటండీ—తీసుకోండి ప్లీజ్" అన్నాడు నవ్వుతూ. పొట్లం అందుకుంది అనూరాధ.

"వేరుశెనగ పప్పుని జీడిపప్పు అని అంటూ అమ్ముతున్నావు. జీడిపప్పుని- ఏం పప్పు అని అమ్ముతావు నాయనా," అన్నాడు శేషు హాస్యంగా.

"సీమబాదంపప్పు అని అమ్ముతాను సార్!" అన్నాడా కుర్రాడు సంతోషంగా.

అందరూ గలగలా నవ్వేశారు.

డబ్బులిచ్చి పంపేశాడు ప్రసాద్.

వేరుశెనగపప్పు తింటున్నారంతా "ఆ నలుగుర్నీ ఓ పట్టు పట్టాం అనూరాధాదేవీ! ఇప్పుడేమంటున్నాయ్ ఆ రాబందులు?" —ప్రసాద్ కుతూహలంగా అడిగాడు.

"మీ అందరికీ చాల థాంక్స్! గాలివానకి చచ్చిన రాబందుల్లా ఉన్నారు వాళ్ళు ఇప్పుడు. మీ సహాయం మరువలేను." స్నిగ్ధంగా నవ్వింది.

అలా నవ్వినప్పుడు ఆమెలో కనిపించిన అందాలు వాళ్ళ నలుగురినీ పరవశుల్ని చేసింది.

క్రియ మార్చినా, ఉన్నప్పుడు మీదేగా, మీకోసం ఏదైనా చేస్తాం" గోపి నవ్వుతూ అన్నాడు. "ఈ శుభసందర్భంలో నాదో చిన్నమనవి," అన్నాడు శేషు.

"చెప్పండి" కళ్ళు పెద్దవిచేసింది అనూరాధ.

"మీ: వ్వాళ మాతో సినిమాకి రావాలి."

ముగ్గురూ ఆతవి ప్రతిపాదనని బలపరిచారు.

అనూరాధ ఏమీ బదులు చెప్పలేదు.

నస్పెన్స్ పట్టలేకపోతున్నారు నలుగురూ.

"వస్తాను" అంది కొన్నిక్షణాలు గడిచాక సంతోషం పట్ట లేక చప్పట్లు చరిచారు.

పార్కులో కూర్చున్న కొంతమంది తలలిటుతిప్పి చూశారు.

"చూడండీ! వాళ్ళుచూస్తే కాలేజీపిల్లలా ఉన్నారు. చదువు సంధ్యలు వదిలేసి...." అంది ఒకలావిడ

"ప్రేమాయణంలోపడ్డారు...." అంది బట్టతల.

"నలుగురబ్బాయిలు, ఒకమ్మాయి! - మగవాళ్ళకు బుద్ధి లేదనుకోండి ఆడపిల్లకయినా జ్ఞానం ఉండక్కర్లా! ఆనలుగురూ ఆమెని నిలువునా దోచేస్తారు. ఆతరువాత కాలితో తన్నేస్తారు."

"ఇంతకీ తప్పు ఆ అమ్మాయిదికాదు. ఆ అమ్మాయి తల్లి దండ్రులది. బుద్ధున్న ఏతండ్రీ కూతుర్నలా విచ్చలవిడిగా వది లెయ్యడు."

"ఆ అమ్మాయికీ, ఆ అబ్బాయిలకీ ఉండాలిగానీ తల్లి దండ్రులు ఇరవైనాలుగు గంటలు కాపలా కాయగలరా చెప్పండి!"

ఎంత నెమ్మదిగా మాట్లాడుకున్నా ఆ పెద్దమనుషుల మాటలు అందరి చెవుల్లోను పడనే పడ్డాయి.

యువకిశోరాలు లేచాయి. దూకటానికి సిద్ధంగా ఉన్నాయి. గుప్పెళ్ళుబిగపెట్టిన వాళ్ళ ఆవేశాన్ని గమనించింది అనూరాధ.

"వద్దు! వాళ్ళ మాటల్ని పట్టించుకోవద్దు. మిమ్మల్ని నేను అభిమానించకపోతేగదా మీరు బాధపడాల్సింది" అంటూ వారిం చింది. చేతులు జోడించి ప్రార్థించింది. ఆమెకోసం తమ ఆవేశాన్ని బలవంతంగా అణుచుకున్నారు.

నలుగురు బాడీగార్డులు బుద్ధిమంతుల్లా కూర్చున్నారు.

"అయితే ప[illegible] సినిమాకి" ప్రసాద్ వేడుకగా అన్నాడు.

అనూరాధని మధ్యలో కూర్చోపెట్టి, ఆమెకి ఇరువైపులా ఇద్దరిద్దరు కూర్చోవాలి। మధ్యలో ఆమె భుజాన్ని, చేతుల్ని తాకాలి। సాధ్యమయినన్ని చిలిపిచేష్టలు చెయ్యాలి। ఆమె కూడా తమని ప్రేమిస్తోనే ఉందిగా? కాదనదు. ఆమె తమ నలుగుర్ని ప్రేమించటం నిజంగా తమ అదృష్టం। కాలేజీ అమ్మాయిల్లో నూటికి యాభై మంది అయినా అనూరాధలాంటి చొరవగలవాళ్ళుంటే తమలాంటి రోమియోలకి రోజూ పండగే।

"ఇవ్వాళ కాదు" గంభీరంగా అంది అనూరాధ.

హతాశులయ్యారు నలుగురూ.

"మరెప్పుడు?"

"ఫైనల్ ఎగ్జామ్స్... ఇంకా నెలా పదిరోజులే ఉన్నాయి. అవి అయిన తర్వాత వస్తాను."

పైకి ఏమీ అనలేక "అలాగే" అన్నారు.

"చూడండి"

అందరూ ఆమె వేపే చూస్తున్నారు.

"మీరు నా మాటకి అన్నివిధాలా మన్నించారు. నాకోసం మరే ఆడపిల్లల వెంటపడటం మానేశారు. ఆ నలుగురు 'పెద్ద' మనుషులకీ బుద్ధి చెప్పారు. పోతే..ఇంకా ఒక్కటి చెయ్యాలి నామీద అభిమానముంటే."

"ఇందాకే చెప్పాంగా?—మీరు ఆజ్ఞాపించండి నిప్పుల్లో దూకుతాం."

"అంతపని చెయ్యొద్దు. మీరు నిప్పుల్లో దూకితే...మీ శరీరానికి బర్నాల్ రాయలేక నా చేతులు నొప్పెడుతాయి" వాళ్ళ నలుగురి మనసు ఆర్ద్రమయిపోయింది.

"చెప్పండి। మీరేం చెయ్యమంటే అదే చేస్తాం."

"గుడ్। అయితే ఇవ్వాళనుంచీ...బుద్ధిగా పట్టుదలగా చదవండి. మీలో ఏ ఒక్కరు తప్పినా నేనెంతో బాధపడతాను.

"ఓ। చూడండి మేమంతా కష్టపడి చదివి మీతో పాటు పాసవుతాం" గట్టి నిర్ణయాని కొచ్చినట్టుగా అన్నారు.

"విష్ యూ గుడ్‌లక్!"

"థాంక్యూ! కానీ రోజూ ఉదయం, సాయంత్రం మీతో వచ్చే భాగ్యాన్నిమాత్రం కాదనకూడదు.

"ఓ. కె." చిరునవ్వు చిందించింది.

బాడీగార్డులు ఓ అరఫర్లాంగువరకూ వచ్చి దిగబెట్టి వెళ్ళిపోయారు

వాళ్ళనిగురించే ఆలోచిస్తూ నడుస్తోంది అనూరాధ. తనుచేసే పని మంచిదేనా? తన శీలాన్ని కాపాడుకోవటం కోసం ఈ నలుగురి సాయం కోరింది తను. వెంటనే అదుకున్నారు వాళ్ళు. ఫలితాలుగూడా చక్కగా వచ్చినయ్.

తనివ్వాళ ఆ కాంపౌండులో నిర్భయంగా ఉండగలుగుతోంది అంటే అది తన బాడీగార్డుల చలవే! ఇందాక వాడిన ఆయుధంతో పరీక్షలయిపోయేటంతవరకూ ఇబ్బందిలేదు. ఆతరువాతే తల యెత్తుతుంది అసలు సమస్య!

తను నలుగురినీ అభిమానిస్తోంది. నలుగురినీ ఆరాధిస్తోంది. తన దృష్టిలో నలుగురూ ఒక్కటే.

"మరి వారిదృష్టిలో, తనూ అంతేగా?"

తనకోసం ప్రాణం విడుస్తారు వాళ్ళు.

అలాంటిది పరీక్షలవగానే ఊరుకుంటారా?

తమ ప్రేమని వ్యక్తం చేస్తారు.

"ఒక్కరుకాదు. నలుగురూ ఒకే ఒకసారి అడుగుతారు."

"అప్పుడు తనేం చెయ్యాలి?"

వారికేమని జవాబు చెప్పాలి?"

మీ నలుగురూ నాకు కావాలి అని చెప్పగలదా తను?

చివరికి సమస్యకి - ముగింపు ఎలా? నిప్పుతో చెలగాట మాడుతున్నావన్నారు స్నేహితురాళ్ళు.

"అది నిజమేనా? ఏమో!"

అమ్మో! భయమేసింది అనూరాధకి.

అదురుతున్న గుండెలతో ఇంట్లో అడుగుపెట్టింది.

# 18

శారదమ్మ మిషను కుడుతోంది. అనూరాధ రాగానే తల పైకెత్తి కొత్త వ్యక్తిని చూసినట్టుగా చూసి తిరిగి తన పనిలో మునిగిపోయింది.

ఆశ్చర్యమేసింది అనూరాధకి.

"వచ్చావా అమ్మా!" అని ఆప్యాయంగా పలకరించే అమ్మ ఇలా ఉందేమిటివ్వాళ?

పుస్తకాలు, టిఫిన్ బాక్సు టేబులుమీద పెట్టి, "అమ్మా" అని పిలిచింది.

మిషను కుట్టటం ఆపలేదు శారదమ్మ.

"అమ్మా! ఎందుకమ్మా అలా ఉన్నావు?

జవాబివ్వలేదు- శారదమ్మ మిషను కుట్టటం ఆపేసింది.

తలుపులు వేసింది. అలమారులోంచి ఒక ఇన్‌లాండ్ కవరు తీసి అనూరాధ చేతికిచ్చింది

ఆత్రంగా విప్పి చదివింది- అనూరాధ.

"అ తే."

అవాక్కయిపోయింది. ఆమె మనసు ఎక్కడో విహరించసాగింది. ఇంతకీ ఏమిటో దానిలోని విషయం?

ఆమె తేరుకోకముందే బలంగా ఒక చెంపకాయ వేసింది శారదమ్మ.

కూతుర్ని కొట్టటం కొన్నేళ్ళ తరువాత ఇదే ప్రప్రథమం।

గూబ గుయ్‌మనేసరికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి అనూరాధకి

"అమ్మా!" అంది బాధగా-చెంపమీద చేత్తో నిమురుతుంటూ.

మరుక్షణంలో శారదమ్మకి దుఃఖం ముంచుకొచ్చింది. ఆమె కళ్ళ వెమ్మట నీళ్ళు ధారగా కారుతున్నాయి.

ఆశ్చర్యపోతోంది అనూరాధ.

"అమ్మా! నన్నుకొట్టి నువ్వు ఏడుస్తున్నావా? ఏమిటమ్మా ఇది?" గద్గదికంగా అడిగింది.

"ఏం చెయ్యమన్నావే నువ్వుచేసిన పనికి."

"అమ్మా!"

"ఎందుకలా అరుస్తావ్! భర్త సరిగ్గా చూడకపోయినా నా ఆశలన్నీ నీమీదే పెట్టుకుని బతుకుతున్నాను. అందరూ శారదమ్మ కూతురు విప్పు అంటుంటే ఎంతో గర్వపడ్డాను సంతోషించాను. పరీక్షలు కాగానే ఏదో సంబంధం ముడిపెట్టి ... మీ రిద్దరూ చిలకా గోరింకల్లా ఉంటే సంతోషిద్దామనుకున్నాను. ఈ లోగానే నీకు ఏం పోయేకాలం వచ్చిందని అలాచేశావ్!"

"ఆ ఉత్తరం రాసిన పెద్దమనిషికి తెలిస్తే ఏమవుతుంది నీ బతుకు!"

దుఃఖం తెరలుతెరలుగా వస్తోంది శారదమ్మకి.

"ఇందాక నేను సుధారాణి ఇంటికి వెళ్ళాను, కుట్టిన బట్టలు తీసుకుని. వాళ్ళమ్మ చెప్పింది—నువ్వుచేస్తున్న ఘనకార్యంగురించి."

"ఏమని?"

"పరువుగల ఏ ఆడపిల్లా" చెయ్యని బుద్ధిలేని పనిచేసి ఇంకా ఏమిటని అడుగుతున్నావా!" అవిడకయినా సుధారాణి చెప్పకపోతే తెలియకపోను...."

"ఏమని చెప్పింది సుధారాణి!"

సుధారాణిమీద ఒక్కసారిగా కోపమొచ్చేసింది అనూరాధకి.

"అబద్ధమేం చెప్పలేదు మహాతల్లీ!" నువ్వు చేస్తున్న ఘన కార్యం గురించి చెప్పింది. ఆ పిల్లా....అశాలతా ఇద్దరూ మందలించినా, కాలేజీలో మిగతా ఆడపిల్లలు హెచ్చరించినా వినలేదుటగా నువ్వు! ఎంత బరితెగించి పోయావే! ఆ నలుగురు రౌడీ గాళ్ళతో స్నేహం చేస్తున్నావటగా. నిజం చెప్పు! ఏమైనా దాచావో దొక్క చీరేస్తాను!".

రెండు క్షణాలు మౌనం పాటించింది అనూరాధ.

"బొమ్మలా అలా నిల్చున్నావే! సమాధానం చెప్పు! గద్దించింది శారదమ్మ.

"నిజమేనమ్మా"

నెమ్మదిగా అంది.

"అయ్యో.... అయ్యో . ఎలా తయారయ్యావే నువ్వు ! నిన్ను....! నిన్ను....!" మళ్ళీ కొట్టటానికి చెయ్యి ఎత్తబోయింది శారదమ్మ.

"కొట్టమ్మా—కొట్టు నన్ను చంపేదాకా కొట్టు....
కూతురి ముఖంలో విభ్రమం చూసి ఎత్తిన చెయ్యి దించేసింది శారదమ్మ.

"వాళ్ళతో రోజూ షికార్లటగా!— వాళ్ళతో హోటలు కెడతావటగా? శాస్త్ర అలస్యంగా వస్తుంటే, కాలేజీలో ఏదో పనుంది అనుకుంటున్నానుగానీ, ఇలా విర్వాకంవెలగబెడుతున్నావని నాకేం తెలుసు?" గుండెలు బాదుకుంది శారదమ్మ

"ఒక్క మాటడుగుతాను నిజంచెప్పు?"

"అడుగు." అన్నట్టుగా చూసింది అనూరాధ.

"నువ్వు పాడయిపోయావుకదూ వాళ్ళచేతిలో"

అమ్మా! అభిమానం దెబ్బతిన్నట్టుగా చూసింది.

శారదమ్మ కూతురికేసి కళ్ళప్పగించి చూస్తోంది.

"అమ్మా" చాలా సౌమ్యంగా అడిగింది.

"ఏమిటి?" శారదమ్మ కస్సుమంది. కూతురంటే అసహ్యంగా ఉందామెకి.

"నాన్న నిన్ను సరిగా చూడటంలేదుకదూ!"

"అవును! ఇప్పుడాసంగతి ఎందుకు?"

"మరి నువ్వు శీలవతివేనా?"

"ఏమన్నావ్!" నవనాడులు కుంగిపోయినట్లయింది. శారదమ్మకి గుద్దొచ్చి పిల్లనెక్కిరిస్తున్నట్టు విలవిలలాడిపోయింది.

"నీకేకాదు, నాకూ తెలుసమ్మా! మాఅమ్మ నిప్పు అని"

శారదమ్మ గుండెమీద చెయ్యివేసుకుంది.

"నీకూతుర్నమ్మా నేను. నే నేపాపం చెయ్యలేదు. నీమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. నన్ను నమ్మవా అమ్మా?"

గుండెలమీదనుంచి బరువుతీసినట్టయింది శారదమ్మకి.

"హుష్" అంటూ అక్కడున్న మంచంమీద కూలబడిపోయింది.

ఇందాకటినుంచీ ఉగ్గబట్టుకున్న అనూరాధ ఇక నిగ్రహించుకోలేక పోయింది.

తల్లి ఒళ్లో దూరి కన్నీళ్ళతో ఆమె చీర తడిపేసింది

"నేను చేసిందల్లా.... నీకు చెప్పకుండా వాళ్ళతో స్నేహం

చెయ్యాటమేనమ్మా। అంతకన్నా ఏ పాపం ఎరగను।"

కరిగిపోయింది శారదమ్మ.

"నా తల్లిమాట నమ్మకపోతే, ఇంకెవరిమాట నమ్మతా నమ్మా। కానీ అసలిలా ఎందుకు చేశావ్? పులిపిల్లతో మేకపిల్ల స్నేహం చెయ్యటం ఎక్కడన్నా ఉందా? నేను నమ్మినా, లోకం నమ్ముతుందా? నిన్ను గురించి అందరూ అదోలా చెప్పుకుంటు న్నారు. సుధారాణి తల్లి అన్నప్పుడు నా మనసెంత బాధపడిందో తెలుసా?"

"కాదంటం లేదమ్మా। కానీ నేనాపని చెయ్యకపోతే నీ కూతురు శవాన్ని చూసి ఉండేదానివమ్మా ఈపాటికి."

"అమ్మా। అలా అనకు ఏం జరిగిందసలు." కూతురి కళ్ళ నీళ్ళు తన పమిటకొంగుతో తుడిచింది శారదమ్మ- ఆమెకు చాలా ఆందోళనగా ఉంది అసలు విషయమేమిటో అని.

నలుగురు పెద్దమనుషులూ, వాళ్ళ పన్నాగాల గురించి, వివరంగా చెప్పింది అనూరాధ.

విషయమంతా విన్న శారదమ్మకు నోట మాటరాలేదు కాసేపు.

అచేతనంగా ఉండిపోయింది కాసేపలాగే ఎంతో మంచి వాళ్ళనుకుంటున్న ఈ పెద్దమనుషుల నిజస్వరూపాలు ఇవా నాకు చెప్పక పోయావా? ఇల్లు ఖాళీచేసే వాళ్ళంగా.

"ఒకరోజు రాత్రి నాకు నిద్ర పట్టనప్పుడు విన్నాడిగాను గుర్తుందా అమ్మా।

"అవును. ఏదో మామూలుగా అడిగావనుకుని ఇంత సౌకర్యంగల ఇల్లు మార్చటం ఎందుకన్నాను. ఇలా చెపితే నేను మాత్రం కాదనేదాన్నా?"—నొచ్చుకుంది శారదమ్మ.

అవరణలో ఉన్న నలుగురు పెద్దమనుషుల్ని గురించీ చెడుగా చెపితే....నువ్వు నన్ను నమ్మకపోగా చివాట్లేస్తావని భయ పడ్డానమ్మా తరువాత మళ్ళీ ఆలోచించాను నేను. మరో చోటికి వెళ్ళినా అక్కడ మాత్రం- అందరూ కాకపోయినా.... కొంతమం దయినా ఇలాంటి వాళ్ళుండరని నమ్మకమేమిటి? అనిపించింది"

"అది సరే! ఈ దుర్మార్గులకీ.... ఆ రౌడీ కుర్రాళ్ళతో స్నేహం చెయ్యటానికి సంబంధమేమిటి!"

"నేను తెలుసుగా అమ్మా! సామూలుగా కాలేజీ కుర్రాళ్ళం చేసే ఈ రోజుల్లో అందరికీ హడల్.... సంఘ్యాబలంతో ఏంచేస్తారోనని.... అందులో బాడీగార్డులంటే.... తప్పనిసరిగా రౌడీలు, రోమియోలు అయిఉంటారని అందరి నమ్మకం. అలాంటి వాళ్ళంటే భయ పడని వాళ్ళెవరుంటారు? రోజూ నా వెంట సుధా రాణీ ఆశాలత వెంటపడుతుండేవాళ్ళు వీళ్ళు. మన కాంపౌండులో ఉన్న నలుగురు పెద్దలకి మనంగా బుద్ధి చెప్పలేము. అందుకని బాగా ఆలోచించి నా బాడీగార్డులతో మంచిగా మాట్లాడి సాయం తీసుకున్నాను. ఆ నలుగురూ ఈ నలుగుర్నీ విడవిడిగా కలిసి బెదిరించారు. "అనూరాధ జోలికి వస్తే డొక్క చీలుస్తామని" దాంతో వీళ్ళ ఆట కట్టింది.

"సరే! ఈ నలుగురికీ బుద్ధి వచ్చిందిగా ఇక ఆ రౌడీవెధవల స్నేహాన్ని వదిలేయ్."

"అమ్మా!" దెబ్బ తిన్నట్టుగా అంది.

"ఏమిటే?"

"నేను వాళ్ళని వదిలెయ్యాలెనమ్మా.... నన్నువాళ్ళు ఎంతగానో ప్రేమిస్తున్నారు. నాకోసం ఏమయినా చేస్తారు వాళ్ళు— నేనుకూడా...."

"వాళ్ళని" ప్రేమిస్తున్నావుటే! అవ్వ.

"అలా ఆశ్చర్యపోకమ్మా! నేను చెప్పేది నిజం"

"రౌడీముండా వాళ్ళతో ప్రేమ ఏమిటే....?"

"ప్రస్తుతం నీ కింతకన్నా చెప్పలేనమ్మా. నామీద నమ్మకం ఉంటే నా కొదిలెయ్ ఈ సమస్యని"....

మరి ఆ ఉత్తరం సంగతి? ఏం రాయమన్నావ్ జవాబు?

"మీ యిష్టప్రకారమేనని రాయి."

"ఏమిటో తల్లీ! నా మతిపోతోంది. అటు, అటు చెపుతున్నావ్! ఇటు ఇటు చెపుతున్నావ్! భలే పిల్లవి పుట్టావు నా కడుపున నువ్వేమైనా చేసుకో..! ఏదైనా పొరపాటు జరిగిందో.... నీకు విషంపెట్టి, నేను విషం తింటాను- జాగ్రత్త"

"మా అమ్మ మంచిది" నవ్వింది అనూరాధ.

"ఎందుకూ? కూతురు అల్లరి కుర్రాళ్ళతో స్నేహం చేస్తూ

ఉంటే చూస్తూ ఉన్నందుకా? లే। వెళ్ళి ముఖం కడుక్కోరా। కాఫీ తాగుదువుగాని.

పెరట్లోకి తుర్రుమంది అనూరాధ కాఫీ తాగి బయటకొచ్చి చూసింది. ఈశ్వరయ్యవాళ్ళ పోర్షన్ తాళమేసి ఉంది. "అమ్మయ్య। తల్లికి, తనకి జరిగినసంభాషణఎవరూ వినలేదు. ఓ.కె."అనుకుంది.

ఒంటరిగా ఆ ఉత్తరం పదేపదే చదువుకుంది. అనూరాధ. ప్రేమగా గుండెలకు హత్తుకుందొకసారి.

ఆర్రాత్రి ఎన్నో అందమైన కలలు వచ్చాయ్ అనూరాధకి.

ఉదయం లేచేసరికి బాడీగార్డులు గుర్తుకొచ్చారు. రాత్రి వచ్చిన కలలకీ, బాడీగార్డుల ప్రేమకి పోల్చుకుని, చిరునవ్వు నవ్వు కుంది అనూరాధ. దాని అంతరార్థమేమిటో। ఆమెకే తెలియాలి.

# 19

ఫైనల్ యియర్ పరీక్షలు దగ్గరపడ్డాయి చదువులో పూర్తిగా మునిగిపోయింది అనూరాధ. బాడీగార్డులు ఉదయం, సాయంత్రం వెంట వస్తూనే ఉన్నారు. వాళ్ళెలా చదువుతున్నారో ఏమిటో...? వివరంగా కనుక్కుంటోంది అనూరాధ. వాళ్ళుచెప్పే జవాబులు చూసి ముగ్ధురాలయిపోతోంది. బాడీగార్డులు అంటే.... తెలివిలేనివాళ్ళు అనుకునేది అనూరాధ ఇదివరకు. అల్లరిచిల్లరాళ్ళు తమ ధ్యాసని చదువు మీదకి మళ్ళిస్తే....ఎలాంటి ప్రతిభ ప్రదర్శించగలరో....? అర్థమవుతోందామెకి. ప్రసాద్, గోపీ, శేషు, శేఖర్ మంచి మార్కులతో పాసవటం ఖాయం అనుకుంది. వాళ్ళకి తగిన ప్రోత్సాహం ఇస్తూనే ఉంది తను ప్రతిరోజూ.

ఫైనల్ యియర్ ఎగ్జామ్స్ అయిపోయినాయి అనూరాధ చాలా బాగా రాసింది. క్లాసే కాకుండా డిస్టింక్షను కూడా రావచ్చు. బాడీగార్డులుకూడా పరీక్షలు బ్రహ్మాండంగా రాశారు. వాళ్ళని మనసారా అభినందించింది అనూరాధ. సుధారాణి, ఆశాలత అతికష్టం మీద పాసయ్యేట్టుగా రాశారు. కలవారి పిల్లలుకదామరి। బాడీగార్డులు నలుగురూ.... అనూరాధని రేప్ చెయ్యటమో.... చంపెయ్యటమో చేస్తారనుకున్నారు వాళ్ళు. అలాంటిదేమీ లేకపోగా, ఆ నలుగురూ అనూరాధ చుట్టూ పిల్లిపిల్లల్లా తిరగటం....

ఆమె చెప్పినమాట వేదవాక్కుగా ఆచరించట! ఎంతో ఆశ్చర్యం కలిగించింది! సుధారాణి, ఆశాలతలేకాదు కాలేజీమొత్తం ఆశ్చర్య పోయారు - ఆ విషయంలో

ఆఖరుపరీక్ష రాసేరోజున తల్లినడిగి ఓ పాతికరూపాయలు తెచ్చింది అనూరాధ. ఆ సాయంత్రం హోటల్లో గ్రాండ్‌పార్టీ ఇచ్చింది నలుగురు బాడీగార్డులకీ.

పార్టీ అయిపోగానే "మీతో ఓ ముఖ్యమయిన విషయం మాట్లాడాలి" అన్నారు నలుగురూ.

"అలాగే! పదండి" అంది అనూరాధ.

పదినిముషాల్లో పార్కులోకి చేరారు.

పైన వాతావరణం చల్లగానే ఉంది పార్కులో పల్చ పల్చగా ఉన్నారు జనం. జనంలేనిచోట పచ్చికమీద కూర్చున్నారు అందరూ.

విషయం చాలా సున్నితమైంది ఎలా మొదలుపెట్టాలో తెలియక తికమకపడుతున్నారు నలుగురు హీరోలు.

"చెప్పండి" అంది అనూరాధ ప్రోత్సహిస్తూ.

"మీకు గుర్తుందా అనూరాధగారూ? ఒకనాడు మేం మీ వెంట పడుతున్నప్పుడు మమ్మల్ని పిలిచి మందలిస్తూ అన్నారు. నేను మీ అందర్నీ అభిమానిస్తున్నాను, ఆరాధిస్తున్నాను అని" అన్నాడు ప్రసాద్.

"అవును"

"ఇప్పటికీ అంతేకదూ?" గోపీ అందుకున్నాడు.

అనూరాధ జవాబివ్వలేదు.

"చెప్పండి" అనుకోకుండానే గట్టిగా అడిగాడు శేషు.

"మాకు జవాబు కావాలి! అది మీనుంచి రావాలి. అది మీ బాధ్యత."

నలుగురివేపు కళ్ళెత్తి అదోలా చూసింది అనూరాధ.

"ఇంకా మీరు చెప్పవలసిందేమన్నా ఉంటే విశ్పయంగా చెప్పొచ్చు" విబ్బరంగా అంది.

"అంటే మామీద మీకేమీ అభిమానం లేదనేగా మీఅర్థం."

"అర్థాలు పెడర్థాలు తర్వాత"—

చెప్పొచ్చు" అదే చిరునవ్వు అనూరాధ ముఖంలో.

"మిస్ అనూరాధా! నలుగురి తరపున నేను చెపుతున్నాను. మా మనసుల్లో ఏముందో! ఏరా!" అంటూ మిగతా ముగ్గురి ముఖాల్లోకి చూశాడు. వాళ్ల అంగీకారం తెలిపారు కళ్ళతోనే.

"ప్రొసీడ్" కళ్ళు తిప్పుతూ అంది అనూరాధ. మొదలు పెట్టాడు ప్రసాద్.

"ఇన్నాళ్ళూ మమ్మల్ని గురించి మీరే మనకుంటున్నారు అనూరాధా!"

"అదిగూడా మీరే చెపితే బాగుంటుందేమో!"

"ఇట్సాల్‌రైట్! అలాగే చెపుతాను వినండి. నేను చాలా తెలివిగలదాన్నని మీ నమ్మకం"

"ఏ విషయంలో?"

"మా విషయంలో—"

"కొంచెం వివరంగా చెప్పండి."

"ఆల్‌రైట్! ప్రతి ఆడపిల్లలాంటిదాన్ని నేను కానని, నాలో ప్రత్యేకమైన చాకచక్యం ఉందని అనుకున్నారు మీరు గుడ్డిగా! ఆడపిల్లల్ని ఏడిపించే మాతో స్నేహం చేశారు. కాదు, చేస్తున్నట్టు నటించారు. దానిలో అంతరార్థం— మీరు చెప్పిన పనల్లా మేము గుడ్డిగా చేస్తామనే స్వార్థం! మేమూ అలాగే చేశాము మీ పాలిష్ పాలిష్డ్ విలన్లలా తయారయిన ఆ నలుగురి పెద్దమనుషుల గుండెల్లో నిద్రపోయాం—వాళ్ళు మీ జోలికిరాకుండా చేశాం ఎందుకో తెలుసా?"

"ఇన్ని మీరేచెప్పి, అది ఒక్కటే నన్నడిగితే ఏం బాగుంటుంది. మీరే చెప్పండి ఆ చిదంబర రహస్యం" సన్నగా నవ్వింది.

"వేళాకోళం కాదు అనూరాధా సీరియస్‌గా వినండి. మీరు చెప్పినట్టులా మేం చేసింది మీ చేతిలో కీలుబొమ్మలయి కాదు."

"మరి?"

"మీ అందంమీద, మీ పొంకంమీద తీయని కాంక్షతో, ఈ ఫేవర్ చేసిపెడితే మీరు మాకు లొంగిపోతారనే ఆశతో. అంతేకాని, మీరనుకున్న వెర్రి వెంగళాయిలం కాదు మేము. మీ అవసరం

తీరాక సినిమాల్లోలా "అన్నయ్యలూ" అంటే పొంగిపోయి, ఆ ఆప్యాయతకి లొంగిపోయి "చెల్లెమ్మా" అని మనసు మార్చుకో టానికి కాదు-తెలిసిందా?"

"........"

"ఏం మాట్లాడవే అనూరాధా! నువ్వు మా చుట్టూ అల్లిన పద్మవ్యూహం పటాపంచలయిపోయిందని బాధగా ఉందా!"

"........"

"మా నలుగురికీ నీ పసందైన పరువంతో పొందు కావాలి. మేం చేసిన ఉపకారానికి బదులుగా నీవు దాన్ని స్వయంగా విందు చేయాలి! అంతే కదరా!" అన్నాడు మిత్రబృందాన్నుద్దేశించి.

"అవును" అన్నారు వాళ్ళు ధృడంగా.

ఈసారి అనూరాధ ఏమీ మాట్లాడలేదు!

"మిస్ అనూరాధా! నీ ఖర్మకాలి....మిగతా ఆడపిల్లల మాదిరిగా తలవంచుకు పోకుండా మా పరిధిలోకి వచ్చి, మాతో స్నేహం చేసి మా దృష్టిలో పడ్డావు. దానికి నీవు పరిహారం చెల్లించి తీరాలి" ప్రసాద్ అల్టిమేటమ్ ఇచ్చాడు.

"ఇవ్వకుండా తప్పించుకుందా మనుకుంటున్నావేమో...." తర్జనితో బెదిరించాడు గోపి.

"సురేఖ విషయంలో మా సోదరులు ఏంచేశారో గుర్తుందిగా?" వికటంగా నవ్వాడు శేషు.

"మర్యాదగా మాకు లొంగితే సరేసరి. లేకపోతే నీ శరీరాన్ని బలవంతంగా విందు చేసుకుంటాం. నీకు మేం చవటలమయి పోయపడలేదింతకుముందు- టేకేర్" శేఖర్ అదిలించాడు.

"అనూరాధ ఇంకా మౌనంగానే ఉంది."

"జవాబు చెప్పు అనూరాధా....? సరేనంటావా! లేకపోతే పీలుచూసుకుని ఓ పట్టు పట్టమంటావా!"

నలుగురూ విశేషంగా అనూరాధని. ఆమె పెదవి విప్పక పోవటం భరించలేక పోతున్నారు.

గలగల నవ్వింది అనూరాధ.

"ఏమిటానవ్వు? మేమంటే అపహాస్యంగా ఉందా?" ప్రసాద్ కోపంగా చూశాడు.

పెగ్గాద్లి!

విప్పారిపోయారు నలుగురూ.

"అంటే?"

"అంటే ఏముంది? సింపుల్! మీరు నలుగురూ వట్టి మూర్ఖులు! వట్టి వెర్రి వెంగళాయులు!!"

"అనూరాధా....?" నలుగురికీ కోపం వచ్చింది.

మళ్ళీ మందహాసం చేసింది- అనూరాధ.

"లేకపోతే ఏమిటి? నేను మీకు పరాయిదాన్నా."

నలుగురూ ఐస్‌లా చల్లబడ్డారు. తెల్ల ఈశ్వరి వాసన చూపించిన త్రాచుపాముల్లా అయిపోయారు.

"నేనూ మనిషినే మానవికాదు. నాకూ కృతజ్ఞతవుంది."

ఆమె కళ్ళు చెమర్చాయి.

నలుగురూ జేబురుమాళ్ళుతీసి ఆమెకళ్ళు తుడిచారు.

"ఛీ" అంది అనూరాధ.

మళ్ళీ ఆశ్చర్యపోయారు.

"పరాయిదానిలా చేసి.... ఇంత పరుషంగా మాట్లాడిన మీకు నాకళ్ళు తుడిచేహక్కు ఎక్కడిది?" విషాదంగా అంది.

"సారీ! అనూ. విన్నపార్థం చేసుకున్నాం. మమ్మల్ని కాదంటావనే అనుమానంతో యిష్టమొచ్చినట్టు మాట్లాడాం. మమ్మల్ని క్షమించు నీపాద దాసులం."

"ఆపండి కవిత్వం! మీరు నలుగురూ నాకిష్టమే" నవ్వు తెచ్చుకుంది పెదవులమీదకి.

ఏనుగెక్కినంత సంబరపడిపోయారు.

"థ్యాంక్యూ అనూ! మై లవ్"

ఎవరికి వారు మనసులో అనూరాధని మెచ్చుకున్నారు.

"అయితే డియర్ ఫ్రండ్స్! మీకో చిన్నప్రశ్న!" అడదాన్ని పొందాలంటే మగాడేం చెయ్యాలి?"

ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"ఇంత చిన్నవిషయం మీకు తెలియదని నే ననుకోను మరోఛాన్సు యిస్తున్నా ఆలోచించి చెప్పండి" అదే దరహాసం అనూరాధ ముఖంలో.

"పెళ్ళిచేసుకోవాలి" అన్నాడు శేషు.

"దట్స్ గుడ్ పెళ్ళిచేసుకోండి నన్ను"

"నేనా"... అన్నాడు గోపి.

"నేనా...." అన్నాడు ప్రసాద్.

"నేనా.... అన్నాడు శేషు."

"నేనా.... అన్నాడు శేఖర్."

"కాదు" గంభీరంగా అంది.

మళ్ళీ కంగుతిన్నారు.

"మీరు నలుగురూ కలిసి నన్ను చేసుకోవాలి!"

స్నిగ్ధంగా నవ్వింది.

నిశ్చేష్టులయ్యారు నలుగురు బాడీగార్డులూ.

"నిన్ను ఒక్కదాన్ని నలుగురం ఎలా చేసుకుంటాం?" అన్నారు.

"ఒక్కదాన్ని-నా ప్రేమఫలం నలుగురూ ఎలా పొందాలనుకుంటున్నారో అలాగే....?!"

రోమియోల్లో ఒక్కరూ మాట్లాడలేకపోయారు.

"సరే! మీరో నిర్ణయానికి రావటానికి కొంత టైం కావలసి వచ్చేట్టుంది. రేపు బయలుదేరి నేనూ, మా అమ్మ ఊరెళుతున్నాం అత్యవసరమైన పనిమీద. తిరిగి రావటానికి ఓ ఇరవై రోజులయినా పడుతుంది. ఈలోగా మీరు ఓ అంగీకారానికి రండి. నాకు మాత్రం మీ నలుగురిమీద అభిమానమే! మీ నలుగురిమీద ఆరాధనే! నేను పూర్తిగా మీదాన్నేగా! మీరెలా చెపితే అలా వింటాను సరేనా,"

అనూరాధ ఊరెడుతుందనేసరికి బాడీగార్డులు నలుగురికీ గుండె కలచివేసినట్లయింది. "ఇరవై రోజులు రాణీగార్ని చూడకుండా ఉండగలమా?" అన్నారు.

తన మనసులోని భావాల్ని కప్పిపుచ్చుకుంటూ అదోలా చూసింది అనూరాధ! "నాకు మాత్రం బాధలేదూ? అయినా తప్పదు. వెళ్ళాల్సిన పని అతి ముఖ్యమైనది. ఇరవై రోజులు ఎన్నాళ్ళలో తిరిగివస్తాయి. నేను రాగానే మీ జీవితాలు, నా జీవితం సరికొత్త పరిణామాలతో పరిమళించాలని ఆశిద్దాం" అంది అనూరాధ

ఆ మాటలకు బాడీగార్డులు తమ భాష్యం చెప్పుకున్నారు.

"రాగానే తమ వళ్ళో పడిపోతుంది ఆమెకి అరాటంగానే ఉన్నట్టుంది" అనుకుని సరిపెట్టుకున్నారు. అందుకనే రాగానే.... ఏమన్నా తిరకాసు చేశావా? విన్ను బలవంతంగా 'రేప్' చేస్తాం?" అనలేకపోయారు.

అందరి దగ్గరా శలవు పుచ్చుకుని, వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళింది అనూరాధ. వెళ్ళేప్పుడు ఉత్తరాలు రాయటంకోసం నలుగురి అడ్రసులూ తీసుకెళ్ళింది. ఆమె తమవేపలా జాలిగా, బేలగా చూస్తుంటే మైనంలా కరిగిపోయారా నలుగురూ!

# 20

మర్నాడు బయలుదేరి తల్లితో వెళ్ళిపోయింది అనూరాధ. ఆమె వెళ్ళింతరవాత ఎంతో వెలితి కనిపించింది బాడీగార్డులు నలుగురికి. రోజూ తమ నలుగురూ అనూరాధ వెంట వెళ్ళటం, ఆమె తియ్యని మాటలు వినటం గుర్తుకు తెచ్చుకోసాగారు. ఆమె లేని లోటు అన్నివిధాల కనిపించింది వాళ్ళకి బజార్లో అమ్మాయిలవెంట పడదాం అనుకున్నారు. ఐతే, ఆడపిల్లల వెంటపడమని అనూరాధ కిచ్చిన వాగ్దానం గుర్తుకొచ్చింది అంతే! ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు. అనూరాధ తమ జీవితాల్లో ఎంత మార్పు తీసుకొచ్చిందో తలచుకుంటే సిగ్గు కలుగుతోంది వాళ్ళకి. జులాయిగా, జల్సాగా తిరిగే తమని చాలావరకు మార్చేసింది. బాడీగార్డులు, రోమియోలు అనే ముద్ర ఇంకా తమమీదున్నా ఇప్పుడు చదువులో మిగతా స్టూడెంట్లకేమీ తీసిపోరు తాము నలుగురూ. ఇదివరకటిలా కాలేజీ అమ్మాయిలు తమని చూసి అంతగా భయపడి తొలగిపోవటంలేదు. అంటే తమలో.... క్రూరత్వం స్థానే కొంత మంచితనం ప్రవేశిస్తోందన్నమాట! సరే అంతా బాగానేవుందిగానీ తాము నలుగురూ ఆమె ప్రేమని.... అదే తమ భాషలో ఆమె అందమైన తనూలావణ్యాన్ని పొందటమెట్లా?

"ఎలారా ప్రసాద్?" గోపీ అడిగాడు.

"నాకు అదే తోచటం లేదురా" ప్రసాద్ అయోమయం ముఖంపెట్టాడు.

"ఒరే నీకురా శేఖర్?"

"నాకూ ఏం పాలుపోవటంలేదురా!"

తలలు బద్దలు కొట్టుకున్నారు నలుగురూ

"పోనీ పెళ్ళిచేసుకుంటే ఏమిట్రా!" ప్రసాద్ రాజీకొచ్చాడు.

"మనలో ఎవరా వీరుడు!" గోపీ ప్రశ్నించాడు.

"నాకు చేసుకోవాలనే ఉంది కానీ.... ఇంత పేదపిల్లని చేసుకుంటే మా నాన్న నాకు చిల్లిగవ్వ ఆస్తి ఇవ్వడు. మెడపెట్టి గెంటేస్తాడు."

—శేఖర్ తన అసహాయత వ్యక్తపరిచాడు.

"నాకు చేసుకోవాలనే ఉందిగానీ.... కట్నం బాగాకావాలి మా నాన్నకి...." అనూరాధని చేసుకుంటే గన్‌పెట్టి కాల్చేస్తాడు నన్ను" గోపీ పెదవి విరిచాడు.

"పోనీ నేను చేసుకుందామంటే.... మా కులంకాదు. మా అమ్మ ఎండ్రిన్ తాగుతుంది" శేషు ఏదో ఆలోచిస్తూ అన్నాడు

"నా కిలాంటి ఇబ్బందులు లేవుగానీ.... నలుగురికీ ప్రేమ ఫలం పంచి ఇస్తాననే అమ్మాయి రేపు కారక్టరు పోగొట్టుకోదని ఏమిటి నమ్మకం!" ప్రసాద్ తన అమూల్యమైన అభిప్రాయం వ్యక్తపరిచాడు.

"అదీ పాయింటే!" గోపీ సమర్థించాడు.

"ఒరేయ్! అయిడియా! శేషు సంతోషంగా అరిచాడు!

త్వరగా చెప్పరా బాబూ! ఈ సమస్య తేలక చస్తున్నాం. వెడుతూ వెడుతూ భలే సమస్య పెట్టి వెళ్ళింది మహారాణి!"

ముగ్గురూ ఆరాటపడిపోయారు.

"ఒరేయ్ పిచ్చి సన్నాసుల్లారా" కాలేజీల్లో మన అంటే.... రోమియోలు లేక దాదీగార్డుల శాతం ఎంత ఉంటుంది? బుద్ధిమతులయిన విద్యార్థులతో పోల్చిచూస్తే చాలా తక్కువ ఉంటుంది. అంచే కాలేజీఅమ్మాయిల్నిఏడిపించటం. అల్లరిపెట్టటం మన జన్మహక్కు అన్నమాట! దీన్ని కాదనటానికి ఎవరికీ దమ్ములు లేవు. ఒకవేళ ఉన్నాయో వాళ్ళ కొమ్ములు విరిచేస్తాం మనం. అందుకే తోటి విద్యార్థులు, లెక్చరర్లు చివరకు ప్రిన్సిపాలు కూడా మనల్ని అంతగా పట్టించుకోరు. పట్టించుకుంటే మాత్రం వాళ్ళ మాట వింటామా మనం? తల్లిదండ్రుల్నే లెక్కచెయ్యంకదా!

ఇంతకీ మనం చేసిన ఘోరమైన తప్పు ఏమిటో తెలిసిందట్రా ఇప్పటికయినా ?"

దిక్కు మొగం పెట్టారు మిగతావాళ్ళు.

"ఫూల్స్‌రా మనం వట్టి బ్లడీఫూల్స్" శేషు మాటలుమిగతా ముగ్గురూ ఆసక్తిగా వింటున్నారు.

"అనూరాధ వల్లో పడటమేరా మనం చేసిన బ్లండర్ ! అది మనల్ని ఏయ్ మిస్టర్స్ అనేసరికి మత్తులా ఏదో మిస్టరీ ఆవహించింది మనల్ని. ఐస్‌లా కరిగిపోయాం అది మనల్ని ఏం చేసింది. పెంపుడు కుక్కలా వాడుకుంది. అనఘాగురు సన్నాసులకి బుద్ధి చెప్పించింది మనచేత. పోనీ ఆ విశ్వాసమయినా ఉంచిందా ? ఎ. సి హోటల్లో రూం బుక్‌చెయ్యండి. మిమ్మల్ని ఆనంద డోల కల్లో ఊగిస్తాను అందా? లేదు. కనీసం సినిమాకయినా వచ్చిందా? లేదు. పరీక్షల వంకపెట్టి తప్పించుకుంది. పైగా మనల్ని తన తియ్యటి కబుర్లతో ప్రోత్సహించి రాత్రిళ్ళు కష్టపడి చదివేలా శిక్షించింది ఇంత ఇదిగా చదవటానికి వేరే మంచి విద్యార్థులు లేరట్రా? మనకెందుకీ పాడు శ్రమ? సరేనయ్యా ! అదీచేశాం. అప్పటికయినా మన ముద్దు ముచ్చట తీర్చిందా? మీరో నిర్ణయానికి రండి అని మనలో మనకి జుట్టు ముడిపెట్టి వెళ్ళిపోయింది. మనం నలుగురం దాన్నెలా పెళ్ళిచేసుకోగలం?

ఇంపాసిబుల్ ! అంటే- చెయ్యి చూపించిందన్నమాట ! గుండెలుతీసిన బంటురా అది !"

"నిజమట్రా ! ఇంత లోతుగా నేను ఆలోచించలేదురా."

"నేనయినా ఇప్పుడేగా ఆలోచించి ఏడిసింది! అందుకని మనం ఓపని చెయ్యాలి. దీంతో దాని ఆటకట్టు !

"ఏమిట్రా అది?"

"సింపుల్ అండ్ బ్యూటిఫుల్....! చెప్పిన గడువు ప్రకారం ఇరవై రోజుల్లో అది తిరిగి వస్తుంది. మనవిర్ణయం అడుగుతుంది."

ఏం చెప్తదాం ? గోపీ ఆదుర్దాగా అడిగాడు.

"వినరా ఇడియట్."

"సరే గురూ !"

"నలుగురు విన్ను పెళ్ళిచేసుకోవటం చట్టవిరుద్ధం. మా అందరి

భావాలు కలవాడు."

"ఒరేయ్ అలా పొగడుకురా."

ప్రసాద్ సిగ్గుపడ్డాడు.

"ఒరేయ్ ప్రసాద్ అడ్డు తగలకు. నన్ను చెప్పనీ. ప్రసాద్ నిన్ను చేసుకుంటాడు అవిచెపుదాం. దానితో మరిమీరో అంటుంది స్నేహితుడికోసం మేమంతా మా ప్రేమని త్యాగంచేశాం. అందాం. ప్రసాద్ వాళ్ళ అమ్మా, నాన్నా మిమ్మల్ని చూడాలంటున్నారు ఒక్కసారి రండి. ఇప్పుడే వచ్చేద్దాం! అందాం సరే నటుంది పక్షి! మనఫ్రెండు భూషణంగారి పెళ్ళాం పుట్టింటికిపోయిందిగా! వాడియింటికి తీసుకుపోదాం. దానికేంతెలుసు? ఇది ప్రసాద్‌గాడి ఇల్లు కాదని లోపలికి తీసుకెళ్ళి తలుపువేసి..."

"ఆ తరువాత" గోపీ చిలిపిగా అడిగాడు

"నీబొంద! మాటల్లోకాదు నీప్రతాపం. చేతల్లో చూపించు" మందలించాడు శేషు.

"శేషుగాడి బుర్ర పాదరసంరోయ్!"

ముగ్గురు మిత్రులు ఎత్తేశారు శేషుని

"ఒరేయ్ బాస్టర్డ్స్! నన్ను పొగడటం కాదురా, రేపు దాన్ని చిత్తు చిత్తు చెయ్యటంలో మన టాలెంట్సు చూపించండిరా! లేకపోతే బ్యూటీక్వీన్ కదాని దానికంత పొగరా? రోమియోలని ప్రేమిస్తుందా? బాడీగార్డులతో స్నేహం చేస్తుందా? మామూలుగా మిగతా ఆడపిల్లల్లాగా తలవంచుకుపోతే మనఋషులు పట్టించుకునే వాళ్ళం కాదుగా? ఆ సుధారాణిని ఆశాలతని మనం గుర్తయినా పెట్టుకున్నామా! కనీసం లేదు. అప్పుడే వదిలేశాం. మనలాంటి రోమియోల్ని లొంగదీసుకున్నామనే విజయగర్వంతో ఊగిపోతోంది పూర్ క్రీచర్. వుయ్ విల్ టీచ్ హర్ ఎ లెసన్!"

అందరూ ఒకరికొకరు షేక్‌హాండిచ్చుకొన్నారు. పకపకా నవ్వుకున్నారు "చూశారా ప్రాబ్లమ్ ఎలా పరిష్కరించానో!" అన్న పోజుపెట్టాడు. శేషు— కాలరెత్తి!

"అడ్రస్ తీసుకుపోయింది కదరా, ఉత్తరంఅన్నా రాయలేదే" గోపీ అడిగాడు.

"ఒరేయ్ దాని దగ్గర్నుంచి ఉత్తరాలు రావాలని అవి చించి చదవాలని ఆశించకండిరా దాన్ని రానీయండి ఏకంగా దాని చీర జాకెట్టులే చించుదాం!"

హహ్హహ్హ అంటూ పెద్దపెట్టున నవ్వారు. మిగతా ముగ్గురూ.

# 21

టైము ఉదయం తొమ్మిదిన్నర గంటలయింది. ఎండ ముదురుతోంది. ఒక సెంటర్లో చెట్టు నీడన నిల్చొని మాట్లాడుకుంటున్నారు బాడీగార్డులు నలుగురూ. శెలవులవటంవల్ల ఏమీ తోచటం లేదు వాళ్ళకి వాళ్ళు నిల్చున్న చోటుకి పడమరగా కొద్ది దూరంలో పోస్టాఫీసు కనిపిస్తోంది.

అనూరాధ చెప్పిన గడువు అయిపోయింది. ఆమె తిరిగి రాలేదు. కనీసం ఉత్తరమయినా రాలేదు.

"ఏరోయ్! శేషూ! చెయ్యిచ్చిందనుకుంటారోయ్! అసలు వస్తుందో రాదో! మన అడ్రసులు తీసుకుందిగానీ దాని అడ్రసు ఇవ్వలేదు చూశావట్రా?"

"ఏడిసిందిలేరా? ఎక్కడికి పోతుంది? ఇల్లు కాళీ చెయ్యలేదుగా?" మిత్రబృందానికి ధైర్యం చెప్పాడు శేషు,

అదే సమయంలో పైనుంచి ఓ అమ్మాయి వస్తోంది. ఆ అమ్మాయి శరీరం చూస్తే ఏనుగు గుర్తుకొచ్చేలా ఉంది. ఎండకి చెమటలు కారుకుంటూ ఆయాసపడిపోతూ నడుస్తోంది.

"ఓ మైడియర్ ఎలిఫెంటా!" అన్నాడు ప్రసాద్ ఆ అమ్మాయి దగ్గరపడగానే.

"మీ యింట్లో డన్‌లప్ పరుపు అవసరం లేదనుకుంటారా గోపీ" అన్నాడు శేఖర్- ఇకిలిస్తూ.

"ఒరేయ్ ఏలిఫెంటా.... రోజూ ఓ గంగాళం అన్నం పెడతా తింటా?" అన్నాడు గోపీ.

"నీప్రాస పర్లేవోయ్! ఆ ప్రయాస చూడు! అరే భూమి గుంటలు పడిపోతుందిరా బాబూ!"

శేషు జోక్‌కి పగలబడి నవ్వారు అందరూ. అనూరాధ కిచ్చిన వాగ్దానం సంగతి గుర్తురాలేదు ఆ సమయంలో.

కాలేజీలో అంటరు చదువుకున్న ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు తిప్పుకుని తలవంచుకుని వెళ్ళిపోయింది వీళ్ళ పీడ ఎప్పుడు విరగడవుతుందో అని ఆమె తిట్టుకున్న తిట్లు.... బాడీగార్డులకి వినిపించవు మరి!!

"ఆ అనూరాధ కూడా ఇలా తలవంచుకుని వెళ్ళిపోతే.... మనం దాని జాకెట్టు గుండీలు ఊడదియ్యాలనుకోంగా?" శేషు నవ్వుతూ అన్నాడు.

అంతలో పుల్లలా నడుచుకుంటూ వచ్చాడు- పోస్టుమాన్ పాపయ్య.

"ప్రసాద్‌బాబూ! ఇదిగో మీకో ఉత్తరం ఉంది. ఇక్కడే తీసుకోండి ఇంటికెందుకు నేను" అని ఇచ్చి వెళ్ళిపోయాడు.

"ఎక్కడినుంచిరా? లవ్‌లెటరా?" శేషు హాస్యం పట్టించాడు.

"పైకి చదవరా! మేంకూడా విని తరిస్తాం" శేఖర్ మేల మాడాడు.

"సెంటర్లో ఎందుకు? ఆ చెట్టుకిందకి పదండిరా అక్క డెవరూ లేరుకూడాను."

నలుగురూ అక్కడికి జేరగానే కవరు చించాడు ప్రసాద్. సుదీర్ఘమైన ఉత్తరం అది మెల్లగా చదవసాగాడు.

"నా ప్రియమైన

ప్రసాద్.... గోపీ.... శేఖర్....శేషుగార్లకి మీ ప్రియమైన అనూరాధ శుభాకాంక్షలు తెలుపుతూ రాయునది :—

"లవ్ లెటర్ రాసిందిరోయ్!" సంబరపడిపోయారు నలుగురూ. "నేను, మాఅమ్మ ఇక్కడ క్షేమంగానే ఉన్నాము. మీరక్కడ క్షేమంగా ఉన్నారుకదూ! ఉత్తరంలో విషయం ఒక్కటే గనక పెద్దవారైన ప్రసాద్‌గారి పేరన మీ నలుగురికీ రాస్తున్నాను.

నలుగురూ జాయింటుగా చదువుకోండి. ఈ ఉత్తరాన్ని.... నేను ఇక్కడకొచ్చిన తరువాత ఎన్నోసార్లు మిమ్మల్నే తలచుకున్నాను". "ఎవడికోసం తలచుకుంటుంది వయసు పోరుపెడుతుంటే! హే!" అన్నాడు శేషు.

".... అలాగే మీరూ నన్ను గుర్తుచేసుకుంటున్నారని అనుకోవటంలో తప్పులేదనుకుంటాను. మీ నా అనుబంధం అలాంటిది."

“ఏస్ మై డార్లింగ్!” [illegible] కొట్టారు

“....నేను మీకు ముఖతః చెప్పలేని విషయం ఇందు పొందుపరుస్తున్నాను.”

అందరిముఖాల్లో ప్రశ్నార్థకం కనిపించింది.

“....నేనుంటున్న ఇంటి ఆవరణ. అక్కడపరిస్థితులు మీకు తెలిసినవేగా. మానాన్న అసలు ఇంటిముఖం చూడకపోవటంతో నా పరిస్థితి చాలా గడ్డుగా తయారయింది. నా శరీరాన్ని.... అంటే నా బాడీని గార్డు చేసుకోవలసి వచ్చింది. అందువల్ల నా శీలాన్ని కాపాడుకోవటం కోసం నావెంట పడుతున్న బాడీ గార్డులనుండి మీ సహాయం కోరాను. మీరు దయతో అంగీకరించి అడిగిందే తడవుగా రంగంలోకి దూకారు. ఆ నలుగురు కీచకులకి బుద్ధిచెప్పారు. అంతవరకూ బాగానే ఉంది. మరి మీరుమాత్రం నన్నడిగింగేమిటి? నా వయసునీ, సొగసునీ మీ నలుగురకి పంచి యివ్వమనేగా! ఎలా యిస్తావనుకున్నారు?”

“అ!! అని అవులించేశారు నలుగురూ.

“....ఆ నలుగురినుంచి నా బాడీ గార్డుచేసిన మిమ్మల్నించి నా బాడీగార్డుచేసుకోవలసిన అవసరం కల్పించారు మీరు. ఇంత చేసిన మిమ్మల్ని ఎదిరిస్తే, కాదంటే నేను మరో సురేఖనవుతాను మన కాలేజీకి. ఆ సంగతి నాకు తెలుసు! ఇలా అవటానికి నేను సురేఖని కాదుగా? అనూరాధని! అందుకే మీకో విడివడని చిక్కు సమస్య పెట్టి తప్పించుకొని ఇలా వచ్చాను.”

“ఓసి నీ దుంపతెగ! ఒరేయ్ శేషూ నిజంగానే ఇదిగుండెలు తీసిన బంటురోయ్” గోపీ బాధగా అన్నాడు.

“తిరిగి రాగానే మీరేం చేస్తారో తెలియని మూర్ఖురాల్ని కాదు నేను. పెళ్ళి చేసుకోటానికి మీ అశక్తత వెలిబుచ్చుతూ నా పొందు విందు చేయమని మర్యాదగా అడుగుతారు. నేను సహజంగా కాదంటాను! అప్పుడు మీరు ఊరుకోరు.... మీరు తరచు చూసిన సినిమాల్లోని రేప్ సీనుని గుర్తుచేసుకుని నామీద దారుణంగా ప్రయోగిస్తారు. మీరు నలుగురు. నేను ఒక్కదాన్ని...! పైగా ఆడదాన్ని! కనుక నేను మీ కబంధహస్తాల్లోంచి బయటపడటం అసంభవం! అయితే. యిక్కడ మీకో చిన్నప్రశ్న

"శీలాన్ని రక్షించుకోవటంకోసం, మీలాంటి బాడీగార్డులతో స్నేహంచేసిన ఆడపిల్ల.... తన శీలం మీకు బలియివ్వవలసిందేనా?" తప్పనిసరిగా ఇవ్వాలి అని మీ సమాధానం "ప్రాణం పోయినా కాదు" అని నా ఉద్దేశం. ఈ మాట మీలో నామీద ఆగ్రహావేశాల్ని రగలిస్తుందనీ శివమెత్తిన యువతరం ప్రతినిధుల్లా మారిపోతారనీ నాకు తెలుసు.

"....నేను మీకు ప్రియమైనదాన్ని, మీరంటే నాకు ఆరాధన అని ఏవో వాగావు కదా! ఇప్పుడిలా ప్లేటు ఫిరాయించావే? అనొచ్చు మీరు...."

....ఆ మాటే అనకపోతే మీరు నాతో మంచిగా ఉండేవారా? నేను కోరిన సహాయం చేసేవారా? నెవర్!!

....ఇప్పటికీ అంటున్నాను నేను మీకు ప్రియమైనదాన్ని అని. ప్రియమైనది అంటే తన శీలాన్ని తానుగా మీబోటివాళ్ళకు అర్పించుకునేది కాదని నా అభిప్రాయం. మగవాళ్ళు ఆడవాళ్ళని పవిత్రమైన భావంతో చూస్తే ఆడది అన్నయ్యా, బాబయ్యా అనే వరసలతో పిలవనే అక్కర్లేదని నా ఉద్దేశం. నేను మాత్రం మిమ్మల్ని స్నేహితులలాగే చూశాను ఎలాంటిచెడుభావమూలేకుండా.

"ఒరేయ్ శేషూ! చూడరా ఇది.... ఎలా నీతులు చెపుతోందో....? అవసరం తీరిపోయాక!" వాపోయాడు గోపి

"అన్నట్టు.... మీకో దుర్వార్త, ఇక్కడికి కొచ్చింతర్వాత నా జీవితం ఓ తియ్యని మలుపు తిరిగింది. నేను మీ దగ్గర్నుంచి వచ్చేముందు ఈ సంగతి తెలుసు నాకు! అప్పుడే చెపితే మీరేమను కునేవారు....? ఏంచేసేవారు నన్ను....? అందుకని చెప్పలేదునేను!

మా పరిస్థితి చూసి జాలిపడి, మా అమ్మ అన్నయ్యగారు నన్ను వాళ్ళబ్బాయికి చేసుకున్నారు. ఇదంతా పెళ్ళికొడుకు పట్టుదల మీదే జరిగింది. నా వివాహం అయి పదిరోజులయింది. పెళ్ళికూతురు ఇంటిదగ్గర జరుగుతుంది ఆడపిల్ల వివాహం సాధారణంగా. అందుకు భిన్నంగా నా పెళ్ళి ఇక్కడ జరగటం గమనార్హం. దానికి కారణం మామీద మా మేనమామగారి సానుభూతి. మా శ్రీవారు చాలా గంభీరంగా ఉంటారు పైకి. వారి మనసుమాత్రం అమృతం. ఏ విషయాన్ని తొందరపాటుగా అపార్థం చేసుకోరు.

ఆయనకి ఈ ఊళ్ళోనే ఉద్యోగం. ప్రకృతి సక్రమంగా విశ్వసిస్తుంటూ, ఇంటిదగ్గర వన్నెంతగానో లాలిస్తుంటారు. ఆ లాలనలో కరిగిపోతుంటాను నేను.

"అరే! శేషూ! కొంప ముంచిందిరోయ్! ఇది ఆడపిల్ల కాదురా! చండీరాణిరా! ఎంత మోసం! ఎంత ధైర్యం!" శేఖర్ ఏడుపు ముఖం పెట్టాడు. దాదాపు నలుగురి పరిస్థితీ అలాగే ఉంది.

"ఏం! అలాఅయిపోయారేం? మీ పట్టణంలో ఐ మీన్ మీతో నా రుణం తీరిపోయింది. నాకెంతో మేలుచేసిన స్నేహితులుగా మీ రెప్పుడూ గుర్తుంటారు నాకు. అయితే ఓ ఉచిత సలహా మీకు! చదువు విషయంలో ఎంతో మార్పు వచ్చింది మీలో. జీవితంలో కూడా మారండి!! ఆడపిల్లల్ని ఏడిపించడం మానెయ్యండి మిగతా విద్యార్థులలాగా మంచివారనిపించుకోండి! ఈ నీతులు, ఈ ధర్మ పన్నాలు మాకక్కర్లేదు! అంటే ఈ స్నేహితురాలు ఏమీ చెయ్యలేదు బాధపడటం తప్ప.

ఆఖరుగా ఓ మాట!

వచ్చే సోమవారం నేను మావారు, మా అమ్మ అక్కడికి వస్తున్నాం. ఆ రోజు రాత్రి సామాన్లు లారీలో వేసుకుని వెళ్ళిపోతాం. వ్యవధి లేకపోవడంవల్ల మీకుగానీ, మా కాంపౌండులోని కీచకులకిగానీ, శుభలేఖలు పంపలేకపోయాను. ఆరోజు సాయంత్రం మా యింటికి రండి. మీరడిగింది ఎలాగూ ఇవ్వలేకపోయాను గనుక, సింపుల్‌గా కాఫీ టిఫినయినా ఇస్తాను.

తప్పక వస్తారు కదూ!

మీ ప్రియమైనదాన్నికదా!
సంతకం ఎందుకూ?

× × × ×

ఆ ఉత్తరం చదవటం పూర్తికాగానే కొయ్యబారిపోయారు నలుగురూ.

దంబాలు పలికిన శేషు ముఖం మరీ నల్లగా మాడిపోయింది.

"ఆఫ్ట్రాల్! ఒక ఆడపిల్ల, ఓ కాలేజీ అమ్మాయి చేతిలో, జగజ్జెట్టీలలాంటి మనం నలుగురం చావుదెబ్బ తింటమా? నో....! డామ్ ఇన్సల్ట్! పిడికిలి బిగించి అరచేతితో కొట్టాడు శేషు.

"ఇంకా ఇప్పుడేం చెయ్యగలం? దాని పెళ్ళికూడా అయి పోయిందిగా!"

ఉసూరుమన్నాడు ప్రసాద్.

శేషు ఏదో ఆలోచిస్తున్నాడు.

పెళ్ళయిన ఆడదాని జోలికి పోవటం క్షేమం కాదుగురూ!" అన్నాడు గోపీ నీరసంగా.

"నలుగురూ మననే దుయ్యబడతారు. సోషల్ సపోర్టు ఉండదు" శేఖర్ విరాళపడిపోయాడు.

"షటప్ ఇడియట్స్!- కోపంగా అన్నాడు శేషు - "అది మనకి చేసినఅవమానానికి గాజులుతొడిగించుకు కూర్చుంటారట్రా! సిగ్గులేదూ మీ మొహాలకి".

"మరేం చేద్దాంగురూ?" ఆశ్చర్యంగా చూశారు.

"ఏట్టాగూ కాఫీకి రమ్మందిగా? వెడదాం పదండి!" సాలో చనగా అన్నాడు శేషు.

"వెళ్ళి!"

"మీరు చూస్తూ ఉండండి. నేను దాని మొగుడు ఏ మెతక సన్నాసో అయ్యుంటాడు మన దెబ్బకి దానిమీద అనుమానం క్షణాల్లో పుడుతుంది వాడికి. అక్కడ వదిలేస్తాడు దాన్ని. అప్పుడు చూపిద్దాం మన తడాఖా!" శేషు కాలరెత్తాడు.

మిగతా ముగ్గురూ ఏదో అనబోయారు. 'నోరు ముయ్యండి' అన్నాడు శేషు వాళ్ళని.

* * * *

సోమవారం సాయంత్రం టిప్‌టాప్‌గా తయారయ్యి, శేషు నాయకత్వంలో.... అనూరాధ ఇంటికి బయలుదేరారు బాడీగార్డులు.

వాకిట్లో వాళ్ళని చూస్తూనే "రండి! రండి! మీకోసమే ఎదురుచూస్తున్నాను" అంటూ సాదరంగా ఆహ్వానించింది. అనూ రాధ. పెళ్ళయిన తర్వాత ఆమె అందం మరింతగా మెరిసిపోవటం గమనించారు నలుగురు రోమియోలు వాళ్ళమనసు మరింత భగ్గుమంది

చిరునవ్వుతో "కూర్చోండి" అంటూ . . పక్కింటివాళ్ళింట్లో నుంచి తెచ్చివేసిన కుర్చీలు చూపించింది. నలుగురూ కూర్చున్నారు

యాంత్రికంగా. మనసులో ఏగ... ... ...

"ఇంతకుముందే ఈశ్వరయ్యగారు.... రామలింగంగారు.... సుందరయ్యగారు. కామేశంగారు... వచ్చివెళ్ళారు ఫామిలీస్‌తో.... మీరొస్తారో.. రారో....? అని.... తెగ 'వర్రీ' అవుతున్నాను. వచ్చారు. అయామ్ వెరీ హాపీ! ఒక్కనిముషం కూర్చోండి. కాఫీ టిఫిన్ తెస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది.

"తీసుకురా! నీ భరతంపడతా తిన్న తర్వాత" కసిగా అనుకున్నాడు శేషు.

అయిదు నిమిషాల్లో తిరిగివచ్చి అందరికీ కాఫీ టిఫెన్లు స్వయంగా అందించింది అనూరాధ. నలుగురూ కొరకొరా చూస్తున్నారు ఆమెవేపు. అప్పనంగా తాము అనుభవించాల్సిన ఈ అందాన్ని మరోవెధవ పాలుజేసింది కదూ అని వారి మనసులోనిదుగ్ధ.

"మీవారిని పరిచయం చెయ్యండి చూస్తాం" అన్నారు. చూస్తాంఅన్న మాటని నొక్కి పలుకుతూ.

"ఓ! విత్ ప్లెజర్" నవ్వుగా నవ్వుతూ లోనికెళ్ళింది అనూరాధ.

"వాడొట్టి మఫ్ అయి ఉంటాడురా చూడండి" శేషు గుస గుసగా అన్నాడు మిత్రబృందంతో.

"అంతేనంటావా!" అన్నారు వాళ్ళు.

"బెట్ కడతాను. వాడుత్త లోఫర్ అయిఉంటాడు అని. లేకపోతే ఈ రౌడీరాణి ఆటలు ఎలా సాగుతాయి!" నెమ్మదిగా అన్నాడు శేషు! లోపల్నుంచి అనూరాధ భర్తతో వచ్చేసరికి ఏమీ ఎరగనట్టుగా కూర్చుని టిఫిన్ తింటున్నారు బాడీగార్డులు నలు గురూ

"ఆ! చూడండి! వీరే మావారు....నైస్‌గా పోలీస్ డిపార్టు మెంటులో సబిన్స్పెక్టరుగా పని చేస్తున్నారు అని పరిచయం చేసిన అనూరాధ భర్తకేసి తిరిగి, నేను మీకు తరచుగా చెపుతుంటాను చూడండి.... వీళ్ళగురించేనండీ!" అంది మందహాసం చిందిస్తూ.

"గ్లాడ్టూ మీట్ యూ" చిరునవ్వుతో చెయ్యి ముందుకు చాచారు ఎస్. ఐ. గారు అదే. అనూరాధ శ్రీవారు.

"అంతే!! మరుక్షణంలో నలుగురు బాడీగార్డులూ, ఎలి

యూస్, రోమియోలు, చిన్నచిన్న రివ్వు్ంగ్ రేసే తీసి, అమ్మో అంటూ వీధిలోపడి రొప్పుతూ, రోజుతూ పరుస్తున్నారు.

"ఏమిటి అనూ? ఎందుకలా పారిపోయారు వాళ్ళు?"

"ఆడపిల్లలు ఏడిపిస్తారేమోనని...." అంటూ కిలకిలా నవ్వుతూ శ్రీవారి గుండెలమీద వాలిపోయింది అనూరాధ.

• • • •

ఆరోజునుంచీ ప్రసాద్, శేఖర్, శేషు, గోపీ ఆడపిల్లల్ని అంటే కాలేజీ అమ్మాయిల్ని ఇళ్ళదగ్గర అల్లరి పెట్టినట్టు రిపోర్టు లేదు. (శలవులుగామరి!)

వాళ్ళకి బాడీగార్డులన్న పేరు పోయింది. వారిలో కనుపించిన మార్పు చూసి. తోటి విద్యార్థులంతా సంతోషించి, తమ జట్టులో కలుపుకున్నారు

పరీక్షా ఫలితాలు తెలిశాయి.

అనూరాధ ఫస్టు క్లాసులో పాసయ్యింది (మార్కులుచూస్తే డిస్టింక్షన్ ష్యూర్‌గా వచ్చి ఉంటుంది) సుధారాణి, ఆశాలత థ మామూలుగా పాసయ్యారు.

చిత్రం! అందరూ తప్పుతారనుకున్న నలుగురు బాడీ గార్డులూ సెకండు క్లాసులో పా....స....య్యా....రు.

—: సమాప్తం :—

## అంకితం

కాలేజీల్లో ప్రసాద్, గోపీ, శేఖర్, శేషులాంటి బాడీ గార్డులు లేక రోమియోలు అతి కొద్దిమందే ఉండొచ్చు! సమాజంలో ఈశ్వరయ్య, సుందరయ్య, రామలింగం, కామేశం లాంటివాళ్ళు కొంతమందే ఉండొచ్చు! కానీ వీరిలో ఏ ఒక్కరి విషపుగాలి తగిలినా చాలు! అనూరాధ లాంటి అందమైన, పొందికైన కాలేజీ అమ్మాయి జీవితం కాలిపోతుంది.

అలా కాకూడదనే ఆకాంక్షతో, ఆవేదనతో, అనూ రాధలాంటి కాలేజీఅమ్మాయిలకి సవల ప్రేమతో అంకితం.

— రచయిత్రి.

# ఈ పాపకి దిక్కెవ్వరు?

సెంట్రల్ జైల్లోని గడియారం గుండెలమీద సమ్మెట దెబ్బల్లా నాలుగోగంట కొట్టింది. ఆకాశం ప్రళయ భయంకరంగా గర్జించింది. భూమి దద్దరిల్లిపోయేలా ఎక్కడో పిడుగుపడింది. ఆ ప్రతిధ్వనికి పక్కలోని పసిపాప కెవ్వుమని అరచింది. నేను త్రుళ్ళిపడి నిద్రలేచాను. నాల్గోగంట ప్రతిధ్వని నా శ్రవణేంద్రియాలల్లో యింకా మార్మోగుతూనే వుంది.

అవి గంటల శబ్దంకాదు. మృత్యువు పిలుపు. జీవన సంధ్యారాగంలో వున్న ప్రతిప్రాణిని మృత్యువు యిలాగే వెన్నుతట్టి పిలుస్తుంది, కాబోలు. తల్లిగర్భం చీల్చుకొని భూమిమీద పడ్డనాటి నుండి ఎన్నో కష్టాలు, కన్నీళ్ళను దిగమ్రింగి నడచినడచి అలసిపోయి నాలాగా విశ్రమించే ప్రతిజీవికి మృత్యువు ఆహ్వానం, సంకేతం.

మరో రెండు గంటల్లో నన్ను వురితీస్తారు. నేను ఎవర్ని? నన్నెందుకు వురితీస్తున్నారు? నేను చేసిన పాపం అపరాధం ఏమిటి? అనికదా మీ ప్రశ్న. చెబుతాను నా ఆత్మకథ మీకు అంతా చెబుతాను. యీ నా ఆఖరిఘడియల్లో కన్నీటి నాకథ మీకు వినిపించకపోతే నాకు ఆత్మశాంతి వుండదు పోలీసులు సాక్షులు న్యాయం చట్టం నన్ను బోనులో నిలబెట్టి నువ్వు హంతకురాలివి, హంతకురాలివి అని బల్లగుద్ది అరచిన అరుపులు, వేసిన శిక్ష మీకు ఎవరు చెబుతారు ఎలా తెలుస్తుంది!

చెబుతాను, ఒక్కక్షణం ఆగండి. పసిపాప ఏడుస్తుంది. గుక్కెడు పాలిచ్చి జోలపాడి నిద్రపుచ్చి మీకు నా ఆత్మకథ వినిపిస్తాను. యీ రాత్రి సామాన్యమైనది కాదు. ఒక అభాగ్యురాలి ఆత్మను, శరీరాన్ని వేరుచేస్తున్న వేకువ; యీ శరీరాన్ని యింత కాలం అంటిపెట్టుకొని వున్న ప్రాణవాయువు, మరో రెండు గంటల్లో యీ అనంతమైన వాయుమండలంలో కలసిపోతుంది. అది కలసిపోయాక దిక్కులేని యీ శరీరాన్ని మోసుకవెళ్ళే నాలు

---

కొడాలి గోపాలరావు

తలు దాడుతూ ఉవ్వెత్తున లేచే అగ్నిలోనో, లోతుగా త్రియబడిన గోతులోనో పారవేసిపోతారు. అలా పారేసిపోయాక నా అనవాలు కూడా మీకు లభించదు. నాకంటే ముందు ఉరితీయబడ్డవాళ్ళు వున్నారు, వురితీయబడ్డ రోజు జైలు రికార్డులో భద్రంగానే వుంటుంది. ఆ రికార్డులో నా ఆత్మకథమాత్రం మీకు దొరకదు. అందుకే మీకు చెబుతున్నాను.

ఆకాశం ఘర్జిస్తున్నా, పిడుగులు పడుతున్నా, భూదేవి రోదిస్తున్నా జైల్లో హాయిగా నిద్రపోతున్నారు ఖైదీలు. సెంట్రీలు మాత్రం నిద్రకళ్ళతో తూగుతూ, తుపాకి పట్టుకొని నిలబడి వున్నారు చెట్లమీద పక్షులు గాలి తాకిడికి నిట్టుకోలేక అరుస్తున్నాయ్ హోరుమంటూ వీచేగాలి వీస్తూనేవుంది ఆ గాలికి చెట్ల కొమ్మలు విరిగి పడుతున్నాయ్. యింతగా యీ ప్రకృతి ఎందుకు క్షోభిస్తుందో నాకు తెలియదు నాకు తెలిసింది, విన్నది ఒక్కటే. నాకు కోర్టులో న్యాయం మాత్రం జరగలేదు. నిరపరాధినైన నన్ను ఉరితీయవద్దని, నేను నిర్దోషినని తెలియచెప్పటానికే యింతగా ప్రళయ ప్రభంజనం వీస్తుందనుకొంటాను.

కాల ప్రవాహాన్ని ఎవ్వరం ఆపలేము. సృష్టి మొదలై నప్పటినుండి దివారాత్రులు కాలచక్రం తిరుగుతూనే వుంది యీ చెరాచెర ప్రపంచంలోని ప్రాణికోటిలో నేనొక అణువును. ఒక కన్నీటి బిందువును యీ బిందువు గాలిలో ఆరిపోతుంది. ఆరిపోయాక నన్ను గురించి చెప్పేవారెవ్వరు?

నా కథ మీకు వినిపించటంలో ఏదో అంతరార్థం వుందని మీరు వూహిస్తారు. మీ వూహ నిజమైనదే. నాకున్న స్వార్థం ఒక్కటే యీ పసిపాపను ఏంచేయాలి? ఎవరికి అప్పగించాలి? నా అన్నవాళ్ళు నాకెందరో వున్నారుకానీ వాళ్ళ దృష్టిలో నేను లేను. నేను జైలుకొచ్చి యిప్పటికి తొమ్మిది మాసాలైంది. యీ తొమ్మిది మాసాల్లో నన్ను మావాళ్ళు పూర్తిగా మరచిపోయారు. మరచిపోక ఏంచేస్తారు? నేను హంతకురాలిని. హంతకురాలినేకాదు చెడిపోయిన దాన్ని పతితను. వివాహం కాకముందే బిడ్డను కన్నాను. యీ బిడ్డ నావల్ల పుట్టింది. మా పవిత్ర ప్రేమకు చిహ్నంగా పుట్టింది. మా అనురాగానికి అనవాలుగా పుట్టిన యీ బిడ్డను నా కన్నబిడ్డ అని చెప్పగల తండ్రి ఏడి, ఎక్కడున్నాడు?

పురాణ కథలోని కుంతీదేవి నాలాగే కన్యగా వున్నప్పుడు

బిడ్డను కన్నది ఆ బిడ్డను ఎలా కన్నది ఎవరివల్ల కన్నది ఆ బిడ్డ పుట్టుకలోవున్న జీవితరహస్యం ఏమిటని నేను చెప్పబోవటంలేదు. యుగయుగాలనుండి ఎందరో స్త్రీలు పెండ్లి కాకముందే బిడ్డనుకన్న వాళ్లూ వున్నారు. కానీ నాలాగా జైల్లో కన్నవాళ్ళు ఎవరో మీకు తెలుసు. సంఘానికి భయపడి గంగలో కలిపారో గొంతు నులిపి చంపారో నడిరోడ్లో విడిచివెళ్ళారో డస్ట్ బిన్ లో పారవేసిపోయారో చెప్పటం కష్టం. యిదంతా సంఘానికి భయపడిమాత్రమే, సంఘ మంటే మీకు తెలియనిదికాదు అది వెయ్యినాలుకల కాలసర్పం విషానలం ఎగజిమ్మి నిలువునా మాడ్చివేయగల కాలాగ్ని అడది తరతరాలనుండి సంఘానికి బానిసగా పుట్టింది, పెరిగింది. నానా చెరలు అనుభవించింది. ఆ అనుభవాలను వ్రాయగల మహాకవు లుంటే అది భారత రామాయణాలకన్న గొప్ప మహాకావ్యాలే కాగలవు. ఆడవాళ్ళనుగురించి వారి కన్నీటి కథలనుగురించి జాలి పడి వ్రాయగల కవులెవ్వరు? నా బిడ్డను జైల్లోనే విడచిపెట్టి ఉరి కంబానికి వెళ్ళాలి వెళ్లే సమయంకూడా దగ్గర స్తూన్నేవుంది. వెళ్ళే ముందు నేను నెరవేర్చవలసిన బాధ్యతలు రెండే నామీద వున్నాయ్. ఒకటి యీ పసిపాపను సురక్షితమైన ప్రదేశంలోకి చేర్చడం. రెండవది మీకు నా ఆత్మకథ చెప్పడం. చెప్పేంతవరకు జైలు అధికార్లు నాకు వ్యవధి ఇవ్వకపోవచ్చు మరికొంతసేపటికి వన్ను వచ్చి పిలువవచ్చు నా బిడ్డను నానుండి బలవంతంగా వేరుచేయ వచ్చు. నేను కన్నీరుపెట్టినా నాబిడ్డ ఏడ్చినా వారు కనికరించరు, వినిపించుకోరు అది వాళ్ళధర్మం జైలుడాక్టర్లు నా ఆరోగ్యం ఎలా వుందో పరీక్షిస్తాడట నన్ను ఉరికంబానికి తీసుకొనివెళ్ళిన అధికారి నీ ఆఖరికోరిక ఏమిటని అడుగుతాడట నా ఆఖరికోరిక యిది అని చెప్పాలి నేను చెబుతాను. నేను ఎవ్వరివలన గర్భవతినయ్యానో వారికే యీ బిడ్డను అప్పగించమని చెప్పాలా. ఏ అనాధ ఆశ్ర మంలో విడిచిపెట్టమని చెప్పాలా? ఏమని చెప్పాలి. నా కడపటి కోరిక ఏమిటో అదే చెప్పాలి.

కొందరికి ప్రాణం ఎందుకు పోతుందో ఎప్పుడు పోతుందో తెలియదు నాలాంటి అపరాధులకు ఎప్పుడు పోతుందో ఎన్నిగంట లకు పోతుందో తెలుస్తుంది. అదీ నాకు తెలిసింది. జైలధికారి

కోర్టువారి ఆర్డరు పట్టుకొచ్చి నాకు చదివి వినిపించాడు. ఫలానా రోజు ఇన్నిగంటలు ఇన్ని నిమిషాలకు నిన్ను వురి తీస్తున్నాం. యీ నాలుగు ఘడియలూ సంతోషంగా వుండు. గుండె నిబ్బరం చేసుకో. దైవాన్ని ప్రార్థించు బంధుమిత్రులకు కబురుపెట్టు. ఆఖరు సారి వారిని చూడాలంటే చూడు నువ్వు ఏమైనా చెప్పదలచుకోవాలంటే చెప్పు. వారినుంచి కడపటివీడ్కోలు అందుకో. నువ్వేమైనా వీలునామా వ్రాస్తే అది ఎవరికి అందజేయాలో చెప్పు. నీకు అత్యంత సన్నిహితులు, ఆప్యాయులు వుంటే వారికి యీ బిడ్డను అప్పగించు, అప్పగించి ప్రశాంతంగా రానున్న మృత్యుఘడియల కోసం ఎదురు చూడు అని చెప్పి వెళ్ళారు అలా చెప్పి వెళ్ళినప్పటినుంచి నాలో చలనం ప్రారంభమైనది. భయం దుఃఖం నన్ను పట్టి పీడిస్తున్నాయ్. ఆపుకొందామన్నా కన్నీరు ఆగటం లేదు. ఈ సూక్ష్మ శరీరంలో మహాసముద్రం లాంటిది ఎలా దాగి వున్నదో నాకు తెలియదు.

పసివాడు పాలు తాగుతున్నాడు. వారివంక కళ్ళు విప్పుకొని జాలిగా చూస్తున్నాడు. కన్నీటితో చూడాలన్నా కళ్ళు కనిపించటం లేదు, పమిట కొంగుతో కన్నీరు తుడిచి తుడిచి చెయ్యి నొప్పి పుడుతుంది ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రబడిపోయాయి. ఎంతో ముద్దుగా ఆఖరిసారి తనివితీరా బిడ్డను చూడాలంటే నాకు బిడ్డ కనిపించటం లేదు. కానీ నాకు ఉరికంబమే కనిపిస్తుంది. నన్ను ఉరి తీశాక నా బిడ్డ గతేమిటో కనిపించటంలేదు. వాడు ఎవ్వరి దగ్గర పెరుగుతాడు ఎవ్వరు పెంచుకొంటారు పెంచేవాళ్ళు ఏరీ? అదే కనిపించటం లేదు.

పిల్లవాడు పాలు త్రాగడం మానివేసి చిగురాకుల్లాంటి చిన్ని చేతులతో నా ముఖాన్ని తడిముతున్నాడు నా కన్నీటిని తుడుస్తున్నాడు. నీలాలవంటి కళ్ళతో నా వంక చూసి "అమ్మా ఎందుకమ్మా ఏడుస్తావ్? మా ఋణానుబంధం యింతటిదే నన్ను కన్నానని ఏడుస్తున్నావా, చచ్చిపోతానని ఏడుస్తున్నావా? నేను ఎలా బ్రతుకుతానని ఏడుస్తున్నావా? వద్దమ్మా. ఏడ్వవద్దు మనిద్దరిమధ్య ఇంకా కొన్నిఘడియలుమాత్రమే వున్నాయ్. ఈ వున్న నాల్గుఘడియలన్నా కమ్మగా జోలపాటపాడు కలకలా నవ్వు! ఆ నవ్వులలో నన్ను హాయిగా నిద్రపుచ్చి నేను నిద్రపోయాక నువ్వు వెళ్ళిపోతావ్. ఇక ఎన్నటికీ తిరిగిరావు రానని నీకూ నాకూ

తెలుసు అన్నీ తెలిసిన నువ్వూ నేనూ యీ అంతిమక్షణాల్ని వ్యర్థంచేయటం మంచిదికాదు" అని నాబాబు నాకేదో ఉపదేశం చేస్తున్నట్టే, ఓదార్చుతున్నటే వుంది. కానీ నామనస్సుకు ఆ ఓర్పు లేదు, అంతటి స్థిరమైన మనోనిబ్బరం మనఃశాంతి లేదు. భగవంతుడా! యీ పసివాణ్ణి నాకెందుకిచ్చావ్. ఎందుకు నానుండి వాడిని వేరుచేస్తున్నావని తలబాదుకొని ఏడ్చాను. ఇంకా ఏడ్చి యేడ్చి నాకాలాన్ని వ్యర్థంచేయను. నా ఆత్మకథ వినిపిస్తాను.

నాకు పద్దెనిమిది సంవత్సరాలు వచ్చేవరకు ఆకుచాటున మొగ్గలా తల్లిదండ్రులవద్ద పెరిగాను. చిన్నప్పుడు నే నెంతో చురుగ్గా వుండేదాన్ని. ప్రతివిషయంలోనూ నేను చురుకైనదానినని, తెలివైనదానినని అందరూ పొగిడేవారు. నేను నాతల్లిదండ్రులకు ఒక్కగానొక్క బిడ్డను. నాతరువాత మా అమ్మకు సంతానం కలుగలేదు. కలక్కపోవడానికి నేనే కారణం. నేను తొలికాన్పుతో పుట్టిన పిల్లను ప్రసవించే సమయంలో నేను ప్రేవుల్లో చిక్కుపడ్డానట. మాఅమ్మ ప్రసవించలేకపోయిందట. అమ్మకు ఆపరేషన్ చేసి నన్ను బైటికితీశారట. ఆ తరువాతనుంచి మాఅమ్మకుసంతానం కలుగలేదు. నాతల్లిదండ్రులకు నేనే కొడుకునూ కూతుర్నీ అందుచేతే నన్ను ఎంతో అల్లారుముద్దుగా పెంచి పెద్దచేశారు.

నేను బి యస్‌సి చదువుతున్నప్పుడు మురళితో పరిచయం ఏర్పడింది. మురళి చాలా సాత్వికుడు. మంచి సంస్కారంకలవాడు. అతనంటే కాలేజీలో విద్యార్థులకు విద్యార్థినీలకు ఎంతో గౌరవాభిమానం. ఒకరిజోలికి వచ్చేవాడుకాదు ఒకర్ని తూలనాడి మాట్లాడేవాడు కాదు ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ అందరినీ కులాసాగా పలకరించేవాడు అన్నిసబ్జక్టుల్లోనూ మా ఇద్దరికీ ఫస్టుమార్కులు, ఫస్టుక్లాసులో మా ఇద్దరిపేరే వినిపిస్తుండేది మాకాలేజీ లెక్చరర్స్ ప్రిన్సిపాల్, ప్రతి విద్యార్థినీ విద్యార్థులకు నన్నూ మురళినీ ఆదర్శంగా చూపేవాడు.

మురళి చదువులోనే కాదు. చక్కటి అందగాడు. ప్రబంధ కవులు వర్ణించినట్లుగా అతను నలుడో నలకూబరుడో జయంతుడో వసంతుడో నేను వర్ణించి చెప్పలేను. గుండ్రని ముఖవర్చస్సు చక్కని కళ్ళు నొక్కులుతిరిగిన క్రాపు. అతని ముఖానికి గోల్డు

ఫ్రేంతోవున్న కళ్ళజోడు ఎంతో అందంగా కనిపించేది. కాలేజీ విడిచిపెడితే, లైబ్రరీ మూసివేస్తే, తనగదికి వెళ్ళేవాడు. అందరి విద్యార్థుల్లా ఆడపిల్లలవెంట పడటం, తాగటంకానీ తిట్లు తినడం కానీ అతనికి అలవాటులేదు. కాలేజీవిద్యార్థినీలు మురళీనే ప్రేమించే వారు. వెంటబడి పలుకరించేవారు. రహస్యంగా ప్రేమలేఖలువ్రాసే వారు. ఎన్నిచేసినా చలించేవాడుకాదు. అందుకని అతను నపుంసకు డని. అప్రయోజకుడని ఎన్నో పేర్లుపెట్టి పిలిచేవారు. ఎవరు ఎన్ని చేసినా నవ్వుకుంటూ వెళ్ళేవాడు కానీ సమాధానం చెప్పేవాడు కాదు.

మురళికి నేనంటే ఎంతో ఇష్టం. కాలేజీలో మురళికి సమ వుజ్జీగా నేనొక్కదాన్నే వుండేదాన్ని. స్పోర్ట్సులోనూ కల్చరల్ ప్రోగ్రాంలోనూ,వ్యాసరచన పోటీలోనూ, సాహిత్య విమర్శల్లోనూ కాలేజీ కమిటీ ఎన్నికలలోనూ, విద్యార్థి యూనియన్‌లోనూ విద్యా ర్థుల తరపున అతను ప్రెసిడెంటుగా ఎన్నికయితే, విద్యార్థినీల తరపున సెక్రటరిగా నేను ఎన్నికయ్యేదాన్ని. మా యిద్దరి కల యిక చూసి ఓర్వలేనివాళ్ళు ఓ నలుగురు వున్నారు. ముకుందం, నరసింహం, డేవిడ్, నరహరి. ఆ నల్గురికీ చదువుతోకానీ డిగ్రీ లతోకాని పనిలేదు. సాయంత్రం అయ్యేసరికి ఏ బార్‌కో వెళ్ళి తాగటం క్యాబరే డ్యాన్సులకు వెళ్ళటం సెక్సుపుస్తకాలు పఠిం చటం, మేగజైనులు కొని వాటిని పాఠ్యగ్రంధాలుగా పఠించి బట్టీ పెట్టి చదవటం. ఆడపిల్లల వెంటబడి అల్లరిచేయటం ప్రిన్సిపాల్ చేత చివాట్లు తినడం వాళ్ళ దినచర్య.

మురళీ నేనూ కలసితిరగటం కాలేజీలో చాలామందికి అసూయగానే వుండేది అందులో మనోరమ ఒకటి వన్నెల విసనకర్ర అది. మురళిమీద మనస్సుపెట్టుకొని ఎన్నోసార్లు ప్రయత్నించి ఓడిపోయిన సంఘటనలు కోకొల్లలు మా ఇద్దరిపై కధలు అల్లినవాళ్ళున్నారు, గోడలపై బొమ్మలు వికృతంగా గీసిన వాళ్ళూ వున్నారు. మే మిద్దరం బాగా తిరుగుతున్నామని పుకార్లు పుట్టినవాళ్ళు వున్నారు. మా ఇద్దర్నీ చూడగనే ప్రబంధ నాయకీ నాయకులొస్తున్నారని పేర్లుపెట్టి పిలిచి గోలచేసేవారు. అలాంటి వాటిని మేం పట్టించుకొనేవాళ్ళం కాము.

ఒకసారి లైబ్రరీనుంచి నేను వస్తుంటే ముకుందం, డేవిడ్. నరసింహం, నరహరి నా వెంటపడ్డారు ముకుందంవచ్చి నా పవిట చెంగు పట్టుకొన్నాడు. కాలి చెప్పువిడిచి కొట్టాను. పదిమంది

చేరటంతో వారు తేలుకుట్టిన దొంగల్లా పారిపోయారు.

తెల్లవారి నేను ప్రిన్సిపాల్‌కు రిపోర్టు చేయగా ప్రిన్సిపాల్ వారిని పిలిచి చివాట్లు పెట్టి వారంరోజులుకూడా తిరక్కముందే వాళ్ళు కాలేజీలో చేరారు. అది ఎవ్వరి షణ్యామో చెబితే మీరు ఆశ్చర్యపోతారు. వారు మా కాలేజీ వైస్‌ఛేర్మన్ రంగనాధంగారు పట్టుపట్టి చేర్పించారు. రంగనాధం సామాన్యుడు కాదు. మహా అవకాశ రాజకీయవేత్త, దురాశాపరుడు. డబ్బుకోసం సీటుకోసం ఎంత అవినీతి కార్యం అయినా చేయగల సమర్థుడు - విద్యార్థులకు పరీక్ష పేపర్లు అమ్మి బోలెడు డబ్బు సంపాదించాడు. ఆ డబ్బు సంపాదించటానికి యీ నలుగురూ తోడ్పడేవాళ్ళు. ఓ సారి పరీక్షలలో పేపర్లు అమ్ముతుంటే మేం పట్టుకున్నాం. విద్యార్థులందరూ యీ అవినీతికి సంజాయిషీ చెప్పుకోమని కాలేజీ కమిటీ మీద తిరుగుబాటు చేశారు. చివరకు ఎటూ వీలుపడక రంగనాధం గ్రూపు క్షమాపణ చెప్పుకొని బైటపడ్డారు.

మురళీ నేనూ కలసి ప్రతిరోజూ ఏ సినిమాకో, పార్కుకో వెళ్ళేవాళ్ళం. ఒక్కోరోజు ఇద్దరం హోటల్లో భోంచేసేవాళ్ళం. ఓరోజు సినిమాకు వెళ్ళి, తిరిగి వస్తుండగా వర్షం పట్టుకొంది. ఎలాగో హోటలుకువెళ్ళి భోంచేశాం. వర్షం ఇంకా తగ్గలేదు సరి కదా ఇంకా ఎక్కువయ్యే సూచనలు కనిపిస్తున్నాయ్, ఎలాగైనా ధైర్యంచేసి వెళ్ళాలనుకున్నాం. రోడ్లు అన్నీ నీటితో నిండిపోవటం వలన రిక్షాలు, ఆటోలు, టాక్సీలు తిరగటంలేదు. కరెంటుపోయిన కారణంగా రోడ్డుమీద దీపాలులేవు. గాఢాంధకారంలోపట్నంమునిగి పోయింది.

ఆ హోటలు యజమాని మేం వర్షంలో తడవటం చూసి జాలిపడి సర్వర్‌ను పిలిచి మాకో గది చూపించమన్నాడు. మురళి నా వంక చూశాడు, అప్పుడు అతని ఉద్దేశం గ్రహించాను అలా ఉండటం నాకు యిష్టంలేకపోయినా, ఆ హోటలు యజమాని బలవంతం వలన మురళితోటి గదిలోకి వెళ్ళాను. ఆ గదిలోకూడా లైట్లు లేవ్. క్రొవ్వువొత్తులుమాత్రం వెలిగుతున్నాయ్ ఆగదంతా పరీక్షగా చూశాను. ఒక బెడ్డు, ఒక డ్రస్సింగ్‌టేబులు, ఓ ఫాను మాత్రమే వున్నాయి. గది చూపిన హోటల్ సర్వర్ వెళ్ళిపోయాడు. అక్కడ

నేనూ మురళీ మాత్రమే మిగిలిపోయాం. మురళీ తలుపు దగ్గరగా వేసి డ్రస్సింగ్ టేబిల్ దగ్గరగావున్న కుర్చీలో కూర్చున్నాడు. నేను అలానే నుంచుండిపోయాను మురళీ నా వంకచూసి కూర్చోమని చెప్పాడు. ముందు సందేహించినా కూర్చోక తప్పలేదు. మంచం మీద కూర్చున్నాను.

మా ఇద్దరికీ ఇంకా పెళ్ళికాలేదు. నిండుయవ్వనంలో ఉన్నాం. ఒకే గదిలో ఎలాపడుకోవటం. పోనీ ఇంటికివెళ్ళిపోదామంటే బయట ఉరుములు, మెరుములు. ప్రచండమైన తుఫానుతో భూమి దద్దరిల్లి పోతుంది. యీరాత్రికి ఇంటికి వెళ్ళే అదృష్టంలేదు. నేను దుప్పటి, దిండూ తీసుకొని నేలపై పడుకొన్నాను. మురళీ అలాగే కూర్చొన్నాడు. చూసిచూసి నాకు విసుగుపుట్టింది.

"పడుకోరాదూ" అన్నాను మురళీవంక విచిత్రంగాచూసి "ఎక్కడ ? అన్నాడు. నాకు అర్థంకాలేదు. ఓక్షణం ఆలోచించాక అతని మనస్సులోని కోరిక ఏమిటో అర్థమయింది. నేను పలానా చోటు అనిచెప్పేవరకూ అతను పడుకొనేలా లేదు. మురళిని చూస్తుంటే జాలివేసింది.

"మీఇష్టం" అన్నాను మెల్లిగా. మురళీ ఓక్షణం తరువాత మెల్లిగా లేచివచ్చి మంచంమీద కూర్చున్నాడు. నాకు నిద్రమాత్రం ముంచుకొస్తుంది కళ్ళు మూతలుపడిపోతున్నాయ్. మురళీ పడుకొన్నాడో, అలాగే కూర్చొని కునికిపాట్లు పడుతున్నాడో తెలియదు నాకు తిన్నగా నేను నిద్రలోకి జారిపోయాను.

భూమి ఆకాశం ఒకటయ్యేంత శబ్దంతో ఎక్కడో పిడుగుపడింది తృళ్ళిపడిలేచాను. అప్పటికి అర్ధరాత్రి అయివుంటుంది. క్రొవ్వొత్తులు కాలిపోయి ఆరిపోయాయి. ఎటుచూసినా కన్ను పొడుచుకొన్నా కనిపించని కటికచీకటి కిటికిల్లోంచి ఆకాశంవైపు చూశాను. నల్లని మేఘాలపై మెరుపుతీగెలు కళ్ళు చెదిరేలా కాంతి పుంజాలు విరజిమ్ముతూ చెల్లాచెదురుగా పరిగెడుతున్నాయ్ ఆ వెలుగులో మురళీవైపు చూశాను. మురళీ మంచంమీద లేదు. గదిఅంతా చూశాను కనిపించలేదు. ఏమైనట్లు, ఎక్కడికెళ్ళాడు ? నాకు అర్థం కాలేదు. ఎంతోసేపు అతన్నిగురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. నిద్ర రావటంలేదు. వర్షం తగ్గటంలేదు. మురళీ ఎక్కడికివెళ్ళాడో తెలియదు. చల్లగాలి శరీరాన్ని తాకుతుంది. గుండెల్లోనుండి చలి పెల్లుబుకుతూ వుంది. శరీరమంతా గడగడ వణకిపోతుంది. భయం

కరమైన ఆరాత్రి ఎప్పుడు తెల్లవారుతుంది? ఎలా తెల్లవారుతుంది? నన్ను ఒంటరిగా చీకటిగదిలో వుంచి మురళి ఎక్కడికెళ్ళాడు? అసలు వస్తాడారాడా? ఆలోచిస్తూ ద్వారంవైపుచూస్తూకూర్చొన్నాను.

కొంతసేపటికి మురళి వచ్చాడు. అతని కళ్ళు నిద్రలేక పోవటం వలన ఎర్రగా జ్యోతుల్లా మెరిసిపోతున్నాయ్. క్రాపు బాగా చెదిరిపోయింది. మురళి మళ్ళీ రెండు క్రొవ్వొత్తులు తెచ్చాడు అగ్గిపుల్ల గీసి వాటిని వెలిగించాడు. గదంతా ఆ చిన్న వెలుగుతో నిండిపోయింది. బైటనుండి రివ్వున గాలివీస్తుంది! మురళి వెళ్ళి కిటికీతలుపులు మూసివేసివచ్చి ప్రక్కమీదకూర్చొన్నాడు యీ చీకటిని పారద్రోలేందుకు వెలుగును నింపేందుకు క్రొవ్వొత్తుల కోసం వెళ్ళాడని నాకు అప్పుడు అర్థమయింది. అతనివంక పరీక్షగా చూశాను నిద్రలేక అతనికళ్ళు మూతలుపడి పోతున్నాయ్. అతను నావంక చూసి,

"నిద్ర రావటంలేదా?" అన్నాడు.

"మీ సంగతి ఏమిటి?" అని అడిగాను

"నిద్రపో! ప్రొద్దున్నే మాట్లాడుకుందాం" అన్నాడుమురళి.

మురళిని గురించి కాలేజీలో ఎంతోమంది చాలా చెడ్డగా చెప్పారు. కనిపించిన ప్రతిఆడపిల్లవెంట పడతాడని, ప్రేమపేరుతో ఎంతోమందిని పాడుచేశాడని పరమ దుర్మార్గుడని, ఎన్నెన్నో కట్టుకథలు చెప్పారు. అవన్నీ నమ్మాలో, నమ్మకూడదో అప్పట్లో నాకు అర్థంకాలేదు. అయినా నా జాగ్రతలో నేనున్నాను. కానీ ఈరోజు యిలా ఒంటరిగా ఒకేగదిలో మేమిద్దరం వున్నాం. నన్ను పట్టుకొని బలవంతంచేసి చివ్వరకు నాసర్వస్వాన్ని అపహరించినా నాకు దిక్కెవ్వరూ లేరు, అయినా మురళినన్ను నిజంగా ప్రేమించబట్టే నాజోలికి రాలేదు, నాకు ఇష్టంలేని ఏపనినీ అతను చేయడని నాకు అర్థమైంది.

మేమిద్దరం పెళ్ళిచేసుకొందామని ఎప్పుడో తీర్మానించుకొన్నాం. ఆ తీర్మానానికి కట్టుబడే, యీ సమయంలో మురళి నాదగ్గరకు రాలేదనే విశ్వాసం కలిగింది.

"సునీతా! నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?" అని అడిగాడు మురళి నావంక కన్నార్పకుండా నిండుగా చూస్తూ....

అమాట వినగానె నేను తృళ్ళిపడ్డాను. ఓ క్షణంక్రితం అతను గురించి నేను వూహించిన దేమిటి?....అతను ప్రశ్నించిందేమిటి?

"ఆ అనుమానం మీకు ఎందుకువచ్చింది?" అని అడిగాను.

"మనిద్దరం ఒకరినొకరం ప్రేమించుకొన్నాం. పెళ్ళి చేసుకోవాలనుకొన్నాం ఇప్పుడు నువ్వు దూరంగా ఎందుకుపడుకొన్నావ్? అని అడిగాడు.

"మనకింకా పెళ్ళికాలేదుగా!" అన్నాను నేను.

పెళ్ళిసంగతి అలావుంచు. మనిద్దరి మనసులు ఒకటైయ్యాక మనం దూరంగా ఉంటటం నాకేమీ బాగులేదు అన్నాడు చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ....

"పరీక్షలు కానివ్వండి, అప్పుడు మనిద్దరం పెళ్ళిచేసుకొంటే మనకు ఎడబాటు తప్పుతుంది, అన్నాను.. అతను పేలవంగా నవ్వుతూ నా వైపుచూశాడు.

మరలా దూరంగా ఎక్కడో పిడుగుపడింది. ఆకాశం పైకి ఎగిరి నెత్తినపడ్డట్టయింది. భూమి కంపించింది పిడుగుతోబాటు గాలి తీవ్రత ఎక్కువైంది. కిటికీ తలుపులు కొట్టుకోసాగై, ముక్కలుగా చెక్కలుగా ఎగిరిపోయేలావున్నాయ్. చలి మరింతా ఎక్కువైంది. మురళి చలితో వణికిపోతున్నాడు. నాకూ వణుకు ఎక్కువగానేవుంది వున్నది ఒక్కటే దుప్పటి దాన్ని ప్రక్కన వేసుకొని యింతవరకూ వణకిపోయాం. ఇప్పుడు దాన్ని తీసి నేను కప్పుకుంటే అతనిసంగతి ఏమిటి? అతనికిస్తే నా సంగతి ఏమిటి? అదే ప్రశ్న. ఆ ప్రశ్నతోటే నాకూ తల తిరిగిపోయింది. నాకు ప్రకృతి మీద అది చేస్తున్న అరాచకంమీద పట్టలేని కోపం వచ్చింది. "ఛీ, పాడు సినిమా, ఎందుకు వచ్చాను రాకుంటే ఇంటిదగ్గర హాయిగా నిద్రపోయేదాన్ని. యిప్పుడువచ్చి ఈ చిక్కులోపడ్డాను.ఎలాబయటపడటం. మురళి మనోభావం నాకు అర్థమయింది. ఇద్దరం కలసి ఒక్కటిగా మంచంలో పడుకుంటే.... అది తలంపుకురాగా నాకు శరీరం గగుర్పాటు చెందింది ఈ రాత్రికి ఏదో ఒకటితప్పదు. ఇద్దరం కలసి పడుకుంటే గట్టిగా కళ్ళుమూసుకున్నా యవ్వనపుపొంగులో వున్న మనస్సులు వూరుకోనిస్తాయ్యా! నిద్రరాదుకదా, నిద్రపోవాలనేబుద్ధిపుట్టదు. నాకో ఇది పరీక్ష.... "ఎందుకలా వణుకుతారు?" యీ దుప్పటి కప్పుకోండి అని దుప్పటి తీసి ఇచ్చాను అతను నా వంక చూస్తూ..

"నీకు చలిలేదా?" అని అడిగాడు. నేను ఏమీమాట్లాడలేదు. మురళీ దుప్పటి తీసుకొని నాకు దగ్గరగావచ్చి నాకూ కప్పాడు. నాకు ఇష్టంలేకపోయినా?!..

మురళీ చేసేపనికి నేను అడ్డు చెప్పేందుకు నోరు కదపలేక చూస్తూవుండిపోయాను. అలా కప్పినందుకు నాకు మనస్సు ఆనందంతో నిండిపోయింది. అతని సుఖంకన్నా నా సుఖమే ముఖ్యమని తేలిపోయింది. కానీ ఎలా కప్పుకోవడం, నాకు స్వార్థమనిపించింది.

వెంటనే దుప్పటితీసి నేనే తీసుకువెళ్ళి మురళీకికప్పి నాచీరె చెంగు తీసుకొని కప్పుకొని దూరంగా కూర్చున్నాను. కానీ నాకు చలి ఆగటంలేదు. ఎంత ఆపుకోందామనుకొన్నా నాశరీరం వణుకుతుండటం కనిపిస్తూంది. అదిచూసి మురళీ సహించకలేకపోయాడు. లేచివచ్చి నాప్రక్కన కూర్చొంటూ దుప్పటి సగంకప్పాడు. అతని శరీరం నాకు తగలటంతోటే నాలో ఏదో చలనం ప్రారంభమైంది. ఇద్దరం మరింతదగ్గరగా జరిగాము. మాకు తెలియకుండానే మా శరీరాల్లోకి వేడి ఏక్కుతుంది. మురళీ నాకేదో చెప్పాలనుకొన్నా చెప్పలేకపోతున్నాడు. నేనూ ఏదోచెప్పాలనుకున్నా చెప్పలేకపోతున్నాను. ఇద్దరికీ కళ్ళు మూతలుపడుతున్నాయ్. మేమిద్దరం ఒకరిపైనొకరు నిద్రతో ఒరిగిపోయాం. మెలకువ వచ్చి, జరిగి కూర్చొన్నాం.

దగ్గరదగ్గర కూర్చోవటం మా ఇద్దరికీ ఇబ్బందిగానే వుంది. తుఫానువలన ప్రకృతిపొందే అలజడికన్నా మా ఇద్దరిమనస్సుల్లో అలజడులు ఎక్కువైనాయ్ మేమిద్దరం ఒకరినొకరు వెర్రిగా చూస్తూ కూర్చోవటం ఆ చూపుల్లో ఎన్నిభావాలో, భయాలో ఎన్ని అగ్నిపర్వతాలు ప్రేలుతున్నవో ఎవరికి తెలుసు

"ఇలా కూర్చొంటే నీకేమనిపిస్తుంది?" అని నవ్వుతూఅడిగాడు.

"ఎప్పుడు తెల్లవారుతుందా అనిపిస్తుంది" అన్నాను.

"ఉహుఁ. నాకలా అనిపించటంలేదు. ప్రతిరాత్రీ యిలాగే వుంటే .. ఎంత హాయిగావుంటుందనిపిస్తుంది అన్నాడు. ఆమాటకు కోపంవచ్చింది. దాంతోబాటు నవ్వుకూడావచ్చింది. "ఉఁ... ఏమిటీ హాయిగా వుంటుందా? మీకేమైనా పిచ్చిపట్టిందా? ప్రతిరాత్రి యిలాగే అనుభవించదలచుకుంటే నాకేమీ అభ్యంతరంలేదు అనుభవించండి. అంటూ దుప్పటిలాక్కొని దూరంగావెళ్ళి కప్పుకొని

కూర్చున్నాను. మురళి అక్కడనుంచి కదలలేదు. అలాగే వణుకుతూ కూర్చున్నాడు. కాసేపయిన తరువాత మురళివిచూస్తే అలాగే చలికి వణుకుతూ కూర్చున్నాడు. చూస్తుంటే జాలివేసింది. అతను పిలిస్తే వెళ్ళాలని నాకు. నేను పిలిస్తే రావాలని అతనూ వున్నాడు. కానీ ఎలా పిలవడం, ఏదో ఆత్మాభిమానం ఎదురు వస్తుంది చాలా సేపటికి అతనే నోరువిప్పి-

నీకోపం చల్లబడిందా? అని అడిగాడు. నేను ఫక్కున నవ్వాను. అసలు నాకు కోపం యెందుకు? అతను చేయరాని తప్పేమీ చేయలేదే.

నాకేమీ కోపంలేదు అన్నాను.

కోపం లేకుంటే నాదగ్గరకు రాకూడదూ! అన్నాడు.

దగ్గరకు వెళ్ళాలంటేనే భయం. దూరంగా వుందామంటే మనసు వూరకుండటం లేదు. చివరకు మనసుకు లొంగిపోయి నేను లేవబోయాను బయట హోరుమంటూ గాలివేస్తోంది ఫెళఫెళమంటూ చెట్లు విరిగిపడిపోతున్నాయ్. భయంకరంగా గర్జిస్తోంది ఆకాశం ప్రతిధ్వనిమీద ప్రతిధ్వనిపైన వేసుకొని. కిటికీరెక్కలు ఫెళ్ళున విరిగి తెరుచుకున్నాయ్ గాలి వుప్పెనలావచ్చి గదంతా ఆక్రమించింది. గాలితాకిడికి కొవ్వొత్తులు ఆరిపోయాయ్. గదంతా కన్ను పొడుచుకున్నా కనుపించని చిమ్మచీకటితో నిండిపోయింది

అతడు యెప్పుడు లేచివెళ్ళాడోగాని, కిటికీతలుపులు మూయడంవల్ల గదిలోకివస్తున్న చలిగాలి ఆగిపోయింది. అతను వెళ్ళి మర్లా కొవ్వొత్తు వెలిగించాడు. ఆ వెలుగు గదంతా ప్రసరించ.ముందే. మళ్ళీ కిటికీతలుపులు వూడిపోయాయ్ వూడిపోవటమే కాదు. విరిగిపోయాయ్. ఇక రెక్కలుమూయడం సాధ్యంకాదు ఈసారి గాలితోపాటు వర్షంకూడా గదిలోకి విసిరికొట్టింది. ఆవర్షపు చినుకులతో నాబట్టలు తడిసిపోతున్నాయ్ గుండెల్లోనుండి చలి యెగజిమ్మింది. ఇద్దరం గడగడా వణికిపోతున్నాం! ఇక నాకు ఓర్పు నశించిపోయింది. ప్రకృతిమీద ఎక్కడలేని అసహ్యంయేర్పడింది!

మురళీ సాయశక్తులా గదిలోకి వర్షంరాకుండా ఆ చీకట్లో నానాతంటాలు పడుతున్నాడు. అతను చేసేపని నిష్ప్రయోజనమని నాకు తెలుసు. ఇక నేను సహించలేక డ్రెస్సింగ టేబిల్‌దగ్గర వున్న కుర్చీతీసుకువెళ్ళి మురళీకందించాను. అతను దానిని కిటికీ రెక్కలకడ్డుగా పెట్టాడు. మేమిద్దరం చాలాసేపు శ్రమపడి వర్షం,

గాలి, లోపలికి రాకుండా అవగలిగాం. వర్షంవల్ల గదంతా తడిసి పోయింది. కాళ్ళు పీకుతున్నాయ్ క్రిందకూచోడానికి వీల్లేదు. నేను వెళ్ళి మంచంమీద కూర్చున్నాను. అతను కొవ్వొత్తు వెలిగించి నాదగ్గరకు వచ్చి కూర్చున్నాడు.

"నిన్ను సినిమాకు తీసుకువెళ్ళి చాల అవస్తపెట్టానుగదూ! అన్నాడు తలవంచుకొని.

నేనేమీ మాట్లాడలేదు. నిజమే! అతని బలవంతంమీదే నేను సినిమాకు వెళ్ళాను. ఇంటికివెళ్ళే నా తల్లిదండ్రులు తప్ప కుండా కోప్పడతారు. నేనిప్పుడీ తుఫానులో చిక్కుకొని, యెన్ని అవస్తలు పడుతున్నానో అని నా తల్లిదండ్రులు గాబరాపడు తూంటారు. దీనంతటికీ కారణం మురళి. అతనిమీద నాకు పట్టరాని కోపం వచ్చింది. ఓ క్షణం తరువాత ఆలోచించాను మనసు కుదుటపర్చుకొని ఆలోచించాను. నిజంగా మురళిదికూడా యేమీ తప్పులేదని తెలిసింది యెన్నిసార్లు మేమిద్దరం కలసి సినిమాలకు వెళ్ళలేదు. యెన్నడైనా ఇలా జరిగిందా!

అనుకోకుండా తుఫాను వచ్చింది. దానికి తనేంచేస్తాడు ఎన్ని బాధలుపడ్డా ఈ రాత్రికి తెల్లవారాలి. తెల్లవారితే అన్నీ సవ్యంగా జరిగిపోతాయ్. కానీ రాత్రి ఎంతకీ తెల్లవారలేదు చలీ దుర్భ రంగానే వుంది. వమ్మల్ని దూరంగా వుండనిచ్చేలా లేదు. నిద్ర మైకంతో కళ్ళు మూతలుపడుతున్నాయ్. నిద్రలేకుండా ఇలా యెంతసేపు కూర్చోవాలి. ప్రాణం విసిగిపోతోంది బయట ప్రకృతి భీబత్సం చేస్తూనేవుంది. అది ఇప్పట్లో తగ్గుతుందని ఆశలేదు.

విధిలేక, నేను మంచంమీద ఒక ప్రక్కగా ఒదిగి పడు కున్నాను. అతనూ మరో ప్రక్కకు ఒదిగి పడుకున్నాడు. మా ఇద్దరి శరీరాలు తాకుతున్నాయ్! అలా తాకడంవల్ల మా శరీరాల్లో నుండి వేడి పుట్టుకొచ్చింది. ఆ వేడికి కాస హాయిగానే వుంది. మరింత దగ్గరకు జరిగాం. ఈసారి మరింత వేడి పుట్టుకొచ్చింది. దుప్పటికప్పుకుందామంటే ఇద్దరికీ చాలదు ఇంకా దగ్గరికి జరగాలి. యవ్వనంలోవున్న యువతీయువకులు ఇలా యేకాంతంగా, ఒకే చాలీచాలని మంచంమీద, చాలీచాలని దుప్పటిక్రింద దగ్గరగా. మరింత దగ్గరగా వత్తుకొని పడుకుంటే యేమౌతుందో మీకు తెలుసు.

యేస్పుందనాలేకుండా. పుద్రేకానికి లోనుకాకుంటూ పడుకోవటం మాటలతో పనికాదు. మనసుల్ని నిగ్రహించుకొని అలాంటి సందర్భాల్లో యెవరిని వారు కాపాడుకోవడం సాధ్యమా? అది మహర్షులకే సాధ్యంకాలేదు. ఇక మానంగతి వేరేచెప్పడం దేనికి. మురళిలో యెంత నిగ్రహం వుంది. అదే మరొకమగవాడైతే నే నీపాటికి సర్వం కోల్పోయివుండేదాన్ని మురళి జాగ్రత్తగా నన్ను కాపాడుతూ వస్తున్నాడు. నామనసుకు నొప్పితగలకుండా ప్రవర్తిస్తు న్నాడు. మా ఇద్దరకూ ఇదివరకే పెళ్లయివుంటే నేవింతదూరం మీకీకధ చెప్పే అవసరముండేదికాదు. మనసులో కోరికలే పుట్టకూడదు పుట్టిన కోరికలు త్రుంచివేయడం సాధ్యంకాదు. కామవాంఛతో కూడుకున్న కోర్కెలు అగ్నిజ్వాలకన్నా ప్రమాదకరమైనవనీ, ఆ క్షణం నాకు అర్థమయింది. నా ఆలోచనలతో నేను సతమతమైపోతున్నాను. చలికి తట్టుకోలేక నా పైనున్న దుప్పటి కొంత లాక్కొని కప్పు కున్నాడు. పక్క కుదరడం లేదు ఇద్దరమూ యెదురు బొదురుగా పడుకోవడంవల్ల మా ముక్కు పుటాలనుండి వస్తున్న వేడిగాలి, వెచ్చగా మా ముఖాలకు తగులుతోంది అతని శరీరంలోని వెచ్చ దనం నా శరీరాన్ని తాకుతోంది. మా ఇద్దరి శరీరాలూ కొలిమిలో వేసిన బంగారంలా సలసల కాగుతున్నాయ్ నా పతనావస్థ దగ్గర పడిందని వేరేచెప్పక్కర్లేదు. ఆస్థితిలోమీరేవుంటే యేంచేయగలరు?

అతని చేయి నన్ను దగ్గరకు లాక్కొంది. నేను అడ్డు పెట్ట లేను. ఇద్దరి శరీరాలూ పూర్తిగా ఏకమైపోయి, అతని నిగ్రహం సడలిపోయింది. నన్ను పూర్తిగా ఆక్రమించుకున్నాడు ముద్దులతో ప్రారంభమైన ఆ రాత్రి యేం జరిగివుంటుందో నేను వేరే చెప్ప క్కర్లేదు. నేను పూర్తిగా అతనిదాన్నయిపోయాను. ఓడిపోయాను. పరిస్థితులే నన్ను ఓడించాయ్. ఇంతకాలం నిప్పులా, విజాయితీగా తలెత్తుకు తిరిగాను. అలాంటి నేను మురళి ముందు తలవంచక తప్పలేదు తెల్లవారేసరికి తుఫాను తగ్గిపోయింది. కిటికీలోనుండిబయ టకు తొంగిచూశాను. అందమైన ప్రకృతి నాలోవిధ్వంసమైపోయింది.

మరునాడు నేను కాలేజీకి వెళ్ళలేదు రెండురోజులు గడిచాక మూడోరోజు కాలేజీకి వెళ్ళాను. మురళి కనపించలేదు. విచారిం చగా, కాలేజీకి లీవుపెట్టి వూరు వెళ్ళాడని తెలిసింది వస్తాడని, నా కోసమైనా వస్తాడనీ ప్రతిరోజూ ఎదురు చూస్తూండేదాన్ని. కాని,

లేదు. ఇక ఓర్చుకోలేక పోయాను. అతి కష్టంమీద అతని వూరి అడ్రసు సంపాదించి పుత్తరం వ్రాశాను. మళ్ళా వారం గడిచి పోయింది. నా వుత్తరానికి యే సమాధానం రాలేదు. అతనిమీద నా కెక్కడలేని కోపం వచ్చింది. యెదురుగా వుంటే యెన్నో అడిగే దాన్ని. కాని, మురళీ నన్ను మోసగించి వెళ్ళిపోయాడని పూర్తిగా అర్థమైపోయింది. అతనిపై దిగులుతో చదువుమీద ధ్యాసంతగ్గి పోయింది. చదువుమీదేకాదు; వేళకు తిండి తినాలనిగాని, నిద్రపోవా లనిగాని, ఇంటిపనులలో మా అమ్మకు సాయం చేయాలనిగాని, వుదయమే స్నానంచేసి మనసుకు నచ్చిన చీర కట్టుకొని వుల్లాసంగా కాలేజీకి వెళ్ళాలనిగాని యేమీ అనిపించడంలేదు. నన్ను నేనే పోగొట్టుకున్నట్టు దిగులుగా నీరసంగా కనిపించేదాన్ని. నాలో మార్పును కనిపెట్టి అందరూ యెందుకలా వున్నావని అడిగేవారు. యేం సమాధానం చెప్పాలో తోచేదికాదు పుస్తకాలు ముందు వేసు కొని, తెల్లవార్లూ బెడ్‌రూం లైటుముందు కూర్చొనేదాన్ని. ఆ తుఫానురాత్రి మురళీతో పొందిన శారీరకానందం గుర్తుకొచ్చేది. ఆ జ్ఞాపకం మరిచిపోదామన్నా మరుపుకు రావడంలేదు కాలప్రవా హంలో నెలరోజులు గడిచిపోయాయ్. అప్పటికీ మురళీ ఆచూకీ తెలియలేదు.

ఒకరోజు కాలేజీలో వేడుకలు జరుగుతున్నాయ్. అంద రితో పాటు నేనూ చూస్తూ కూర్చున్నాను. పూర్తయేసరికి పది గంటలయింది. ఇంటిదారి పట్టాను. మురళీ వుంటే మిద్దరం కలసి వేడుకలలో పాల్గొనేవాళ్ళం. అతను లేని కారణంగా స్నేహితురాళ్ళు యెంత బలవంతం చేసినా వేడుకలలో పాల్గొనా లనిపించలేదు. ఆ ఆలోచనలతోనే ఇంటికి వెళుతున్నాను అంతలో నా వెనుక యెవరో వస్తున్నట్లు అనుమానం కలిగింది వెనుతిరిగి చూశాను. మా కాలేజీ స్టూడెంట్సు. వాళ్ళు సామాన్యులు కారు. విచ్చలవిడిగా త్రాగడం, ఆడపిల్లలను యెత్తుకుపోవడం పాడు చేయడం వంటి అలవాట్లున్నాయని కాలేజీలో పుకార్లున్నాయ్. ఆ విషయం గుర్తుకు రాగానే నాకు భయం వేసింది. వడివడిగా నడవ డం ప్రారంభించాను. వెనుక వాళ్ళ పకపకలు, వికవికలూ విని పిస్తున్నాయి. అందులో ఒకడు "ఇదేం పతివ్రత కాదు. మురళీతో

కాంతికేఫ్‌లో ఒక రాత్రల్లా వుందట" అన్నాడు. ఆమాటవినగానే నా నెత్తిన పిడుగుపడినట్లయింది. ఆ సంగతి వీళ్ళకెలా తెలిసింది. ఎవరు చెప్పివుంటారు. ఆ రహస్యం మా ఇద్దరికీతప్ప యెవరికీ తెలీదు. ఛీ: మురళీ యెంతపనిచేశాడు. మా జీవితరహస్యాన్ని ఈ ఆకతాయి కుర్రాళ్ళకు చెప్పి మరీవెళ్ళాడు. నేను గుట్టుగా బ్రతకడం అతనికిష్టం లేదుగాబోలు. అతనితో చెడ్డానుగనుక, నేను తిరుగుబోతునని, అందరితో అలాగే చెడతానని వూహించి వుంటాడు. అందుకే ఆగుట్టు రట్టుచేసి తనదారిన తాను వెళ్ళివుంటాడు. కనీసం చెప్పనయినా చెప్పకుండా మరీ వెళ్ళాడు. ఉత్తరానికి సమాధానమైనా రాయలేదు. ఇలాంటి పచ్చిమోసగాళ్ళవలన నాలాంటి విద్యార్థినులు యిలాగే అన్యాయమైపోతున్నారు నామనసు విలవిలలాడిపోయింది.

వెనుకనుండి వాళ్ళు మాట్లాడే ప్రతిమాటా నా గుండెల్లో శూలాలుపెట్టి పొడిచినట్లువుంది. రోజూ పెందలాడే ఇంటికి వెళ్ళేదాన్ని. ఈరోజు ఫంక్షన్ కారణంగా ఆలస్యమైంది. వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయ్. ఎక్కడా జనసంచారం లేదు. మునిసిపాలిటీ ఎలక్ట్రిక్‌దీపాలుమాత్రం మినుకుమినుకు మంటున్నాయ్ దాపులలో యెక్కడా ఒక ఇల్లయినా లేదు. అంతా ఎడారిలావుంది. ఏదైనా రిక్షాగాని, టాక్సీగానివస్తుందేమోనని నలువంకలాచూశాను. ఏవీ కనిపించలేదు. ఆ నిర్జనప్రదేశం దాటితే మా ఇల్లుదగ్గరపడుతుంది. దాటటం యెలాగ? వాళ్ళను చూస్తుంటే నన్ను పాడుచేయటానికే వెంటాడుతున్నట్లర్థమౌతోంది. కాలికొద్దీ పరిగెత్తటం కన్నా నాకు దారికనిపించడంలేదు. వాళ్ళు నన్ను పేరుపెట్టి ఆగమని పిలుస్తున్నారు. నేను అవేమీ వినిపించుకోకుండా భయంకొద్దీ పరుగు ప్రారంభించాను. వాళ్ళు నన్ను యెప్పుడు సమీపించారో నాకు తెలియదు. ఒకడు నా పమిటచెంగు పట్టుకున్నాడు. విదిలించుకున్నాను. ఒకడు చెయ్యిపట్టుకున్నాడు. లాగి చెంపపగలగొట్టాను. మరొకడు నా జుట్టు పట్టుకున్నాడు. ఇంకొకడు నన్ను వెనుకనుండి కౌగలించుకొని వాడిష్టం వచ్చినట్లుగా నా శరీరాన్ని నలిపివేస్తున్నాడు. నన్ను విడిచిపెట్టమని ప్రాధేయపడ్డాను. రెండు చేతులెత్తి నమస్కరించాను. ఎలుగెత్తి నన్ను రక్షించమని అరిచాను. ఆ మృగాలు అరవకుండా నానోరు నొక్కేశారు. ఒకడు దగ్గర్లోవున్న లైటుస్తంభంకేసి చూశాడు. ఇక్కడ యేం జరుగుతుందో దూరానికి కనుపిస్తుంది. వెంటనే ఒక రాయి తీసుకొని

లైటు బద్దలుకొట్టాడు. ఆ ప్రదేశమంతా చీకటితో నిండిపో యింది. నన్ను బలవంతంగా రోడ్డు ప్రక్కనున్న పొలాల్లోకి లాక్కువెళ్ళారు. నేను ఒక్కదాన్ని. వాళ్ళు నలుగురు కామంతో మత్తెక్కిన ఆ మృగాలను నేనేం చేయగలను, వాళ్ళకు లొంగి పోవటం తప్ప మరో దారి కనుపించడం లేదు. ప్రాణం పోయినా వాళ్ళకు లొంగకూడదనుకున్నాను. దాదాపు అరగంటసేపు వాళ్ళ నుంచి తప్పించుకోవటానికి విశ్వప్రయత్నం చేశాను. అప్పటికే నా చీరను పూర్తిగా లాగివేశారు. జాకెట్టు చించివేశారు. నా శరీరం మీద లంగా బ్రాసరీ తప్ప మరేమీ లేదు నేను యేడుస్తున్నాను. గొంతు పగిలిపోయేలా అరుస్తున్నాను. దగ్గరకొచ్చినవాళ్ళనురక్కు, కొరికీ యెన్నో ప్రయత్నాలు చేస్తున్నాను. కాని వాళ్ళు బెదిరిపో లేదు. కోపంతో రెచ్చిపోతున్నారు. కామంతో నామీద విరుచుకు పడుతున్నారు. వాళ్ళతో ఎంతసేపు పోరాడగలను. అరచి అరచి గొంతు పొడారిపోయింది. ఏడ్చి ఏడ్చి కళ్ళలో నీరు ఆగిపోయింది. అలసటతో శరీరం ముద్దలా కూలిపోతోంది. శక్తి నశించిపో తోంది. ఇక ఎంతోసేపు నిలబడే శక్తి లేదు. వాళ్ళుకూడా నన్ను విడిచిపెట్టే స్థితిలో లేరు.

అందులో డేవిడ్ అనేవాడు ఎగిరి పులిలా నా మీదకు దూకి బ్రాసరీ పుటుక్కున తెంచివేశాడు. మరొకడు వాడి పేరు ముకుంద రావు వాడు నా లంగా పట్టుకు లాగివేయడానికి పలు ప్రయత్నాలు చేస్తున్నాడు. నేను కాలెత్తి మొహంమీద బలంకొద్దీ తన్నాను. ఆ తన్నుకి అతని మొహం చిట్లింది. గావుకేక పెట్టి మృగంలా విరు చుకుపడ్డాడు. అతనికి ఏం జరిగిందోనని మిగిలిన ముగ్గురు అతని దగ్గరకు పరుగెత్తారు అలాంటి సమయాన్ని నేను వృధా చేయదల చుకో లేదు. అరుస్తూ కాలికొద్దీ అరుస్తూ పరుగెడుతున్నాను. వాళ్ళు ముగ్గురు నా వెంట పడ్డారు. ముకుందం యింకా లేవలేదు. నేను చేనుదాటి రోడ్డుమీదకి వచ్చాను. వాళ్ళు ముగ్గురు నన్ను తరుము కుంటు వచ్చి చుట్టుముట్టారు.

నోటికొచ్చినట్లు పచ్చిబూతులు తిడుతున్నారు. వాళ్ళతిట్లు భరించలేకపోతున్నాను. డేవిడ్, నరహరి నరసింహం వచ్చి నన్ను చుట్టుముట్టారు. తప్పించుకొనే మార్గము కనిపించలేదు. ఆ చీకట్లో

నా కాలికేదో తగిలింది. కాలితో తడిమి చూశాను అది పగిలిపోయిన సోడాసీసా. వెంటనే వొంగి చేత్తో ఆసీసా అందుకున్నాను ఆ సీసా సగంవరకు పగిలివుంది కోపంకొద్ది ముకుందం మొఖం మీద తన్నాను. డేవిడ్ పచ్చిబూతులు కూస్తూ వచ్చి నా జుట్టు ముడిని పట్టుకున్నాడు నాకు కోపం ఆగలేదు. విడిచిపెట్టమని ఎన్నో విధాల అరచాను వాడు వినిపించుకోలేదు. చేతిలో సీసా గుండెలకు సూటిగా చూచి బలంకొద్ది పొడిచాను. మళ్ళీ, మళ్ళీ పొడిచాను. అతని ఒంట్లో రక్తం నా మొఖాన ఎగ చిమ్మింది. డేవిడ్ పెద్దగా అరచి కుప్పలా కూలిపోయాడు. అదిచూచి నరసింహం ముందుకు దూకి, నా మొఖం పగిలేలా కొట్టాడు. ఆ దెబ్బ పూర్తిగా తగలకుండా తప్పించుకున్నాను. తప్పించుకోవడమేకాదు. నా చేతిలోని సీసా నరసింహం గుండెల్లోకూడా దిగబడింది. నేనేం చేస్తున్నానో, యేమైపోతున్నానో తెలియడం లేదు. మానరక్షణకు అంతకన్నా నాకు మరోమార్గం కనుపించలేదు. నరసింహం గాయపడి పడిపోయాడు. అది చూచిన వరహరి వెనుకనుండివచ్చి, నన్ను బలంగా పట్టుకున్నాడు యెంతోసేపు అతనితో పెనుగులాడాను. అతను నన్ను క్రూరంగా కొడుతున్నాడు. తిడుతున్నాడు. ఇక సహించలేకపోయాను. నాచేతిలోని సీసా నరహరి పొట్టలో దిగబడి పేగులను బయటకు తీసుకువచ్చింది. అతన్ని కూడా యెన్నిసార్లు పొడిచానో నాకు జ్ఞాపకం లేదు. నా శరీరమంతా రక్తంతో తడిసిపోయింది నాకు చైతన్యం తప్పిపోతూంది. యెదురుగా ముకుందం గుండెలను బాదుకుంటూ కనుపించాడు. నేను లేని శక్తి తెచ్చుకొని ఒక అడుగుముందుకు వేశాను, ముకుందం గావు కేకపెట్టి నన్ను తిడుతూ పారిపోయాడు నేను ఒకసారి నరసింహాన్ని, డేవిడ్‌ని, నరహరినీ తేరిచూశాను. వాళ్ళశవాలు రక్తంలో తేలాడుతున్నాయ్ అది చూడగానే నాకు స్పృహ తప్పిపోయింది. తరువాత యేం జరిగిందో నాకు తెలీదు.

నేను కళ్ళుతెరిచి చూసేసరికి, నా చుట్టూ పోలీసులు నిలబడి వున్నారు. యెవరో నా ఒంటిమీద ఓ గుడ్డ కప్పారు. రక్తంతో తడిసిపోయిన నా శరీరం యెంతో అసహ్యంగా వుంది. రక్తపు వాసన నా ముక్కుపుటాలను ఛేదిస్తూ వుంది. నా చుట్టూ వున్న వింతగా చూస్తూ నిలబడివున్న ప్రజలు నన్నుగురించి యేమేమో చెప్పుకుంటున్నారు. కొందరి ముఖాల్లో గర్వం, మరికొందరి ముఖాలో విచారం తొణికిసలాడుతూంది. వాళ్ళందరూ నేను చేసి

పనికి మెచ్చుకుంటున్నారో, తిడుతున్నారో నా కర్థంకాలేదు. రాను రాను జన సమూహం పెరిగిపోతూంది. పోలీసులు ఆ ప్రజల్ని అదుపులో పెట్టడానికి నానా తంటాలూ పడుతున్నారు. కొంత సేప టికి పోలీసు ఆఫీసర్లు, ఫొటోగ్రాఫర్లూ వచ్చారు. నన్నేమీ ప్రశ్నించ లేదు ఫొటోలు తీసుకున్నారు. డేవిడ్, నరసింహం, నరహరి శవా లను వేన్‌లో కెక్కించారు. నన్నుకూడా వేన్‌లో కెక్కించారు. ఆ జనసముద్రాన్ని చీల్చుకొని పోలీసువేన్ మధ్యాహ్నం రెండు గంట లకు స్టేషన్‌వైపు దూసుకుపోయింది

నన్నుగురించి పట్టణమంతా వుడికిపోయింది. యెవరికి తోచి నట్లు వాళ్ళు కథలుగా చెప్పుకున్నారట. పత్రికలనిండా మా ఫొటోలు ప్రచురింపబడ్డాయ్. శీల రక్షణకోసం ముగ్గుర్ని హతమార్చిన హైందవ వీరనారి అని ఒక పత్రిక, పగతో అక్రమంగా తగాదా పెట్టుకొని, ఫంక్షన్‌నుండి ఇంటికి వెళ్తున్న ముగ్గురు విద్యార్థులను పొట్టన బెట్టుకున్న రాక్షసి అని మరో పత్రిక వ్రాసింది.

నన్ను జైలుకు తీసుకువెళ్ళాక పోలీసు ఇనస్పెక్టర్ నన్ను పిలిచి యెందుకీ హత్యలు చేశావని అడిగాడు. నేను జరిగిన సంగతంతా చెప్పాను. అలా స్టేట్‌మెంట్ వ్రాసిమ్మన్నారు. వ్రాసి చ్చాను. రెండు మూడు రోజుల తరువాత వాళ్ళు మరొక స్టేట్ మెంటు తయారుచేసి దానిమీద నాచేత సంతకం చేయించారు. సంత కం చేస్తున్నప్పుడు ముకుందం దగ్గరే వున్నాడు.

నన్ను జైల్లో పెట్టారని తెలియగానే మా అమ్మ గుండె ఆగి చనిపోయింది. ఆమెకు చాలా కాలంగా గుండె జబ్బుంది. మా నాన్నగారు ఆమెను కన్నుల్లో పెట్టుకొని జాగ్రత్తగా మందు లిప్పిస్తూ, ఇంతకాలం బ్రతికించారు. నన్ను జైల్లో పెట్టిన వార్త, నేను చేసిన పనీ విన్నాక ఆమెను బ్రతికించుకోలేకపోయారు.

మరునాడు నాన్నగారు నన్ను చూడడానికి జైలు దగ్గరకు వచ్చినప్పుడు ఆ విషయమంతా చెప్పాడు. నన్నుచూసి పసిబిడ్డలా యేడ్చాడు. ఆయన కన్నీరు చూడలేకపోయాను నాన్నగారితో యేమని చెప్పడానికీ నోరు రాలేదు నన్ను తప్పకుండా విడిపిస్తా నని, శిక్ష పడకుండా తప్పిస్తాననీ నాన్నగారెంతో ధైర్యంచెప్పారు. నాకు బెయిలు యివ్వడానికి కోర్టువారు అంగీకరించలేదని తరువాత

తెలిసింది. నేను జైల్లోనే వుండిపోయాను. 116

ఒక నెల రోజులవరకూ పోలీసులు నన్ను జైలునుండి కోర్టుకు తీసుకు వెళ్ళేవారు. సాయంత్రం వరకూ అక్కడే వుంచి తిరిగి జైలుకు తీసుకువచ్చేవారు. నా తరపున కోర్టుకు సాక్ష్యం చెప్పడానికి యెవరూ రాలేదు. వాళ్ళ తరపున మాత్రం యెందరో వచ్చారు. యేమేమిటో చెప్పారు. నాకు మొదట్నుంచీ, వారంటే పడదనీ. వాళ్ళపైన కక్షబట్టి వున్నాననీ, వాళ్ళను చంపడానికి ముందుగానే, పగిలిన సోడా సీసా దగ్గరుంచుకొని ఫంక్షన్లో కూర్చున్నాననీ. చూచినట్లే, చెప్పారు. మేజిస్ట్రీటు, పబ్లిక్ ప్రాసి కూటరూ నన్నెన్నో ప్రశ్నలువేశారు నేను వేటికీ సమాధానం చెప్పలేదు. చెప్పాలనిపించలేదు. ఎందుకంటే, నన్ను దేవిడ్, నరసింహం, నంహరీ పాడుచేశారని, నేను అపవిత్రమయిపోయా నని, అందరూ వింతగా చెప్పుకోవడం విన్నాను. ఆ మాటలువిన్న తరువాత నాకు బ్రతకాలనిపించలేదు. బయట ప్రపంచాన్ని చూడా లనిపించ లేదు. ఇంత జరిగిన తరువాతకూడా నన్ను మనసారా ప్రేమించిన మురళి, జైలు దగ్గరకు వచ్చి యేం జరిగిందనికూడా నన్ను పలకరించలేదు. అసలా తుఫాను రాత్రి తరువాతే నాకు కనుపించలేదు నేను హంతకురాలననీ, ముగ్గురిని చెరచబడి, వాళ్ళను చంపి, జైల్లోవున్నానని, మురళికూడా వినేవుంటాడు. లోకంలో జరిగే రకరకాల ప్రచారాలను నమ్మేశంటాడు. అలా నమ్మడం వల్లనే ఆతను వచ్చివుండడు. మురళిలేని జీవితం నాకెందుకు? అందుచేతనే నేను కోర్టులో నోరువిప్పి మాట్లాడలేదు. ప్రతిరోజూ కోర్టుచుట్టూ నాన్నగారు తిరుగుతూనే వుండేవారు. ఎంతో డబ్బు పోసి లాయర్నికూడా పెట్టారు ఒకరోజు లాయరుగారే నాకు చెప్పారు. మీనాన్నగారికి పక్షవాతంవచ్చి కాళ్లూ, చేతులూ, నోరూ పడిపోయింది - హాస్పటల్లో వున్నారని, నువ్వు చూడాలనుకుంటే నేను కోర్టుపర్మిషన్ పట్టుకొస్తాను అని చెప్పారు. ఒకనాడు పోలీసు ఎస్కార్టుతో నాన్నగార్ని చూడ్డానికి హాస్పటల్కు వెళ్ళాను. చూశాను. ఏడ్చాను. నాన్నగారి కళ్ళవెంట వుప్పెనలా కన్నీరు పొంగిందేగాని. నోరువిప్పి మాట్లాడలేకపోయారు. వారికి మాటకూడా పడిపోయింది. అదే నేనాకరుసారిగా నాన్నగార్ని చూడ్డం.

ఈ సంఘటనకు నెల్లాళ్ళ తరువాత జైలు సూపర్నెంటు నాకొక కవరు తెచ్చి అందించాడు. ఆ కవరు యెక్కడనుండొచ్చిందో

నా కర్థమైంది. ఆ దస్తూరి మురళీదే. గబగబా కవరు విప్పి చదువు కున్నాను. మళ్ళీమళ్ళీ చదివాను.

"ప్రియమైన ప్రేమమూర్తి సునీతకు—

మురళి వ్రాయునది.

సునీతా! నే విన్నాళ్లూ నీకు కనుపించక పోవడంవల్ల మోస గించానని భావించి వుంటావ్. నువ్వే నా ప్రాణమనీ, నువ్వే నా జీవితమనీ యెన్నో గాలిమేడలు కట్టుకున్న నేను, విన్ను మోస గించి వెళ్తానా! లేదు. మన పవిత్ర ప్రేమను సార్థకం చేసుకోవ డానికీ, విన్ను నాదాన్ని చేసుకోవడానికీ, మా పెద్దవార్ని వప్పించ డానికే వెళ్ళాను. మావాళ్ళు ఇష్టపడ లేదు. వాళ్ళకూ నాకూ ఘర్షణ జరిగింది. విన్నుతప్ప మరొకర్ని పెళ్ళి చేసుకోనని తెగవేసి చెప్పాను. మా నాన్న వట్టి మొండిఘటం. మా చిన్నాన్నకు మాత్రం నేనంటే యెంతో ప్రేమ. వారిని తీసుకువచ్చి మా నాన్నను వప్పించి అగ్నిసాక్షిగా విన్ను పెళ్లి చేసుకోవాలని హైదరాబాదు వెళ్ళాను, వప్పించాను. మా చిన్నాన్న నా పక్షాన విలబడ్డాడు మీరు కాదంటే వాడి పెళ్ళి వాడిష్టప్రకారం జరిపించి, నా ఆస్తిలో కొంతిచ్చి, నాతో పాటు వాడిని తీసుకు వెళ్తానని చెప్పారు. నేను ఒక్కగానొక్క కొడుకును కావడంవల్ల, మా అమ్మ రాత్రంతా పోరుపెట్టి నాన్న గారిని వప్పించింది.

విధికృతాన్ని యెవరూ తప్పించలేరు. నేను అన్ని ఏర్పాట్లూ చేసుకొని ఈ సంతోషవార్త నీకు చెప్పాలని ప్రయాణమయ్యాను నేనెక్కిన టాక్సీ లారీకి గుద్దుకొంది. డ్రైవర్ చనిపోయాడు. నాకు రెండు కాళ్లూ విరిగిపోయాయి. అద్దాలు పగిలి నా ముఖాన్నంతా గాయపర్చాయ్ ఆ గాయాలతో నేను హాస్పటల్‌లో పడిపోయాను. ఇప్పటికీ నేను హాస్పటల్‌లోనే వున్నాను. నువ్వు రాసిన వుత్తరాలు అమ్మతెచ్చి చూపించింది. ఆ వుత్తరాలు చదువుకొని నేనెంతగా దుఃఖించానో నీకు తెలీదు. నా దుఃఖాన్ని నువ్వు పంచుకోగలవని నాకు తెలుసు. కానీ సాహసించి ఈ విషయాన్ని నీకు తెలియపర్చ లేకపోయాను. తెలియపర్చి విన్ను దుఃఖపెట్టడం తప్ప నేనేం చేయగలను. ఈ కాళ్ళులేని వాడిని నువ్వు పెళ్ళిచేసుకుంటావని అనుకోను. నువ్విప్పుడు నాముఖాన్ని చూస్తే నువ్వు గుర్తించలేవు

కూడా! యెన్నోరోజులు నీ కీ విషయం తెలియజేయాలా వద్దాఅని ఆలోచించాను. తెలియజేయడమే న్యాయమనిపించింది. అందుకే ఈ వుత్తరం వ్రాస్తున్నాను,

నన్ను క్షమించి నువ్వు వేరే యెవరినైనా పెళ్ళిచేసుకో. నన్ను మర్చిపో. నీ సుఖమే నా సుఖం. కలకాలం సుఖసౌఖ్యాలతో నువ్వుతులతూగాలనే నా ఆకాంక్ష,భగవంతుడు నీకుమేలు చేయునుగాక.

ఇట్లు,నీ మురళి.

మురళి వ్రాసిన వుత్తరం చదువుతున్నంతసేపూ జలపాతంలా కన్నీరు ప్రవహించాయి. చేతులు వణుకుతున్నాయ్.గొంతు తడి ఆరిపోతుంది. గుండెల్లోనుంచి భయం పెల్లుబుకుతూంది. కన్నీటితో కళ్ళు పూర్తిగా చీకట్లు కమ్మాయి నాకు వుత్తరంగావి, వుత్తరంమ్మీద వున్న అక్షరాలుగానీ కనిపించటం లేదు. కాళ్ళు విరిగిపోయి, ముఖమంతా చితికిపోయి చావు బ్రతుకులలో అల్లాడిపోతున్న మురళి రూపమే కన్పించింది.

అయిపోయింది. నా ఆశలన్నీ అడుగంటిపోయినయ్. వున్న ఒక్క ఆధారంకూడా తెగిపోయింది. ఇక నా బాబుకు దిక్కెవరు? ఏనాటికైనా నా ఈ పసివాణ్ణి మురళి వచ్చి తీసుకవెళతాడని గంపెడాశతో వున్నాను. ఇప్పుడతన్ని చూసేవారే లేరు. ఇప్పుడు ఈ పసివాడికి దిక్కెవరు! కోటానుకోట్ల అనాధలలో నా బాబుకూడా ఒక అనాధ. అనాధల్నిగురించి యింకా ఆలోచించటానికి తావెక్కడుంది?

ఆ జైల్లో నేనంటే కాస్త అభిమానంగా వున్న వెంకటస్వామిని పిలచి ఒక కవరు తెచ్చిపెట్టమని అడిగాను. అతను వెంటనే వెళ్ళి ఒక కవరు తెచ్చి యిచ్చాడు. మురళికి వుత్తరం వ్రాయటానికి కూర్చున్నాను. ఏమని వ్రాయాలో ఎలా మొదలు పెట్టాలో అర్థం కాలేదు. కొంతసేపటికి మనస్సు కుదుటపర్చుకొని దూకుతున్న కన్నీటినాపుకొని చివరిలేఖ వ్రాయటానికిమొదలెట్టాను.

మురళీ!

నువ్వు ప్రేమతో వ్రాసిన ఉత్తరం అందింది నీ ఉత్తరం అసలు నాకందవలసింది కాదు. ఇక్కడ జరిగిన సంఘటనలన్నీ నువ్వు వినేవుంటావనుకుంటాను. నీకు ఆప్తమిత్రులైన దేవిడ్, ముకుందరావు, నరసింహం, నరహరి, నన్ను బలవంతంచేసి రేప్ చెయ్యటానికి ప్రయత్నం చేశారు. మానరక్షణకోసం దేవిడ్ని

నేంపాసిప, రసింహం చంపాను. యిలుకులందం పారిపోయాడు. వాళ్ళంతగా తెగించటానికి కారణం నీవే. ఆనాటి తుఫానురాత్రి జరిగినకథనంతా నీవాళ్ళతో చెప్పావు. వాళ్ళు దాన్నలుసుగా తీసుకొని నన్ను పాడుచెయ్యటానికి మృగాల్లా వెంటపడ్డారు. నాచేతిలో చచ్చిపోయారు. అందుకు ప్రతీకారంగా ప్రభుత్వం నాకు మరణశిక్ష విధించింది. నన్ను రేపో ఎల్లుండో ఉరితీస్తారు. ఉరికి వెళ్ళిపోయేముందు నువ్వు నన్నింకా ప్రేమిస్తున్నావని, నాకోసం కనికిరావి,వికలాంగుడవై పోయావని విని యెంతిగానో యేడ్చాను. నా కిస్నేళ నాతోనే అంతపోతునాయి నిన్నుచూచే అదృష్టం గాని నీ కష్టసుఖాలు పంచుకొనే భాగ్యంగాని నాకికలేదు. నీవు [illegible] గాడివని, వంచకుడవని ఎందరో ఎన్నోచెప్పారు నీ వుత్తరం [illegible]ందు నేను [illegible]డా అ[illegible] గే [illegible]నుకున్నాను. ఇప్పుడు మనప్రేమ [illegible] మైందని, దానికి మరణంలేదని న[illegible]కం గలిగింది.

మురళీ!

నాకు మళ్ళీ జన్మంటూ వుంటే నిన్నే కోరుకుంటాను. నిన్నే [illegible]ర్తగా కోరుకుంటాను. నీవు దిగులు పెట్టుకోవద్దు నేను చచ్చి[illegible]యినా నీడలా నీ వెంటనే తిరుగుతుంటాను. నువ్వు నేనులేని [illegible]ఖంవల్ల, వికలాంగ[illegible]వల్ల ఎన్నాళ్ళూ, ఎన్నేళ్ళూ బాధపడ[illegible]వోనని నా భయం. భగవంతుడు మనిద్దరిని కలిపినట్లే కలిపి, [illegible]ూరంగా విడదీశాడు. మనది పవిత్ర ప్రేమే అయితే మరొక [illegible]న్మలో తప్పకుండా కలుసుకుంటాము. ఇంతకంటే ఇంకా ఏమి [illegible]ాయను. వ్రాయటానికున్నా నాకు భావమూ లేదు, భాషలేదు. [illegible]నస్సంతా సూన్యమైపోయింది సూన్యంలోనే మనిద్దరం కలసి[illegible]యాం. వుంటాను మరి. వురికంబం ఎక్కబోయేముందు నిన్నే [illegible]నసారా తలచి తలచి మరణిస్తాను. ఇదే నా ఆఖరి వుత్తరం.

వుత్తరాన్ని వ్రాసి పోస్టు చెయ్యటానికి పంపించాను. ఆ [illegible]ాయంత్రమే జైలు డాక్టరు నన్ను పరీక్షించటానికి వచ్చాడు పరీ[illegible]ంచాడు నేను గర్భవతినని, నన్ను వురితీయటానికి వీల్లేదని [illegible]ప్పి వెళ్ళాడు. నన్ను వురితీసే అధికారం ప్రభుత్వానికి వున్నా [illegible]లో పెరిగే బిడ్డను చంపే అధికారం చట్టానికి లేదట. చట్టం [illegible]గతి ఎలా వున్నా, నేను గర్భిణితో వున్నానని మురళికి వుత్త

తం ప్రార్ధామనుకున్నాను. కాని ప్రాయలేకపోయాను. మాత్రం ప్రయోజనమేమిటి? అతన్ని చూసే దిక్కు లేదు. లేదంటే తల్లిదండ్రి లేరని కాదు. వాళ్ళెంతకాలముంటారు? వున్న రహస్యంగా పుట్టిన నా బిడ్డను అందులో జైల్లో పుట్టిన నా బిడ్డ వీడు మా మనుమడేనని చెప్పుకోగలిగిన ధైర్యం, పెంచగల ప్రేమ వాళ్ళకుంటుందా?

అదుగో దూరాన బూట్ల చప్పుడు వినిపిస్తోంది ఆ చప్పు వినగానే నా గుండె ఝల్లుమంది. పసివాడు కెవ్వున ఏడ్చాడు య కింకరులవంటి జైలు అధికారులు నాముందుకొచ్చి నిలబడ్డా వాళ్ళను చూడగానే నా బిడ్డను గుండెలకద్దుకున్నాను. పిల్లవా గుక్కపట్టి ఏడుస్తూంటే కుడిరొమ్ముని వాడి నోటికందించి దానివలె వాళ్ళను చూస్తూ వుండిపోయాను.

జైలధికారి నా వంక జాలిగా చూశాడు. ఆ గదుల్లో వున్న వాళ్ళంతా నా వైపు వింతగా చూస్తున్నారు పోలీసువాళ్ళు నావడిలోవున్న బిడ్డను బలవంతంగా లాక్కున్నా పిల్లవాడు కెవ్వుకెవ్వున ఏడుస్తున్నాడు నామనస్సు అల్లాడిపోయిం టైంఅయిపోయిందని మేజిస్ట్రేటు మరోసారి హెచ్చరించాడు నే నా బిడ్డను విడిచిపెట్టి రానని ఎదురుతిరిగాను. ఆ బిడ్డను వంతంగా భూమ్మీదపారవేసి నన్ను వురికంబానికి లాక్కెళ్తున్నా పిల్లవాని ఏడ్పులతో నేను వేసే కేకలతో జైలుగోడలు ప్రతి నిస్తున్నాయి.

చివరకు వురికంభం మీదకు తీసుకవెళ్ళి నీ కయి నిమషాలు టైం ఇస్తున్నాం. నీ ఆఖరి కోర్కె ఏమిటో చె అని అడిగారు. ఏమని చెప్పను. ఏం చెప్పాలో నాకు తోచ లేదు. భగవాన్ నా బిడ్డకు నాకు పట్టినగతే పట్టకూడదు. అ సుఖంగా వెయ్యేళ్ళు వర్ధిల్లాలి అని మాత్రమే అనుకున్నా తలారి వచ్చి నా కళ్ళకు గంతలు కట్టాడు. నాఆత్మ శాంతిగ లని ఫాదర్ ఏసుప్రభువుని ప్రార్థించాడు. నా మెడకు ఉరిత్రా తగిలించారు. నా పసివాడికి దిక్కెవ్వరు? దిక్కెవ్వరు? అరుస్తూనే వున్నాను. కాలిక్రిందున్న బల్ల తొలిగిపోయింది. త్రాడు నా గొంతుకు బిగుసకుపోయింది. నాకథ ముగిసిపోయిం



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M144 |
| పుస్తకం పేరు | స్వాతి ముత్యాలు |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Y. V. Bhanu sree |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |